ప్రభు గోపురము పూర్ణభక్తిచే గట్టించి
గోపురా జెత్తించె శ్రీపతాక—
రక్తి కీర్తనలఁ దారకములోఁ బట్టించి
త్యాగరా జెక్కించె నమృతనౌక—
భక్తికావ్యము రామభద్రుఁడే పల్కింప
పోతరా జూదించె భువనమురళి—
లలితకావ్యము కుశీలవులచేఁ బాడించి
మునిరాజు ప్రయోగించె ముక్తివీణ—
వారిలో నెవ్వఁడను గానివాఁడ నైన
నందితి పతాక, నౌకాశ్రయంబు గంటి,
మురళి నూదుచు నుంటి; నీ శరణ మంది
వీణ ప్రయోగింతు నిఁక, నీవె వినఁ దగు ప్రభు!

(106వ పద్యము)

# భావసంకీర్తన సీసత్రిశతి

-భక్తికావ్యము-

రచన:

కవిరాజహంస, కవికులాలంకార

బాలాంత్రపు వేంకటరావు

(వేంకట పార్వతీశ్వర కవులు)



సాయి జ్యోతి సమర్పణ

విశాఖ - 1999

BHAVASANKEERTANA SEESATRISATI

Devotional lyrics

By

Kavirajahamsa, Kavikulalankara

BALANTRAPU VENKATA RAO

Editor and Publisher:
Nalinikanta Rao Balantrapu
Sai Jyothi,
4/1, Sowdamini Apartments,
Lawson's Bay Colony,
Visakhapatnam-530017.

First Edition:
December 1999


Price: Rs 100/-

Copy Computerised by
Suguna Kiran Balantrapu

Kavirajahamsa's sketch drawn by
Master Mihir Balantrapu

Prelims typeset by
Vijeta Graphics,
T.S.R. Complex,
Visakhapatnam-530004.

Hymnal printed at
Papillon Printers,
Kitwe, Zambia.

Copies can be had of:
Navodaya Publishers,
Karl Marx Road,
Vijayawada-520002.

1997 మే 30వ తేదీని 93వ యేట కాకినాడలో సిద్ధిపొందిన

## స్వామీ సత్యప్రకాశ్ మెహరానంద సంస్మరణప్రచురణ

-ఆంధ్రప్రచారిణీపరిషత్తు కార్యనిర్వాహకధర్మకర్తలైన స్వామీజీ

పూర్వాశ్రమంలో స్వాతంత్ర్యసమరయోధుడు 'బాలాంత్రం'

(బాలాంత్రపు సత్యనారాయణరావు)-



మెహరానందులతో చిరంజీవి మిహిర్

పర్యవేక్షణ:

**కళాప్రపూర్ణ బాలాంత్రపు రజనీకాంతరావు**

గౌరవ సహాయ సంపాదకురాలు

**ఆచార్య (శ్రీమతి) కోలవెన్ను మలయవాసిని**

సంపాదకుడు

**నళినీకాంతరావు బాలాంత్రపు**

# అనుక్రమణిక

C. SITARAMAMURTI, M.A.,
Retd. Lecturer in English (A.P.E.S.),
Retd. Principal, Ideal College, Kakinada.

6- 21-12 East Point Colony,
Visakhapatnam - 530017.

# A HUMBLE TRIBUTE

Here lies before us, "Bhaavasankeertana Seesatrisati", a Rosary of over Three Hundred Beads - all magnificent lyrics teeming with devotional fervour, from the facile pen of Kaviraajahamsa, Kavikulaalankaara Balantrapu Venkata Rao Garu of revered memory. Each hymn is a casket embedding a precious gem from the hoard acquired by him, not only as a seasoned aspirant but also as one who totally surrendered to Him, a realised soul. The spiritual aspirant starts on his pilgrimage with orientation of his mind towards God, as the first step. His quest for Him takes him through varying attitudes and ad hoc objectives, through wavering struggles and partial achievements, through frustrations and despair, alternating with resurgence of faith and hope, through devastating doubts, yielding room to reassuring convictions. Then he reaches a crucial milestone in this arduous and perilous expedition. A flash of light discloses the Lord to his vision; a cool celestial breeze blows towards him and refreshes him; a rhapsody of the Music of the Spheres springs up and regales him. His joy knows no bounds. But, alas! this blissful experience is short-lived; it is in fact momentary, like the lightning flash! The devotee is cast into an abyss of acute agony. How to recapture it becomes his imperative concern; it is too good, too unique to be ignored, to be lost. The urge to move forward becomes persistent; the anguish of loss accentuates his quest to recapture the vision and hold it for ever. How blessed he will be, if he sees the Light that chastens, hears the Music that elevates, feels the Breeze that enlivens and the Warmth that charms, and makes them all his precious possessions! His goal is to get integrated in an exhilarating embrace with the Ever-Beloved, the Spouse Divine.

These vicissitudes in the experiences of devotees in their

spiritual odysseys are presented in this Hymnal with intimate personal knowledge and hallowed experience by our esteemed poet-mystic, Balantrapu Venkata Rao Garu. He indites, with a pen of fire, blazing truths to chase away mazy darkness; he paints, with subtle strokes, fascinating visions to enthral the readers; he strikes, with deft fingers, cascades of vigorous emotions to rouse the dull-witted; he manipulates symphonies of lilting melodies to embalm the aching hearts. A deft master of felicitous words, a seasoned craftsman of picturesque images, he weaves a dainty fabric that enchants the reader. An expert architect of ascending stairs, he carries aloft the reader's mind to Empyrean heights. A sensitive designer of orchestral symphonies, he lifts the reader's soul to exhilarating bliss. He is well known as the Resplendent Gem among the inspired tribe of poets (Kavikulaalankaara). He has the reputation of holding the Status of a Swan, a Flamingo, among singing minstrels (Kaviraajahamsa). Who else but he can worthily aspire to be the POET LAUREATE in the magnificent Court of the Lord of the Universe!

There he certainly stands, raising his voice in perpetual strains of melodious panegyrics, winning the gracious nod of the Lord and the applause of the blessed denizens!

Visakhapatnam, C. SITARAMAMURTI
18-7-1998.

Dr SALVA KRISHNA MURTHY,
M A, M Litt, Ph D,
Retired Professor & Head,
Department of Telugu,
Presidency College,
Madras - 600 005

Residence
"SRI DURG"
L/77, 10th West Street,
Kamaraj Nagar,
Lattice Bridge Road,
Madras - 600 041

# పీఠిక

చర్వాక్షమమైన అనుభూతి కళలకు - అందునా కవితాకళకు ప్రమేయ పరిధి చర్వకందనిది అతీంద్రియ భూమికకు చెంది యోగావరణం లోకి పోతుంది ఒకవిధంగా భక్తి కావ్యాలు ఈ రెండు పొలిమేరల మధ్య పడతాయి అయినా వాటిలో కొంత విశేషం ఉంది

లౌకిక వస్తు ప్రధానాలైన కావ్యాల వల్ల సద్యః పరనిర్వృతి కలుగుతుంది రసానందం కలుగుతుంది. భక్తి వల్ల శాంతి, పరమానందం కలుగుతాయి భక్తిసౌలభ్యాన్ని చెప్తూ నారదభక్తిసూత్రము 'శాంతి రూపాత్, పరమానందస్వరూపాచ్చ' (సూ 60) అంటున్నది భక్తి వల్ల మనస్సుకు ఉండే 'విక్షేప'గుణం పోతుందని, శాంత్యానందాలు కలుగుతా యని పెద్దలు చెప్తారు భక్తులకు జాతి, విద్య, రూపం, కులం, ధనం, క్రియ మొదలైన ఏ భేదాలు అడ్డురావు 'నాస్తి తేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాది భేదః' (నా భ సూ 72) భక్త్యనుభూతి 'మూకాస్వాదనవత్' ఉంటుందని- అనగా మూగవాడు రుచ్యపదార్థాన్ని తింటూ ఇలా ఉందని చెప్పలేనట్లుంటుందని నారదుడు (సూ.52) అందుచేతనే ఇలాంటి వాటిలో వాదం పనికిరాదు అసలు అతీంద్రియ విషయాలను తర్కించరాదు తర్కం లోకాన్ని ఆశ్రయించి ఏర్పడింది ఈ తర్కం అతీంద్రియాంశాలకు పనికి రాదు పైగా దానికి 'అప్రతిష్ఠాన' మనే దోషం ఉన్నది అంటే తర్కం దేన్నీ స్థాపించలేదు వాద మాత్రంగానే మిగిలి పోతుంది మరి లోకం ఎలా ఉంది?

దైవాన్ని తెలియక పోవటమే లోకం లోకంలో లోకాయతం చాల సహజం ఒసాది ఆత్మ ఉన్నదా? దేవు డున్నాడా? ఈప్రశ్నలకు లోకులకు అనగా హేతువాదులకు తృప్తిగా చెప్పి నమ్మించటం కష్టం ఎందు కంటే ఇవి ఉన్నవనుకొని సాధించవలసినవి

'అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః
అస్తీ త్యేవోపలబ్ధస్య తత్త్వ భావః ప్రసీదతి॥' (కఠోపనిషత్ 6-13)

ఈ ఆత్మవస్తువూ అంత సులభంగా లభించేది కాదు. దాని కిష్టమైతే అదే తనకు తానుగా ప్రసన్నమవుతుంది

'నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥' (కఠోపనిషత్: 2-23)

ఆత్మ విషయమే ఇట్లుంటే పరమాత్మ అనబడే భగవంతుని విషయం చెప్పవలెనా? ఇంద్రియాలకంటె అర్థాలు, అర్థాలకంటె మనస్సు, మనస్సు కంటె బుద్ధి, బుద్ధి కంటె ఆత్మ, ఆత్మ కంటె మహత్తు, మహత్తు కంటె పురుషుడు మిన్న ఆత్మ పరమాత్మల మధ్య మహత్తొకటి తరింపవలసినది ఉందనేది గమనించాలి

భగవంతుడొక్కడే 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి,ఇంద్రం యమం మాతరిశ్వాన మాహుః' అంటున్నది మహాసౌర మంత్ర పారం

'ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వ వ్యాపీ సర్వభూ తాంత రాత్మా
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' (శ్వేతాశ్వతరోపనిషత్ 6-11)

జీవాత్మతోనే పరమాత్మ దర్శనానికి ప్రయత్నించాలనటానికి మాయోపాధికి లోపడిన జీవుడే దాన్ని దాటినపుడు దేవుడౌతున్నాడనటానికే పై ఉదాహరణ

భగవద్విభూతిని ఐశ్వర్యాన్ని తెలుసుకొమ్మని కాశ్యపుడు చెప్తే, ఆత్మను మాత్రమే తెలుసుకొమ్మని బాదరాయణుడు, ఈ రెండింటిని తెలుసుకొమ్మని శాండిల్యుడు చెప్తున్నారు 'తా మైశ్వర్యపరాం కాశ్యపః పరత్వాత్', 'ఆత్మైకపరాం బాదరాయణః', 'ఉభయపరాం శాండిల్యః శబ్దోపపత్తిభ్యామ్' (శాండిల్య భక్తి సూత్రమ్ 2-1-29, 30,31)

ఈ భగవంతుడు తన నెట్లా ఆడిస్తున్నాడో ఈ పద్యం చెప్తుంది చూడండి·

'మబ్బు లోపలి చందమామ చందంబున
నా మాయమనసు వెన్కనె చరింతు
గుబురు లోపలి గండుఁగోయిల వడువున
నా నెమ్మదినె డాఁగి నన్నుఁ బిలుతు
పసిరిక పట్టు లోపలి యిట్టి వలెనె నా
యంతరంగములోనె గంతు లిడుదు
తమ్మి పూ లోపలి తుమ్మెద రీతి నా
యెద లోనె తిరుగుచు రొదలొనర్తు
నిన్ను దాచికొంటి నన్ను నా తెల్వినే
పలుకు నేర్పు రామచిలుక వగుచు
మానసమున నడల మప్పు రాయంచవై
కొంటె వగుచు నాచి కొంటివి ప్రభు!' (భావసంకీర్తన సీస త్రిశతి -32)

ఈ భక్తిభావం ఋగ్వేదమంత ప్రాచీనం (1-156-2,3) శ్వేతాశ్వతరోపనిషత్తు 'యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ' (6-23) అంటూ 'భక్తి' శబ్దాన్నే వాడింది మహాభారతంలోని నారాయణీయం, విష్ణుపురాణం, భగవద్గీత, భాగవతపురాణం, పాంచరాత్రాగమాలు, శాండిల్యనారద భక్తిసూత్రాలు దీనికి ఆకర గ్రంథాలు నారాయణతీర్థులు వ్రాసిన 'భక్తిచంద్రిక' అనే శాండిల్యసూత్ర వ్యాఖ్య ఒకటి, 'భక్త్యధికరణ మాల' అనేది మరొకటి ముఖ్యగ్రంథాలే ఇవి కాక పంద్రెండో శతాబ్ది నాటి 'భక్తి మీమాంస' అనే 102 సూత్రాల గ్రంథ మొకటి, 'పరాభక్తిసూత్రాణి' అనే 26 సూత్రాల చిన్నగ్రంథం మరొకటి ఉన్నై

భక్తికావ్యాల విషయాల్లో గమనింపవలసిన ఒక ముఖ్యాంశం ఉంది భక్తి అనేది ఆత్మవిషయమో భగవద్విషయమో అయిన రాగం, లేదా అనురాగం ఇది రసశబ్ద వాచ్యం శాండిల్యభక్తిసూత్రమ్ -

'ద్వేష ప్రతిపక్ష భావాత్ రసశబ్దాచ్చ రాగః' (1-1-6)

అంటున్నది

' తద్విరోధినీ చ భక్తిరీశ్వర విషయైవానురక్తి రితి యుజ్య కించ ', 'రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి' (తై ఉ 2-7), 'ఇతి బ్రహ్మానన్దావిర్భావ ముక్తేర్బ్రహ్మ గోచరస్య రసస్య హేతుతాஉవగమ్యతేః రసశ్చ రాగః' అని స్వప్నేశ్వర వ్యాఖ్య ఇట్టి భావంతోనే మధుసూదన సరస్వతి 'భగవద్భక్తి రసాయనం' లో భక్తిని రసంగా స్థాపించినారు రూపగోస్వామి 'ఉజ్జ్వలనీలమ' ణీత్యాదులు కృష్ణభక్తి ప్రధానాలు పంచ భూతాలు, సూర్యచంద్రులు, యజమానుడు అనే అష్టమూర్తి రూపాన దేశకాలావచ్ఛిన్నమైన తత్త్వము (God Immanent) ఈశ్వరుడైతే, దేశకాలానవచ్ఛిన్నమైన తత్త్వం (God Transcendental) విష్ణువు ఇంతే శైవ వైష్ణవాల భేద స్వరూపం

## 2

'భావసంకీర్తన సీస త్రిశతి' అనే ప్రకృత గ్రంథాన్ని గురించి కొన్ని మాటలైనా వ్రాయటం నా కర్తవ్యం ఇది వస్తుకావ్యం - అంటే కథాప్రధానమైన కావ్యం - కాదు 'భక్తి రూపక పద్యకావ్యం' భక్త్యనుభూతి మూకాస్వాదనవతుగా ఉంటుందని ముందే చెప్పాను అది అనుభవైకవేద్యం

నా సాహిత్య జీవితంలో మూడు నాలుగు పర్యాయాలే ఇలాంటి అనుభూతి సంభవించింది 1953లో మద్రాసు తెనుగు భాషా సమితి ఉంటున్న విశ్వవిద్యాలయప్రాంగణంలో నండూరి సుబ్బారావుగారు ఎంకిపాటలు గానం చేసినపుడు, విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు వారే పాడగా విన్నపుడు, బిరుదరాజు రామరాజుగారి 'సత్యసాయి విన్నపములు' చదివినపుడు, ఇప్పుడీ 'భావసంకీర్తన సీస త్రిశతి' చదివినపుడు

కవిరాజహంస, కవికులాలంకార బిరుదాంచితులు శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారి కృతి యిది. ఈ నాటి పాఠకుల కొరకు వారిని గూర్చిన కొన్ని మాటలు వ్రాయవలసి ఉంది

ఈ శతాబ్దపు తెనుగు సాహిత్యసీమలో 'వేంకటపార్వతీశ్వరకవులు' సుగృహీత నామధేయులు. వేంకటపార్వతీశ్వరకవులు అంటే శ్రీ బాలాంత్రపు వేంకటరావు (1881-1972), శ్రీ వోలేటి పార్వతీశం (1882-1955) గారలు. ఈ శతాబ్దం అని ఎందుకన్నానంటే ఈ జంటకవుల కవితాసాహిత్యవ్యాసంగం, 1903-4

నాటి ఆచంట సాంఖ్యాయన శర్మగారు నడిపిన 'కల్పలత పత్రిక' లో ఆరంభమైంది 1911 ప్రాంతంలో ఆంధ్రప్రచారిణీ గ్రంధమాలతో పాదుకొన్నది శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారి కృతి ఇప్పుడు ఇట్లు ప్రచురింపబడుతున్నది

కాగా వారి కవితా వ్యాసంగం దాదాపు ఇరవయ్యో శతాబ్దం అంతా వ్యాపించిందనటం స్పష్టం 1913లో 20 పద్యమాలికలతోడి వారి 'హారావళి' మొదటి సంపుటం,1914 లో మరో ఏడు పద్యమాలికలతో 'హారావళి' రెండవ సంపుటం, 1917 లో వారి 'బాలగీతావళి' పద్య వాచకాలు నాలుగు భాగాలు,1921 లో 'బాలగీతావళి నర్సరీ రైమ్స్',1922లో వారి "ఏకాంతసేవ',1924నాటి 'కావ్యకుసుమావళి' రెండుభాగాలు,1935 లో అచ్చయిన 'బృందావనము'(1929 లో పిఠాపురం యువరాజులు రావు వేంకట మహీపతి గంగాధరరామారావు బహద్దరు వారి వివాహ సందర్భంగా వ్రాసినది) సుప్రసిద్ధాలు 'భావసంకీర్తనము' అనే 102 విలక్షణ సీస పద్యాల కూర్పు ఒకటి, జంటకవుల కృతిగా, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారి పీఠికతో 1943 డిసెంబరులో ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్‌వారు ప్రచురించారు ఈ 'భావసంకీర్తనము' నే అప్పుడు వెలువడిన 'కావ్యకుసుమావళి' షష్టిపూర్తి (ద్వితీయ) ముద్రణలో కూడా వేంకట పార్వతీశ్వరుల క్రొత్త కానుకగా చేర్చారు వారు ఈ శతకం మాతృక పోకెట్ సైజు డైరీలో శ్రీ వేంకటరావు గారు వ్రాసిపెట్టుకొన్నది వారి కుమారులు శ్రీ నళినీకాంతరావుగారి వద్ద భద్రంగా ఉన్నట్లు తెలుస్తున్నది ఇది వారి వెనుకటి గ్రంధాల విషయం ఇక్కడ తడవని మరికొన్ని రచనలు కూడా ఉన్నై తేకుమళ్ల రాజగోపాలరావుగారు వీరిని 1924 లోనే యుగకర్తలుగా ప్రస్తుతించారు

( తిరుమల-తిరుపతి దేవస్థానములవారు, తమ ధర్మ ప్రచార గ్రంధ పరంపరలో, మొదటి రెండు కాండములు మాత్రమే ప్రచురించి ఊరుకొన్న వేంకటపార్వతీశ్వర ''నిర్వచన రామాయణము'' కూడా ప్రసిద్ధమైనదే- పిఠాపురం యువరాజులు వ్రాయించింది చిత్తు వ్రాతప్రతి సహాయంతో, ఈ జంటకవుల రామాయణానువాద వైశిష్ట్యాన్ని ఉగ్గడిస్తూ సిద్ధాంతవ్యాసం వ్రాసి శ్రీ అక్కిరాజు సుందరరామకృష్ణ ఉస్మానియా యూనివర్సిటీ డాక్టరేటు సంపాదించారు- సం )

ఇప్పటి ఈ 'భావసంకీర్తన సీస త్రిశతి' వేరు దీనిని శ్రీ వేంకటరావు గారు 1948-1965 మధ్యకాలంలో వ్రాసినట్లు తెలుస్తున్నది ఎక్కువభాగం 1949 లో వ్రాయబడినదట అప్పుడప్పుడు కొన్నేసి పద్యాలు 29-12-1963 నుంచి 'ఆంధ్రప్రభ' దినపత్రిక' సారస్వతానుబంధంలో ప్రచురింపబడినై ఈ గ్రంధంలో దాదాపు మూడు అష్టోత్తర శతాలకు మించి, నికరంగా చెప్పాలంటే 5+1+320= 326 సీస పద్యాలున్నై.

వ్రాసినవారు కవిరాజహంస, కవికులాలంకార బిరుదాంచితులు శ్రీ వేంకటరావు గారు. కావ్యమా భక్తికావ్యం వారు 'జగమెఱిగిన బ్రాహ్మణు' లగుట వలననేమి, కృతి మూకాస్వాదనవతుగా అనుభవింప దగిన ఉత్తమగ్రంధ మగుట నేమి దీనికి పీఠిక అవసరమా అన్న సందేహం లేకపోలేదు అయినా శ్రీ నళినీకాంతరావు,శ్రీ రజనీకాంతరావు గారల సౌహృద బంధాన్ని కాదన లేక నే నీ మాటలు వ్రాయవలసిన వాడ నైనాను

3

ఈ 'భావ సంకీర్తన సీస త్రిశతి' ఒక అసాధారణ గ్రంధం శ్రీవారు సీసములనే ఎందుకు వ్రాసినారన్న

ఒహోఏనకు వారు తమ 'ప్రణతి' లో నన్నయి, నన్నిచోడ, లక్కన, నాచన సోమన, శ్రీనాథ, పోతన, భట్టు మూర్తి, తిమ్మనల సీసాలకు మ్రొక్కుట ఒక సమాధానం కానచ్చును ఈ చెప్పిన మహాకవుల సీసరచనా పద్ధతులు, అనంతుడు, చిత్రకవి పెద్దన, పొత్తపి వెంకటరమణ కవి లాంటి లాక్షణికులు చెప్పిన 10,12 రకాల సీసాలు ఇందులో ఎన్నెన్ని ఉన్నాయన్నది సాహిత్య విద్యార్థులు చూడ దగిన అంశం

పొత్తపి వెంకటరమణకవి ఈ సీస - గీతులు విరాట్ ఛందోభవములు అంటూ వీనికి ఆకరం ఋగ్వేదంలో ఉన్నట్లు వ్రాసినాడు 'నాగ', 'కల', 'త్రపు', 'మనోజ్ఞ', 'అవకలి' అనే అయిదున్ను ఒక్కొక్కటి పదేసి భేదాలతో మొత్తం ఏబది రకాల సీస భేదాలని చెప్పబడింది వీనిలోని 'త్రపు' శబ్దం సీసమనే లోహాన్ని చెప్తున్నది గీతాల్లోని 'ప్రసన్నపది' అనేది తెనుగులోని 'తేటగీతి' అని, 'నటి' అనే పదం 'ఆటవెలది' అని చెప్పబడింది

దేశీయమైన ఈ ఛందస్సు సంస్కృతంలోకి వెళ్ళి భరతుని నాట్యశాస్త్రంలో 'శీర్షకం' అనే ధ్రువాభేదంగా చెప్పబడింది భరతమతంలో ఈ ధ్రువలు ఆరు విధాలు శీర్షక, ఉద్ధత, అనుబంధ, విలంబిత, అడ్డిత, అవకృష్ట శిరఃస్థానంలో అంటే తారస్వరంతో గానం చేయ బడేది గనుక ఇది శీర్షకం అనబడింది దేవ -పార్థివుల విషయంలో ఈ శీర్షక, ఉద్ధత ధ్రువలను వాడాలి వీటికి పాదనియమం లేదనీ, నానావృత్త నిష్పన్నాలైన పాదాలతో కూర్చవచ్చుననీ చెప్పబడింది

భగవత్సంకీర్తనకుగా ఈ సీసాన్ని గ్రహించటంలోని విశేషం ఇది కవి ఆర్తిని తారస్థాయిలో నివేదిస్తున్న వీ పద్యాలు వీరిది సగుణోపాసనమే శివకేశవ భేద మెరుగని స్మార్తము

ఈ రచనలోని 'ప్రభు' అన్న హ్రస్వాంత సంబుద్ధి మరొక విశేషం 'ప్రభూ' అన్న దీర్ఘాంత సంబుద్ధి దూరాన ఎక్కడో ఉన్న దైవాన్ని సూచిస్తుంది ఈ హ్రస్వాంత సంబుద్ధి ఆ దైవాన్ని సాక్షాత్కారంగానో సన్నిధిగానో వ్యంజిస్తున్నది

ఈ పద్యాలు ఒక్కొక్కటి ఒక చెక్కిన శిల్పం లాంటివి భాష పారదర్శకం నా దృష్టిలో వీరి యీ రచన జేమ్స్ జాయిస్ (James Joyce) ఆంగ్ల రచనను పోలింది వాటి బలం, జవసత్వాలు వాటివే

ఇది ఆలంకారిక విమర్శ కాదని నే నెఱుగుదును కావ్యాన్ని సమ్యగ్రూపంగా అనుభవించటం నా అలవాటు ఆలంకారికమైన విశ్లేషణ పాండిత్య ప్రకటన కుపకరించినట్లుగాకావ్యాన్ని వెలకట్టటానికి ఉపకరించదు అది బుద్ధివ్యాపారము కనుక, భావవ్యాపారము కాదు గనుక ఈ కావ్యం 'భావనిర్జిత చేతసా' వ్రాయబడింది

ఇంక కావ్యగతమైన విశేషం భక్తికావ్యంలో విషయ వైవిధ్యము చాలదు గనుక పునరుక్తులు తప్పవు అయినా వీరి ఈ రచనలో జీవితంలో అందరకు అనుభవంలో ఉండే అనేకాంశాలు చెప్పబడినై కాని అవి ఛాయామాత్రాలుగా గోచరించి కవిగారి భగవదనురక్తియే ప్రధానంగా భాసిస్తున్నది

ఏకాంతసేవాది కృతులచేత వీరి మధుర భక్తి, నాయికా నాయక భావము నందలి ప్రీతి ప్రసిద్ధమే నవవిధ భక్తులలో అన్నింటికి ఇందు ఉదాహరణములు కనబడగలవు

ఈ గ్రంథానికి జీవనాడిగా ఉండేది శ్రీవారి 'ఆర్తి' ఇక్కడ ఆర్తి అనగా ప్రత్యేకమైన కష్టమని కాదు దైన్యము - దైన్య మెందుకు? భగవంతునికి అహంకారము నచ్చదు ఆయన దైన్యాన్ని మెచ్చుతాడట

'ఈశ్వర స్యాప్యభిమాన ద్వేషిత్వాత్, దైన్య ప్రియత్వాత్' (నా భ సూత్రమ్ 27)

అభిమానమంటే ఇక్కడ అహంకారం శ్రీవారి దైన్యము, ఆర్తి ఇంతింతనరానిని పాఠకునికి చిత్తద్రుతి కలగటానికి ఇవి చాలును వేరే సాధన సామగ్రి అక్కర లేదు దేవతలు పరోక్షప్రియులు (పరోక్ష ప్రియా ఇవహి దేవాః) నమస్కారప్రియులు ఇది తెలిసిన మంచిది నమస్కారము చేయుట అనగా మన అహంకారమును దుల్లజేసికొనుట

కవులకు, (మంత్ర) సాధకులకు, భక్తులకు- ఈ అహంకార నిరాసం తప్పనిసరి ఇది కరిగినగాని అవి పలుకవు కాలిదా సంతటివాడు 'ప్రాంశు లభ్యే ఫలే లోభాత్ ఉద్బాహురివ వామనః' అని వ్రాసుకోవటంలోని రహస్య మిదే- ఈ స్వీయాహంకార నిరాస భావాన్నే Keats 'negative capability' అన్నాడు సానులిప్తులై సాహంకారంగా వ్రాసేవారూ ఉన్నారు శ్రీనాధునికి పోతనకు ఉన్న తేడా తెలిస్తే ఈ రహస్యం బోధ పడుతుంది

ఇందులో కవిత్వాంశ పుష్కలంగా ఉంది 'ఆనందసామ్రాజ్య మగ్రహారముఁ జేసి పరమార్థముల నెల్ల బంచినావు' అనే కృతి సమర్పణ పద్యాల్లోని వాక్యం మొదలుకొని ఎన్ని విచ్ఛిత్తి విశేషాలైనా ఈ రచనలో దర్శించ వచ్చు జీవితకాల మంతా భగవత్సాన్నిధ్య స్పృహతో మసలిగిన శ్రీవారి భాగ్య విశేషం ఇంతింతనరానిది

కర్మరులు కాలేక కర్మాచరణాన్ని వదలనూ లేక ఉండేవారికి 'భక్తి' ఆశ్రయ మౌతుందట శ్రీవేంకట రావు గారు అట్టివారుగా కనబడుతారు ఆయన వ్యక్తిత్వం లోని 'మణివేణువు' ఈ కావ్యం మంత్ర శాస్త్రంలో 'వేణుశ్యామలా విద్య' సాహిత్య విద్యకైన మంత్రం దానికి ధ్యానశ్లోకం ఇలా ఉంది

'వక్త్ర సౌరభ సువాసిత రంధ్రో
వస్తునా పటుతరావయ వేన
గాన దోహన కలా కలనాదో
మానసే భవతు మణివేణుః'

ఈ విద్యలో ప్రత్యేకమైన బీజాక్షరం 'వేం' శ్రీ వేంకటరావుగారు తమ కవితావ్యాసంగంలో అంతా ఈ మణివేణువునే ఊదినారు సామాన్యుల కంత ఎడతెగని భక్తిధార జీవితమంతా నిలవటం అసాధ్యం ఆయన సుకృతి ఆళ్వారుల వంటి వారు

'కులం పవిత్రం, జననీ కృతార్థా, వసుంధరా పుణ్యవతీ చ తేన।
అపారసంవిత్ సుఖసాగరేస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్యచేతః॥'

ఈ కావ్యాన్ని ''సాయి జ్యోతి'' సమర్పణగా ప్రచురించి శ్రీ నళినీకాంతరావు, శ్రీరజనీకాంతరావు గారలు నిజంగానే సూర్యచంద్రుల్లాగా గోత్రాభ్యున్నతి కలిగిస్తున్నారు

ఒక గొప్ప అనుభూతి మీ ముందున్నది. అనుభవించి తరించండి.

చెన్నై, సాళ్వ కృష్ణమూర్తి

14-9-98.

డాక్టర్ సోమసుందర్ ఆవంత్స,
కవి - సాహిత్య విమర్శకుడు
కళాకేళీ నికేతన్,
పిఠాపురం - 533 450

# ప్రస్తుతి

కవిరాజహంస, కవికులాలంకార వేంకటపార్వతీశ్వర కవులు మా పిఠాపురాన్ని సంపద్వంతం చేసిన కవిపరంపరలోని వారు వీరు శ్రీ బాలాంత్రపు వేంకటరావు (1881), శ్రీ ఓలేటి పార్వతీశం (1882) కలసి జంటకవులుగా విఖ్యాతులు కేవల సంప్రదాయ వాగురలో పడి కొట్టుకోక - ఈ శతాబ్ది ఆరంభంనుంచీ (1903)ఎంతో స్వతంత్రించిన ప్రయోగవాదులు వేయేళ్ళ తెలుగు సాహిత్యానికి నవ్యాభరణాలు కైసేసినవారు

ఒక నవీన భావంతో ఒక సరళ సలలిత మనోమయ చింతనతో - ఒకటి రెండు పద్యాలతోనే కావ్యమని పేర్కొన్న ధైర్యశాలురు ఆరోజులలో కావ్యమంటే - వీసెల లెక్కన తూకానికి నిలిచే భౌతిక భారమే ప్రధాన గణనీయ మయ్యేది అట్టి సందర్భంలో వీరి పోకడ గొప్ప సాహసోపేత చర్యే! ఇరవయ్యో శతాబ్ది కవిత్వ రూపరేఖలను ఆసాంతం మార్చ గలిగిన అభినవ ప్రతిభావిస్ఫూర్తి!

వేంకటపార్వతీశ్వరకవులు ఈ శతాబ్దారంభానికే నూతనకవితాశేవుషిని ప్రదర్శించ పూనుకోవడం హర్షదాయకమే సకల సాహితీసంప్రదాయాల చుట్టుచూపుతో కవి నిర్మించేది కావ్యమేతప్ప, దాని పొడవు వెడల్పులు పరిగణనీయాలు కావన్న క్రాంతదర్శనం ప్రస్ఫుటీకరించారు 1903 లోనే వారి హారావళి (1913-14)కి ఆద్యారంభం చేశారు తెలుగు కవిత్వంలో లలిత మార్గాన్ని అవలంబించారు

అప్పటికే శ్రీమత్తిరుపతివేంకటకవులు, వేంకటరామకృష్ణకవులు, కొప్పరపు సోదర కవులు- ఇత్యాది జంటలు సాంప్రదాయిక కవిత్వాన్నే ప్రదర్శించారు అష్టావధాన శతావధాన విద్యాప్రదర్శనంతో సాహిత్యేతరులలో ఆకర్షణ కలిగించేవారు

కాని వేంకటపార్వతీశ్వరకవులు ఆ వైపునకు మొగం తిప్పలేదు సారభూత సాహిత్య నిర్మాణమే ప్రధానధ్యేయంగా - వినూత్న జీవత్తరంగాన్ని సారస్వతరంగంలో ఉత్తుంగం చేశారు 1911 నుంచీ ఆంధ్రప్రచారిణీ గ్రంధమాల ప్రారంభించి, అనుబంధ గ్రంధమాల జోడించి, వచనసాహిత్యాన్ని విరివిగా ప్రచురించ నారంభించారు తద్వారా కొత్తపాఠకులలో సాహిత్యాభిరుచిని పెంపొందింప చేశారు

1920లలో వీరు ఏకాంతసేవ అనే అపురూప కావ్యాన్ని ప్రచురించారు ఈ కావ్యంలో నాయికా నాయకుల జీవిత చరిత్ర కనిపించదు నాయిక జీవితేశ్వరుని అర్చిస్తుంది ఆద్యంతం ఆత్మార్పణ గోచరిస్తుంది ఈ కావ్యం ఆంధ్ర కావ్య ప్రపంచంలో అప్పటికి అతి నవీన మైనది నేటికీ విశిష్టమైనది అప్పటికే భావకవిత్వం పెంపు వహిస్తోంది రాయప్రోలు, అబ్బూరి, దువ్వూరి, శివశంకరులు

భావకవులుగా కొత్త ముద్ర సాధించారు కృష్ణశాస్త్రి భావకవితకు విశేష ప్రచారం కావిస్తూ, ఆ కవితలు గానం చేస్తూ, గొప్ప ఉపన్యాసాలిస్తూ దేశమంతా పర్యటిస్తున్నారు

లలిత లలితమై సుకుమారకుసుమ భావనామాధుర్యంతో వెలువడిన ఏకాంతసేవ కొక ప్రత్యేక స్థానం లభించింది మొత్తం భావకవిత్వానికే ఒక మేనిఫెస్టో అన దగిన పీఠికను కృష్ణశాస్త్రి ఆ కావ్యానికి రచించారు దానితో సందేహభావుల వాదనలు పరాస్తమయ్యాయి భావకవితాధార పరిప్లుతమై పురోగమించింది.

వైయక్తిక భావన కవితకు ప్రాణధాతు వైనందుననే ఈ ప్రక్రియకు భావకవిత్వ మని పేరు వచ్చింది

శ్రీ ముద్దుకృష్ణ సంకలనం చేసి ప్రచురించిన వైతాళికులు 1935 లో వెలువడింది కేవలం భావకవిత్వానికే ఆయన ఆ సంచయనికలో ప్రాతినిధ్యం కల్పిస్తూ, సముచిత కారణాలు వివరిస్తూ పీఠిక రచించారు గురజాడ అప్పారావుతోపాటు వేంకటపార్వతీశ్వర కవులను సైతం భావకవితకు ప్రథమ గణ్యులుగా మార్గదర్శకులుగా వివరించారు

కవి భావుకత్వమే కవిత్వానికి ప్రధాన యితివృత్తం కావడమే భావకవితా లక్షణంగా స్థిర పడింది ఈ ప్రాణ ధాతువు పూర్వకవిత్వంలో ఉన్నది కాదు ఈ శతాబ్దపు తొలి మూడు దశాబ్దాలలోనూ స్వేచ్ఛానుశీలురైన భావకవులు ఒక మహత్తర చరిత్ర సృష్టించారు జాతీయ స్వాతంత్ర్యం కోసం జరుగుతున్న పోరాటంలో - కవిత్వంలో స్వేచ్ఛ కోసం జరిగిన పోరాటం అంతర్భాగమై సంపూర్ణత్వ మందించింది

నేను పిఠాపురానికి చెందిన వాడిని కావడం వల్లనే కాకుండా చిన్నతనం నుంచీ వేంకటపార్వతీశ్వర కవులతో కలిగిన పరిచయ భాగ్యం వల్ల కూడా వారిపట్ల భక్తి శ్రద్ధలు ఎంతో పెరిగాయి పార్వతీశం గారు మరీ దగ్గర వారయ్యారు. వారు కేవలం మాతృ స్వభావులు. చల్లనివారు మెత్తనివారు కరుణాశీలి వేంకటరావుగారు పితృస్వభావ గంభీరులు మనిషి పెళుసుగా కనిపించేవారు

వేంకటరావుగారు మేధ; పార్వతీశం గారు హృదయం ఈ రెండింటి సమ్మేళనమూ వారి కవిత్వంలోనూ ఇతర రచనలలోనూ ఓతప్రోతంగా కలిసిపోయేదే. పార్వతీశంగారు తమ 73 వ ఏటనే 1955 లో వెళ్ళి పోయారు వేంకటరావు గారు 1972 లో చనిపోయారు, దాదాపు శతంజీవిగా హాయిగా బ్రతికి .

వేంకటరావుగారు ఏకాకిగా రచించిన భక్తికావ్యం ''భావసంకీర్తనము''. అది సీస శతకం. దానిని ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్ (రాజమహేంద్రవరం) వారు, 1943 డిసెంబరులో, శ్రీ శివశంకర శాస్త్రిగారి పీఠికతో జంటకవుల పేర ప్రచురించారు. సీస పద్యానికి సహజంగా సంగీత గుణం ఉంటుంది దానిని విరిచి వచన కవితవలె నడిచేటట్లు వేంకటరావు గారు శిల్పీకరించారు. ''భావసంకీర్తనము'' సీస శతక మని కాని, శతక మని కాని చెప్పలేదు-

సీస పద్యాలలో శతకాలు రచించినవారు తెలుగు సాహిత్యంలో ఎందరో లేరు ఉన్నవారిలో ఆంధ్ర నాయక శతక కర్త కాసుల పురుషోత్తమ కవి విశిష్టుడు. ఆయన సీసాలను తెలుగు

నాట స్త్రీలు, నిరక్షరాస్యులూ సైతం కంఠస్థం చేసుకునేవారు చిన్న వరసలో పాటల్లా పాడుకొనేవారు ఆ పద్యాలు ఇంటింటా పాడుకోడం వల్ల శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు తెలుగు దైవంగా సుప్రతిష్ఠుడయ్యాడు

నిజానికి నళినీగా రన్నట్లుగానే, 1943 లో అచ్చయిన భావసంకీర్తన శతకానికీ, ఇప్పుడు అచ్చు కాబోతున్న భావసంకీర్తన సీసత్రిశతికీ పోలికే లేదు 'అదే ఇది' అనుకునే ప్రమాదం లేకపోలేదు త్రిశతిలోని వన్నీ ఫక్తు సీసపద్యాలు- పసందైన పద్యాలు విశిష్టమైన షోకుతో నడుస్తాయి దీనిని ''సీసత్రిశతి'' అనడానికి 'ప్రణతి' పద్యం కారణం కావచ్చును

భక్తుడైన కవి, జగద్రక్షకుడైన ప్రభువును వేయివిధాల నుతించే భావోర్మిలనమే ఈ కావ్యానికి ఆధారం ఆ ప్రభువుకు పేరు లేదు రాముడు కాడు కృష్ణుడు కాడు శివుడు కాడు అల్లా జీసస్‌లూ కారు అందరికీ సరిపడిన మహత్ స్వరూపమే ఈ ప్రభువు అన్ని పద్యాలూ అదే మకుటంతో సాగుతాయి వీటిని భిన్న భిన్న భాషలలోనికి చక్కగా అనువదించి అందిస్తే - భిన్న భిన్న మతాల వారు ఆత్మీయంగా అందుకొని ఆదరించ గలరు ఇదొక మతాతీత ధ్యానకావ్యం

( శివశంకరులు 'భావసంకీర్తన' శతకానికి సంతరించిన తమ పీఠికలో ''గోష్ఠి ప్రార్థనలలో ఉద్బోధనావసరంలో ఇందులో ఏ పద్యమయినా సామాన్యోక్తివలె ఉచ్చరించి, ఉపన్యాసము చేయవచ్చు అటువంటి ఉద్దేశముతోనే ఈ కావ్య రచన సాగిం దనిపిస్తుంది'' అన్నారు-- సం )

ఆ ప్రభు వొక అయస్కాంత చక్రం సర్వ మానవులూ దానితో మమేక మవడానికి ప్రయత్నించే అయోమయ కణాలు అందుకే ఆ కణాలకు ఆర్తి ఆ సమాగ మాపేక్షతో, ఐక్యం కావాలనే తపన! కాని చుట్టూ ఆవరించిన గాలి దుమారం తమ ప్రయాణాన్ని అవరోధిస్తున్నది అందుకే మొర ఈ విన్నపాల నిండా గ్లాని, మనోమయ సంకటం, సంకుల తమస్సు- దాన్ని ఛేదించుకోవాలన్న ఆరాటం!

ఆ ఆరాటం వెర్రి కేకగా బయట పడదు పద్య గత భావ సాంద్రత గురించి పాఠకుడు మరోసారి పద్యం చదివి ఆలోచించాలి, తప్పదు దానిని అధిరోహించే భాషాపరమైన క్లిష్టత లేదు ఆ ఆత్మ చైతన్యంతోనే కవిరాజహంస తొలిపద్యంలో ప్రభువు పరంగా ఇలా చెప్పారు

భాష కల్పించిన బంధురస్కంధా లున్నాయి భావశాఖాపరంగా శబ్ద పల్లవాలూ ఉన్నాయి ప్రకృతి మాత్రం నిరతప్రదాతగా మనోహర పుష్పసముదాయాన్నందిస్తోంది ప్రసవాలకు పరమార్థ మైన మధుర రస పక్వ ఫలాలనూ అందిస్తోంది కవి పండితులు ఆ సర్వ సౌందర్యాల్నీ చూస్తూ కలకలారవాలు ప్రసరిస్తున్నారు సరస సల్లాపాలు ప్రసాద గుణ సమన్వితంగా ప్రపంచిస్తున్నారు ఈ దేశంలో పారే సెలయేరులు చిరంతన ఉపనిషద్వాణీ విలసిత వేణునాదాలనే సమకూరుస్తున్నాయి. గ్రహగతస్వనంతో నభస్సు ఓంకారధ్వానం వినిపిస్తోంది విశ్వ కవితా వృక్షం గురించి ఆ ప్రభువుకు బాగా పరిచయమే, సకల కవిత్వ సార సంగ్రహ వేత్తకు తన కవిత్వ లక్షణం గురించి ఏమని వివరించ గలడు? కనక తన చిత్తాన్ననుసరించి ఆ ప్రభువును ఉపాసిస్తాడు పోలికల ననుసరించి వినుతిస్తాడు - అని నివేదించుకున్న

ఈ పద్యంలో తాను విశ్వకవితా మర్యాదలను అనుసరించ దలచినట్లు ధ్వని తన ఆవేదన వక్రోక్తిమయంగా, ధ్వనిగర్భితంగా ఈ సంకీర్తనలలో గుస్తరించాడు కవి

ప్రతిపద్య రసోదయ మనడం అతిశయోక్తి కాగలదేమో కాని, ప్రతిపద్య మనోజ్ఞ మనడం మాత్రం యధార్థోక్తి! కనక ఈ కావ్యంలో ఫలానా పద్యం ఇంత సొగసని వివరించడం వ్యర్థప్రయత్నమే జీవుని వేదన పుష్కలావర్తంగా సాగుతుంది

మధుర భక్తి ప్రతీకగా మార్మిక హృదయ వేదనను ఏకాంత సేవలో సంతరించారు, వేంకట పార్వతీశ్వరులు భాషాపరంగా లలితపద బంధురంగా, నాతి దీర్ఘ సమాస మాధుర్యంతో విరచించారు

ఈ భావసంకీర్తన కావ్యం వేంకటరావుగారి స్వీయ రచన ఒక పెంకితనం ప్రతి పద్యంలోనూ కనిపిస్తుంది కవి కొలిచే ప్రభువు రూపరేఖావిలాసాలకు అతీతుడు గుణ సాంద్రుడు వక్త హృదయంలోని ఆర్తి, అశాంతి, హృదయగతక్షోభలు ప్రతి పద్యంలోనూ ప్రసాదగుణంతో అభివ్యక్త మయ్యాయి ఈ విమర్శ చదువుతున్న రసజ్ఞుడు ముందుగా ఒకసారి 36 వ పద్యం చదివితే కవిహృదయిం అవగత మవుతుంది

తూరుపు కొండ పై ఒక వెలుగు తోచింది ఆశ్చర్యానందాలు కలిగాయి. ఆ రజత కాంతి ధారకు సాష్టాంగ ప్రణామం చేశాడు ఆ కాంతి కనుసైగ చేసింది తన్ను కౌగిలించుకుంది పరవశించి శరణాగతు డయ్యాడు నట్టింట వెలుతురులో తన పసి హృదయాన్ని లాలించి ఎత్తుకో బోతే వ్రేలాడ బడ్డాడు ఏ రూపంలో కనిపిస్తే నేం గాక - అవే వెలుగులకు తాను ఛాయగా మిగిలాడు ప్రొద్దుటి కాంతిలో, ఆవు పాలు పొంగించు కున్నాడు పడమటి వెలుతురులో పైడి పళ్లెరంలో ఆరబెట్టుకున్నాడు కాని ప్రభువు వచ్చి ఆరగించ లేదు ఎటు పోయాడో తెలియదు వెలుగు రేక లందించిన సంతసమంతా ఎటో జారి పోయింది ఇరులలో కలసి పోయింది. ఈ పద్యం ఎంత హృద్యంగా నివేదిత మైందో! ఆత్మీయతా మర్యాదలు గుప్త పరచు కుంది ఇలాగే ఒక్కో పద్యం ఒక్కో వైఖరిగా, హృదయార్పణ కావిస్తుంది. ఆశ! అందినట్లే కనిపిస్తుంది అందదు. అంతలో కనుమరు గవుతుంది!

మూడు వందల చమత్కారాలనీ వివరించడం ఎలాగా సాధ్యం కాదు కనక ఒక్క పద్యం వాచవిగా వివరిస్తాను అది 264 వది.

'' నవకవితా ప్రబంధ శుకంబు నా దన్న<br>
బలికింతు నింతలోఁ బంత మేల?<br>
జాతీయ సుకవితా శారిక నా దన్న<br>
జెప్పింతు నింతలోఁ జింత యేల?<br>
మధుర భావకవిత్వ మధుపంబు నా దన్న<br>
వినిపింతు నింతలో వింత యేల?<br>
అభ్యుదయకవిత్వ హంసంబు నా దన్న<br>
రప్పింతు నింతలో రంతు లేల?

లలిత పదకవితా కోకిలంబు నాది
యన్నఁ బాడింతు నింతలో నంత యేల?
ఇంత గీర్వాణమా యన కిష్ట మేదొ
సుంత సెలవిమ్ము, నిన్ను మెప్పింతును ప్రభు!''

అదీ పద్యం ఆ ప్రభువు కవితావిలాసి తానుగా యిష్ట పడిన కవితా రీతి తన కుంది కవి సర్వ సమర్థుడు కాని అతని యిష్ట మేదో తెలియదు కనక అతనినే అడుగుతున్నాడు!

వ్యక్తిగతంగా నేను నాస్తికుణ్ణి ఒక అతిలోక శక్తిని ప్రభువుగా విశ్వసించి, చేర బిలిచి, ఆత్మగత ఆవేదనలు నివేదించుకో గలిగితే ఈ కావ్యాన్ని మరింత ఆత్మీయంగా రసించేవాడిని కదా అనుకుంటున్నాను ఆస్తికుణ్ణయితే బాధ్యతా రహితంగా, భార రహితంగా మబ్బులకన్న తేలికగా తేలిపోదునేమో అనికూడా నా కనిపిస్తోంది ఏమైనా, పాఠకుని విశ్వాసాలతో నిమిత్తం లేకుండా కవి అభిభాషణల చారిమ హృదయంగత మవడమే కావ్య విజయం కదా!

ప్రకృతి- మనిషి ముఖానికి తొడిగే మాస్కువంటిది వార్ధక్యం! పొరబాటుగానో, లాలసతోనో మాస్కును తొలగిద్దామని ప్రయత్నిస్తే, ముఖాన్నే కోల్పోయే ప్రమాదం ఉంది వార్ధక్యం మనిషి జీవితానికి శిశిరం వంటిది కరుణించి, అకాలికంగా దయ చేసే వసంతమే కవిత్వం!

వార్ధక్యంలో కవిత్వం రచించడమే కాదు- నిరంతరం పఠిస్తూ రసించడం కూడా కాలభారాన్ని జయించడమే! వసంత సౌరభంలో జీవన సౌగంధ్యాన్ని మిళితం చేసుకుంటూ ఉవ్విళ్ళూరడానికే! అందుకే భావసంకీర్తన కావ్యాన్ని, ఆస్తికులైనా కాకపోయినా, సర్వులూ భావుకహృదయంతో అధ్యయనం చేయడం అత్యావసరం

సర్వ వ్యాప్త మైన ప్రకృతి సౌందర్యంతో కవి తాదాత్మ్యం చెందుతాడు ''కంటి మింటను తారకల వితానము దోచె, విచ్చేయు గాబోలు విభుడు నేడు!'' అనుకుంటూ సంభ్రమిస్తాడు ''నింగి నవ్వులు నించె నిను గాంచి, కాకున్న మిలమిల చుక్క లేమిటికి దోచు?''అనుకుంటూ అక్కజం పొందుతాడు ''ఎచ్చితివొ లేదొ కను తెర్వ నిచ్చినావె? నాకు మతి యున్నె నీ వచ్చు దాకను ప్రభు!''అంటూ ఆత్మీయంగా అర్థిస్తాడు

ఈ కృతిలో ఆర్తితో విన్నపం చేస్తున్న అనుభూతి ప్రతిపద్యం వల్లనూ లభిస్తుంది ఇదొక శిల్పవిశేషం. మేధాపరమైన ఆలోచనా, ఉత్సేకమూ మిళితమైన విన్నాణం కృతిసమర్పణ మొదిగా చివరి పద్యం వరకూ ఈ గుణాన్నే వెలారుస్తాయి

ఇట్టి భావసంకీర్తన సీసత్రిశతిని ఇన్నాళ్లకి ఆంధ్ర పాఠక మహాజనుల కందిస్తున్న శుభ సమయంలో శ్రీ బాలాంత్రపు నళినీకాంతరావు గారిని మనసారా అభినందిస్తున్నాను

పిఠాపురం, సోమసుందర్
28-6-98.

తీర్థం శ్రీధరమూర్తి,
పూర్వపు ప్రధాన ఆంధ్రభాషా పండితులు,
మదరాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగరము,
మదరాసు - 600 005

తీర్థం గ్రామం,
(వయా) బైరెడ్డిపల్లి,
చిత్తూరు జిల్లా (ఆం ప్ర),
పిన్ - 517 415

# పరితోషము

త్రిశతి రచనకు ఆద్యుడు భర్తృహరి ఇతడు సంస్కృతములో '' సుభాషిత త్రిశతి''ని విరచించెను అందులో నీతి శతకము, శృంగార శతకము, వైరాగ్య శతకము అని మూడు విభాగములు కలవు. ఈ త్రిశతి మానవ జీవితమునకు మాననీయమైన మార్గ ప్రదర్శకముగా మన్నన గాంచి యున్నది

ఇక ''భావసంకీర్తన సీసత్రిశతి'' యపూర్వమైన, భక్తి సంభరితమైన లఘుకావ్యము సీస పద్యములలో రచితమైనది.

మకుట విన్యాసము తెలుగు శతకముల ప్రత్యేక లక్షణము. తదనుసారముగా ఇందులో ప్రతి పద్యాంతమున ''ప్రభు'' పదము విన్యస్తమైనది. ఆ ప్రభువే కవికి సర్వస్వము మనస్సు, వాక్కు,కాయము- ఇవి త్రికరణములు. త్రికరణ శుద్ధితో గూడిన వినిర్మల భక్తికి సంకేతముగా సంతరింప బడినట్లు తోచుచున్నది యీ త్రిశతి పరమార్థ కీర్తనము, భక్తి సంకీర్తనము, భావ సంకీర్తనము (ప 270) అని కవి పలుకులు.

''ప్రాయ మింతకు మిగుల గైవ్రాలకుండ'' (కాశీ) అని కవిసార్వభౌముడు శ్రీనాథుడు వచించినట్లు-

'' వయసేమొ పడమట వ్రాలిపోయిన దింక
దీని నెవ్వరు వెనుద్రిప్పలేరు'' (ప. 24)

అని తెల్పుకొని యుండుట చేత కవి దీనిని తన వార్ధకమున రచించినట్లు అవగతమగుచున్నది. ''వార్ధకే ముని వృత్తీనాం'' అను కాళిదాసు సూక్తి ననుసరించి, పారమార్థిక చింతనము పాటించిరి

అలనాటి ప్రభువులు సభ తీర్చి, యాస్థానకవుల నాదరించి, జాంబూనదాంబరాభరణాలు, అగ్రహారాలు ఇచ్చి, కపురంపు వీడె మొసగి ''కృతి రచింపుము మాకు'' అని యభ్యర్థించువారు. కవులు తమ కావ్యములను రాజులకు అంకితము చేసెడివారు. అదే రీతిలో ఈ కృతి చిత్రముగా వెలసినది.

ఉపనిషత్పీఠిఁ బేరోలగం బుండి, నన్
గవిరాజహంసను గరుణఁ బిలిచి

''కృతిగ వినుపుము, భావ సంకీర్తనంబు
అభిమతంబులు మా'' కని, సభ నుతింప,
నిచ్చఁ గపురంపుఁ దాంబూల మిచ్చినావు
వసుధ నా భాగ్య మే మనవచ్చును ప్రభు! ('కృతిసమర్పణము')
ఇకను నీకు నే నాస్థాన సుకవిని ప్రభు! (ప 193)

అని సంబరముతో -

కృతి సుధాధామ మంకితము చేసితినోయి!
భువనసాహితీ సార్వభౌమునకు నీకు
నిచ్చుకొంటి దీనిఁ బరిగ్రహింపుము ప్రభు! (ప 205)

అంటారు కవి

అయినను కవితాహంకార మేమాత్రమును లేదు తమ వినయమును ఇట్లు ప్రకటించుకొన్నారు

హరిహరునకుఁ గబ్బ మర్పించి మెప్పింపఁ
గవి సోమయాజిని గాను నేను (ప 126)
నా భావసంకీర్తన ప్రార్థనంబులు
వినిపించుకొంటివి వేదవేద్య! (ప 90)

అని సంతృప్తిని పొందినారు

ఇందలి కవిత్వము - నవకవితా ప్రబంధ శుకము, జాతీయ సుకవితా శారిక, మధుర భావ కవిత్వ మధుపము, అభ్యుదయకవిత్వ హంసము ఇత్యాదిగ పేర్కొనబడినది (ప 264) నవ్య కవిత్వము యొక్క రూపాంతరములే జాతీయకవిత్వము, భావకవిత్వము, అభ్యుదయకవిత్వము అపుడు ఏది నవ్యకవిత్వము?

త ఏవ పదవిన్యాసాః తా ఏవార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యమ్ గ్రథన కౌశలాత్!

భాషలో అవే పదములు, అవే యర్థములు అయినప్పటికి పదముల కూర్పులో గల నేర్పు వలన కావ్యము నవ్యమగును కొన్ని నూతన సంకేతముల వలనను రచనలో నవ్యత తోపవచ్చును మరియు ఆత్మాశ్రయ కవిత్వము నవ్యకవిత్వలక్షణ మని కొందరు పేర్కొందురు కవిత్వములో తన కొక స్థానమును కల్పించుకొనుట ఆత్మాశ్రయ కవిత్వ మగును మరొక పాత్ర ప్రేయసియో, భగవంతుడో

కావచ్చును విరహమో, భక్తియో, లోకానుభవమో వస్తువు ఏవం విధమగు ఆత్మాశ్రయ కవిత దాశరథీ శ్రీకాళహస్తీశ్వర శతకములయందు మనము చూడవచ్చును.

అరసెనో లేదొ చందురు చిన్ని వెన్నెలఁ
గలకల నవ్వు చెంగలువ పువ్వు (ప 23)

వెఱ్ఱి చకోరంబు విను వీడ దెందుకో!
క్రొత్త వెన్నెల జాల్కు కొనఁగఁ గాదె - (ప. 148)

చంద్రుని కాంచి నంతనె కలువలు వికసించును చకోరపక్షులు వెన్నెలను త్రాగును. ఇవి ప్రాచీన సాహిత్య మందలి కవిసమయములు.

నవ్యకవితలో నూతన సంకేతము లిట్లుండును: ప్రణయ పంచభక్ష్య పరమాన్నము (ప.36), హృదయ విపంచి మీటుట (ప 112), భువనసాహితీ సార్వభౌముఁడు (ప.205), విశ్వగాయకుని దివ్య వీణ, ప్రణయతంత్రీ శ్రుతి (ప 275) మొదలగు భావములు నవ్యములు.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్।

అని నవవిధ భక్తి భాగవతములో ప్రహ్లాదునిచే పేర్కొనబడినది. దీనికి దృష్టాంతములు ఇందులో నిండుగా గలవు. ప్రత్యేకించి మధురభక్తి విశేషముగా చూపట్టుచున్నది ''గోప్యః కామాత్'' అను భాగవత వచనము మధుర భక్తి సూత్రము. దీని ప్రకారము ఇందులో నాయిక కవి. భగవంతుడు నాయకుడు. వీరిద్దరి ప్రణయము, దాంపత్యము, విరహము, వినోదము,సంతృప్తి మున్నగు మనోవిలసనములు చక్కగా నిరూపింప బడినవి.

పతిగ నుండెద వీవు, సతిగ నుండెద నేను
జీవ దాంపత్య సంసిద్ధిఁ జూప (ప.28)

ఆలు మగల మగుచు నందఱ ముందర
కుందు లేక మసలు కొందము ప్రభు! (ప.34)

కుడువ కెందు డాఁగి కొంటివి ప్రభు! (ప.36)

దయ దలిర్పఁగ నామెడఁ దాళి కట్టి (ప.44)

వరుఁడవై యింక నన్నేలవలయును ప్రభు! (ప.59)

ఏఁ బతివ్రతనై యుంటినేని వచ్చి
పరమునందైనఁ బాదాలఁ బట్టుదు ప్రభు! (ప.157)

కవితా విశేషములు

ఘన కంకణము లందికొని నది పొంగితే
జడధులు భంగార్తిc బడగనేల? (ప 133)

ఘనుడు = గొప్పవాడు, మేఘుడు, కంకణములు = నీటి బిందువులు, బంగారు కడియములు, జడధులు- లడల కభేదము = సముద్రములు, బుద్ధిహీనులు, భంగము = అల, క్లేశము మేఘములు కురిపించిన నీరు నదిలో చేరి, నది యుప్పొంగినచో సముద్రమునకు వచ్చిన బాధ యేమి? మహనీయులు కవి ప్రతిభను గుర్తించి బంగారు కడియములు తొడిగి, కవిని సన్మానించినచో అల్పబుద్ధు లాయాస పడనేల? - అందమైన శ్లేష ఇది కవి యొక్క అనుభవమై యుండును

నీ కున్న కనులను లోకాళి కొసcగితి
కన్నవారల నేమి కాంతువయ్య? (ప 209)

భగవంతునికి సూర్య చంద్రులు రెండు కన్నులు జనులకు అహోరాత్రములందు వెలుగు నిచ్చుటకు వచ్చిరి ఇక భగవంతుడు రెండు కన్నులు లేని గ్రుడ్డి వాడయ్యెను గ్రుడ్డి వాడు తన బిడ్డల నెట్లు చూచును? ఎట్లు రక్షించును? నిందాస్తుతి లోక క్షేమము కోరి భగవంతు డేమైనను చేయునని భావము

చూచి బిడ్డల పెంపుc జూచు చేపను బోలి-
తలcచి బిడ్డలc బెంచు తాబేటి వడువున-
పొదిగి బిడ్డలc బెంచు పులుగు చందంబున- (ప 149)

చేప చూచిన చాలును, దాని సంతతి పెరుగును తాబేలు తలచినంతనె దాని పిల్లలు పెరుగును పక్షి పొదిగినచో దాని పిల్ల లెదుగును ఇది సృష్టి వైచిత్రి!

భగవద్గీతనుండి, భాగవతమునుండి, ఉపనిషత్తులనుండి కొన్ని భావముల అనుసరణము లిందు గోచరించు చున్నవి

భక్తి పళ్లెరమునc బత్రపుష్ప ఫలాంబులు (ప 62)
పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి (భ గీ)
మధుర మకరంద రసపాన మత్త మధుపమూర్తినై (ప 75)
అంబుజోదరు దివ్య పాదార వింద
చింతనామృత పాన విశేష మత్త చిత్తము (భాగ)
నల్లని మబ్బుల నడుమ మించును బోలి
సూక్ష్మంపు వరిముల్లు చొప్పుc దాల్చి

పరమాణువునకంటెఁ బరమాణు రూపమై
పసుపు పచ్చని వన్నె మిసిమితోడ
నఖిలంబుఁ దినుచుండు శిఖి శిఖా మూర్తివై
పరమాత్మవై పరబ్రహ్మ వగుచు (ప 179)

తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః
నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా!
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వ త్యణూపమా!
తస్యాః శిఖాయాః మధ్యే పరమాత్మా వ్యవస్థితః (ఉపనిషద్వాక్యము)

జఠరాగ్ని మధ్యమున సూక్ష్మముగానున్న యగ్నిశిఖ ఊర్ధ్వముగా ఎగురు చున్నది నివ్వరి ధాన్యపు ముల్లు వలె సూక్ష్మమై పచ్చని వన్నె కలిగి యణువుతో సమానమై యున్నది దాని శిఖ యొక్క మధ్యమున పరమాత్మ యుండునని భావము.

మొత్తమ్ము మీద ఈ సీసత్రిశతి రసోపనిషత్తే

ఆశయ సిద్ధి:

''మన పెండ్లి కతలెల్ల మన బిడ్డ లిఁక మీదఁ
జిత్తంబు రంజిల్లఁ జెప్పి కొనుచు,
భక్తి సంకీర్తనములుగాఁ బలుకనిమ్ము!
భావసంకీర్తనములుగాఁ బాడనిమ్ము!
పుత్ర పౌత్రాభివృద్ధిగాఁ బొగడనిమ్ము!
విని తనియు కంటె వేఱేమి వేడుక ప్రభు!'' (ప 88)

శ్రీయుతులు, సాహితీ ప్రియులు బాలాంత్రపు నళినీకాంతరావు గారు నాకు సోదర కల్పులు అర్హతలను గమనింపక, వారి మాటను కాదన లేక సాహసించినందులకు సహృదయులు మన్నింతురుగాక ఈ అవకాశము నాకు ఆమోదము గూర్చునదై యున్నది.

''పుష్పమాలాను షంగేణ సూత్రం శిరసి ధార్యతే''

చెన్నై,
21-8-98

విబుధ విధేయుడు,
తీర్థం శ్రీధరమూర్తి

ఆంధ్ర శేషగిరి రావు,
రచయిత - పత్రికాసంపాదకులు

ప్లాటు నెం 63, ఎస్ ఐ జి ,
లాసన్స్ బే కాలనీ, విశాఖపట్నం - 17

# అభినంతి

క్రౌను ఆక్టావో సైజు కంటె కొంచెం పెద్దవి, డెమ్మి ఆక్టావో సైజు కంటె కొంచెం చిన్నవి అనిపించుకొనే విడి కాగితాల మీది మాన్యుస్క్రిప్టు అది భావసంకీర్తన సీసత్రిశతి పేరిటిది శ్రీ కవిరాజహంస బాలాంత్రపు వేంకటరావుగారి రచన వారి పుత్రులు శ్రీ నళినీకాంతరావుగారు, దానిని నాకు అభిప్రాయార్థము ఇస్తూ, ప్రత్యంతరం కష్టపడి తయారుచేశాను - భద్రమని చెప్పేరు

విడివిడి కాగితాలు ఆ కాగితాలకు పత్రములని పరిభాష ''పత్ర పత్ర మందు అంతటను నీవె ప్రభు!''(ప 110)అని ఈ కావ్య వాక్కు ఈ పత్ర శబ్దముతో పుస్తకాల అనుబంధము తాటాకు పుస్తకాల కాలము నాటిది

పూర్వము పుస్తకా లన్నీ తాళపత్రఘటితములే కదా! పాండురంగ మాహాత్మ్యములో నిగమశర్మ ఇంటిలోని తాటాకు పుస్తకాలని అతని అక్క భద్రపరచిన వర్ణన ఉన్నది

ఇది అచ్చుపుస్తకాల యుగం మారిన కాలాన్ని అనుసరించి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు 'పుస్తకాల గది' అని ఒక ఖండకావ్యం వ్రాశారు అందులో వారు పుస్తకాలలో కోరి కొనుక్కొన్న పుస్తకాలు, అభిప్రాయార్థం వచ్చిన పుస్తకాలు, తరుచు చూడవలసినవి, ఎప్పుడోకాని చూడనక్కర లేనివి, ఎప్పుడూ చూడనక్కరలేనివి మున్నగు తేడాపాళాలు హెచ్చరించారు

ప్రస్తుతం నా చేతి కందిన వ్రాతపుస్తకం వేంకటపార్వతీశ్వరులు అను జంటకవులలో ఒక రైన శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు వ్రాసింది. జంటకవులుగా వారు 'బాలగీతావళి' అను పేరిట స్కూలుపిల్లల పద్యవాచక కర్తలు అందులో వారు పుస్తకప్రశస్తిని గొప్పగా చెప్పేరు:

> మది కుదురఁ జేసి చల్లని మాట చెప్పి
> కలఁక నెడలించి ధైర్యంబు కలుగఁ జేసి
> తల్లిదండ్రులఁ బోలి పెద్దలను బోలి
> సదుపదేశంబు చేయుఁ బుస్తకమె నీకు.
> మించు విజ్ఞాన జలధిఁ దేలించు నావ
> మంచిచెడ్డల గతు లేర్పరించు త్రోవ
> మానసిక రోగముల నెల్ల మాన్పు మందు
> పొగడఁ దగు విందు నీ కెందుఁ బుస్తకంబె.

ఇట్టి పద్యాలతో కూడిన ఆ వాచకపుస్తకాలు నా భార్య చిన్నప్పుడు ప్రాథమిక పాఠశాలలో ఎదివింది ఇంకా ఇప్పటికీ అప్పటప్పట జ్ఞాపకంగా చదువుతూ ఉంటుంది

ఇప్పుడు నా చేతికి వచ్చిన భావసంకీర్తనల పుస్తకం తరచి చూడగా పై వాచకపుస్తకంలో సి మాటలకు మాన్యము, విపులము అయిన వ్యాఖ్యగా ఉందననచ్చు

ఈ కావ్య నామములో త్రిశతి చేర్చేరు త్రిశతి అంటే మూడు వందలు భావసంకీర్తన సీసత్రిశతి మనవాళ్లు పూజల్లో అష్టోత్తరశత నామాలు చెబుతారు అష్టోత్తరశత మనగా 108 ఈ కావ్యంలో 324 సీసాలకు పైగా ఉన్నాయి కాగా కవి సంప్రదాయబద్ధుడై మూడు అష్టోత్తరశతాలు కూర్చినాడని తేల్చుకోవాలి

ప్రతి పద్యానికి చివర 'ప్రభు!' అని సంబుద్ధి

కావుటనే 'ప్రతి పద్యమున నిన్నె పలుకరించితిగదా' అని అంటున్నాడు కవి పలుకరింపు అనగా బతిమాలుట

పూర్వకవుల సీసాల పసందుల 'అక్షరచిత్రాల' ప్రశంస ఒక సీసమున ('ప్రణతి')

ఒక సీసమున కవి తన్ను ఈశ్వరునికి శిష్యుడిగా ఊహించుకొనుచున్నాడు

నన్ను శిష్యుని చేసికొన్నావు గాన
కీలకము చెప్పు మింక సుఖింతును ప్రభు! (ప 141)

తన్ను దాసునిగ చెప్పుకొన్నాడు కొన్ని తావు లందు

తాను గద్దింపు దాసుణ్ణి కా దంటాడు

'దాసు ననుఁ బ్రోవు మెందు కీ తగవులు?' (ప 116) అంటాడు

కొందరు కవులు విష్ణువుని ''మొదటినుండియు నీవు దామోదరుడవె'' అంటారు ఇట్టి నాటకము లేటికి అని ప్రశ్న. అట్టి తగవులు మనకి వద్దంటూ-

ఆలుమగల మగుచు నందఱ ముందర
కుందు లేక మసలు కొంటము ప్రభు! (ప 34)

అని కోరతాడు కవి ఈ భావము కావ్యమున పెచ్చరిల్లి కనిపిస్తుంది

తన్ను కల్యాణవధువుగా నెన్న మంటాడు ప్రాణేశ! హృదయేశ! జీవేశ! మున్నగు సంబుద్ధులు తాను 'కేకలో వత్తు' (ప.63) నని అంటాడు కవి

పతిగ నుండెద వీవు, సతిగ నుండెద నేను (ప 28)

అని నిశ్చితార్థము

నీ కరగ్రహణంబున నిఖిలమునకు
నే సనాతన నైతినోయీ ప్రభు! ప్రభు! (ప 93)
అన్యదుర్లభ పదము నే నందుదు ప్రభు! (ప 115)
శ్రుతుల వినుచుంటి నా జీవపతి వటంచు (ప 151)

మన్నగు కవి వాక్యములు అవలోడింప తగినవి

'మనసు మా చెడ్డ దయ్యా!' (ప 31) - కావున 'చెనఁటి మనసు నడంచి '(ప 20) అంటాడు కవి ఈ కవికి సమకాలికు లైన తిరుపతి వేంకటకవులు 'మనమా! వద్దిక నాదు మాట వినుమా!' అన్నారు - పుంజీలకొద్దీ పద్యాలలో

ఈ కవి తన 'మనసు కవయిత్రి నీ మాట మఱవదు ప్రభు!' (ప 168) అని ధైర్యంగా తెగవేసి చెప్పుచున్నాడు కనుకనే కవిరాజహంస బిరుదు ప్రస్తావన పరువమొగ ఉన్న దనుట

కవి తన సంగతి, తన ప్రజ్ఞ చెప్పుకుంటాడు హాడిస పట్టుకు

'నాకవితాకుమారి యిద్ధగుణమణి' (ప 166)
'నవ్యకావ్యకన్యాప్రదానంబ
ప్రేమ కల్యాణ మంగీకరింపుము ప్రభు!' (ప 167)

ఎంత ప్రార్థించినా దర్శనం కాలేదని చింతతో కవి అనే వాక్యములు -

'కంట బడకుండ మమ్మేల చుంటివి'
'అన్నిటికి నిన్నె మది నమ్మి యున్న నన్ను'
'ఎడముగా నుండు నీ కోస మేడ్చుచుంటి' (ప 102)

ప్రకరణశుద్ధి చేయుచున్నవి

'మొక్కు టొక్క టెఱుంగుదు' (ప 109) నన్న మాట కవి అమాయికతకు బూరగొమ్మ

'ఎంగిలి' (105) మీద, 'ఋణము'(197,198) మీద పద్యాలు మళ్లీమళ్లీ చదవాలనిపించేవిగా ఉన్నాయి

ముక్తికాంత ముచ్చట (ప.5) గ్రథిత మైనది

'అభ్యుదయసిద్ధు లిచ్చు నీ యంతవాని' నమ్మి నందుకు ఈప్సితార్థములు ఈడేరిన వని, తాను పతివ్రత నైయుంటి నని చెప్పగలిగేడు కవి విగతసందేహు డైనాడు.

'నా భావసంకీర్తన ప్రార్థనంబులు/వినిపించు కొంటివి వేదవేద్య' (ప 90) అని ఖరాఖండీ మాట

'నెమ్మేను ససి దప్పి సొమ్మసిల్లిన నేమి
రసన నీ నామ మంత్రమె జపింప
కన్నులు కావిరుల్ గ్రమ్ముచుండిన నేమి
లోదృష్టి నీమూర్తిలో లయింప
చెవులు రెండును గళ్లు చెందుచుండిన నేమి
యంతశ్శ్రుతులు నిన్నె యాలకింప
మనసు స్వాస్థ్యంబును మానియుండిన నేమి
తలఁపొగి నీ పాదములె తలంప
భూతసంసృష్టి నను వీడిపోవలేక
యెన్నొ యాతనలను బెట్టుచున్న నేమి
జన్మబాధల కొక జలాంజలి ఘటించి
శ్రీపదాశ్రయమున స్వస్తిఁ జెందెద ప్రభు!' (ప 225)

అస్తు అని పరితలు కూడ అనేదిగా ఉంది రచన.

ఈ కవికి సమకాలికులైన శ్రీ కవికొండల వేంకటరావుగారి 'మన్మైక దైవప్రార్థన' గీతము జ్ఞప్తికి వచ్చింది ఈ పుస్తకం చదువుచుండగా.

విశాఖపట్టణం, ఆంధ్ర శేషగిరి రావు
4-7-97.

# సహోదరుల నివేదన

ఇది పదాడంబరమే లేని సుగమన, ఇది సుబుద్ధి
గ్రహించి యేలికొనుము;
ఇది యలంకారవిస్తృతిఁ గోరని
శుభాంగి; ఇది స్వభావ
గ్రహించి యేలికొనుము;

... ... ...

ఇది పవిత్ర, యయోనిజ,
ఇది యనంత భక్తిభావ సంకీర్తనాభ్యాస
యోగయాగసంజాత,
ఇది మదీయాత్మజాత,
ఎలమి నర్ధాంగిగ గ్రహించి యేలుము ప్రభు!

ఇది 1943లో ప్రకటిత మయిన 102 పద్యాల ''భావసంకీర్తనము''; వచన పద్యాల నడకలో ప్రయోగశీలంలో సాగుతూ పరవళ్లు తొక్కిన శతకవిశేషం, భక్తి కావ్యం [1]

మా నాన్నగారు 1948-65ల మధ్య తమ నిత్యకవితావ్యాసంగంలో రచించిన 326 సీసపద్యాల సంకలనాన్నీ ''భావసంకీర్తనము'' అనే అన్నారు ఈ త్రిశతీ భక్తి కావ్యమే-

నూర్లు, వేలు, లక్షలు, కోట్లు నుతు లొనర్తు-
నాకుఁ బరమార్థములు నీ [illegible]ములు-
ఇఁకను నీకు నే నాస్థాన సుకవిని ప్రభు! [2]

అంటారు ఆయన 193వ పద్యంలో

మా నాన్నగారు నన్నయ, నన్నెచోడ, తిక్కన, నాచన సోమ, శ్రీనాథ, పోతన, భట్టుమూర్తి, తిమ్మనల సీసరచనా పద్ధతులకు మొక్కుతూ, ఆయా శైలుల దిక్ప్రదర్శనలో సాంప్రదాయికతకు పట్టం కడుతూ, సీసపద్యపు విశ్వరూపాన్ని సంతరించిన యీ త్రిశతిని ''భావసంకీర్తన సీసత్రిశతి''

---

1 వేంకట కవిరాజహంస ఎక్కటిగా చేసిన రచన యయినా వేంకటపార్వతీశ్వరకవు లిద్దరి పేరనూ స్వామీ శివశంకరుల పీఠికతో 1943లో ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్, రాజమహేంద్రవరం వారు ప్రకటించిన ''భావసంకీర్తన'' శతకం నుండి 99వ పద్యం

2. 1951లో పార్వతీశ కవిరాజహంస అన్నవరం దేవస్థానంవారి ఆస్థానకవిగా ''సత్యదేవ విలాసం'' అనే కావ్యం రచించి స్వామికి సమర్పించడం గమనార్హం

అనే నామంతో యీ నాడు 'సాయి జ్యోతి' సమర్పణగా ఆంధ్రపాఠకలోకానికి నివేదిస్తున్నాము

పాటతోగాని, పద్యంతోగాని భగవంతుని స్తుతించడం సంకీర్తనం. భావసంయుతమైన ఆ కవితా స్వరూపాన్ని మననం చేసికోవడమే భావసంకీర్తనం!

భావసంకీర్తన శబ్దానికి ఇప్పుడు చేసిన నిర్వచనం వల్ల - భక్తికవిత్వ చరిత్రలో తొలి వచన సంకీర్తనాచార్యు డయిన కృష్ణమాచార్యుడూ (13వ శతాబ్ది), ఆ వెంటనే పదకవితాపితామహుడు, సంకీర్తన (సంస్కృతభాష) లక్షణకర్త, త్రింశ సహస్రాతీత సంకీర్తనకర్తా అయిన అన్నమాచార్యుడూ (15వ శతాబ్ది); ఆ తరువాత భావసంకీర్తనాచార్యుడు, 20వ శతాబ్దిలో తొలి సంకీర్తన శతకకర్తా అయిన వేంకట కవిరాజహంసా - ఆయనే త్రిశతి కర్తగానూ కూడా- మన కనుల ముందు వందనీయులుగా సాక్షాత్కరిస్తారు ఈ వందనీయులలో భావసంకీర్తనాచార్యుడు వేంకట కవిరాజహంసయే-

వీరిలో తొలి వచన సంకీర్తనాచార్యు డయిన కృష్ణమాచార్యులకు ఒక చేత చిటిదండే (ఏకతారా), రెండవ చేత తాళం వెయ్యడానికి కరతాళాలు అవసరమైన హంగులు! అన్నమాచార్యులకు కూడా ఆ హంగు లవసరమే! భావసంకీర్తనాచార్యునికి మాత్రం అటువంటి హంగేదీ అవసరం లేదు.

ఇందు తొలి వచన సంకీర్తనాచార్యు డయిన కృష్ణమాచార్యుని రచన - సింహగిరి నరహరి వచనాలు తాళచ్ఛందోనియతి లేని కేవల వచన గేయం! అన్నమాచార్యులవి సహస్రాధిక లయాత్మక సంకీర్తనలు. భావసంకీర్తనాచార్యులవి పద్యసంకీర్తనములు.

తొలి శతకం(102)లో గణముల లెక్కకు సీసపద్యములయినా - మనస్సులోనూ, పైకి చదువుకోవడానికి కేవలం వచనంలాగ సాగిపోయేవి( చూ. అనుబంధం-III). త్రిశతిలో భావసంకీర్తనాచార్యుని కలం వ్రాతలో సీసం, విశ్వరూపంతో ప్రత్యక్షం అవుతుంది. అందుకనే వేంకట కవిరాజహంస యీ ముప్పురిలోను భావసంకీర్తనాచార్యుడనే బిరుదగౌరవం స్వయంగా దక్కగొనినారు! (చూ. పద్యాలు 67,99,101).

అసలు 1930లలో రచించింది వేంకట కవిరాజహంస భావసంకీర్తన శతకం. అదే 1943లో అచ్చుపడింది.

1990లలో డర్బన్ (నేటాల్) నగరంనుంచి వెలువడిన "Sai Sangeetham" (Book of Bhajans and Prayers) అన్న బృహద్గ్రంథంలో భావసంకీర్తన శబ్దము, దాని నిర్వచనము (పుట A102) తారసపడడం చిత్రం.

ఆ పుటలో (1995 ఎడిషను) సంకీర్తనం నాలుగు విధములు అని ఉంది: *గుణసంకీర్తనం*, లీలాసంకీర్తనం, భావసంకీర్తనం, నామసంకీర్తనం!

భావసంకీర్తన నిర్వచనం ఇలా ఉంది: "Bhava Samkirtan is the adoration in song of God, pictured or contacted under various relationships- e g., as granter of equanimity (*santam*), one's closest friend, guide and guardian (*sakhya*), as the child one loves and tends (*vatsalya*) or as the lover one

loves with sovereign love (*madhura*)"

ఈ పుస్తకం "Sathya Sai Baba Central Council of South Africa" వారి ప్రచురణ

x x x

''నన్నయ్య వ్రాసిన సీసములలో ఎక్కువ భాగము ఒకపాదములోనికి ఇంకొకటి అల్లుకొని పోవునవే వీనిని విశ్వనాథవారు 'గుసుగుసీసము' లనిరి ఈ తూకములోనే నేను ఏ పాదము కది విరిగిపోయి దూకుడుగా సాగిపోవు సీసమును 'గుర్రపుసీసము' అని చమత్కరించితిని'' అన్నారు డా॥ సి నారాయణరెడ్డి, తమ సిద్ధాంత వ్యాసంలో ('' ఆధునికాంధ్రకవిత్వము'' - ప్రథమ ముద్రణము, పుట 493-2వ ఫుట్‌నోటు)

''భావసంకీర్తన శతకము లోని సీసములు గుసుగుసీసములా?'' అని అడిగితే, ఆరుద్ర, అవుననీ- కాదనీ అనకుండా తన ''సమగ్ర అంధ్రసాహిత్యం'' - పాత పంద్రెండవ సంపుటం (కడపటిరాజులయుగం) చూడమన్నారు అందులో వైదర్సు అప్పయ్య '' ఉపమాక వెంకటేశ్వర శతకం'' (అముద్రితం) గురించి రాస్తూ, 227వ పుటలో - గుసుగుసీసాలు (అంటే) ''ఇందు పదములు చరణ చరణమునకు విచ్ఛేదము చెందక వంకరనడకలు గలవై తెంపులేక సాగియుండును అని ప్రాచ్యలిఖిత గ్రంధాలయ పండితులు వ్రాశారు'' అని వివరించారు

బ్రౌణ్యము 'గుసుకుసీసము' అని- 'An ambling metre,composed in a particular mode' అన్న అర్థం ఇచ్చింది. 'గుసుకు' అర్థం 'run gently' అంది శబ్దరత్నాకరం కూడా 'గుసుకు' అనే అని, 'కొద్దిపరువుగా పరుగెత్తు' అన్న అర్థం ఇచ్చింది

''కదము ద్రొక్కు తురంగ గతులఁ బట్టించెదే!
యతిమూర్తి! యీలాటి యాట లేల?

అంటారు కవిరాజహంస భావసంకీర్తన త్రిశతిలోని 67వ పద్యంలో

'కదము' అంటే అతివేగమును, అతిమందమునుగాని వంపు సొంపుల గుర్రపు పరుగు అశ్వగతు లయిదింటిలో మొదటిది!

భావాల వెంటనే పరువెత్తు పదములు, పదములతో నైక్యపడిపోవు భావముల్ అంటుంది 99వ పద్యం

''గణయతిప్రాసల కట్టలు విరియించి
వరవచోవాహినుల్ వరదవాఱి-
భక్తిభావ వేగంబున బహుముఖముల
వర్ణనాతీత పదపాటవమున వచ్చి
సరససాహిత్య సాగరేశ్వరుని నిన్నుఁ
గలసిపోవంగ నెవరాగఁ గల రిక ప్రభు!''

అని అబ్బురపడతారు కవిరాజహంస

101 వ పద్యంలో నీసం వేల 'భరతనాట్యం' చేయిస్తారు! -

''పదము పట్టింపగా, భక్తి రెట్టింపగా
పద్యమో, గద్యమో పాటఁబాడు-
లర్థ మందింపగా, హాయి పొందింపగా
జీవమో, భావమో చేతరించు-
భావ మార్ద్రింపగా, ప్రకృతి ముద్రింపగా
పాత్రమో, చిత్రమో ప్రస్ఫురించు-
రాగ మేలింపగా, రసము తేలింపగా
ధ్యానమో, గానమో తానమాడు-
భరతనాట్యంబులో నిట్లు భక్తవరుడు
సరస సంగీత సాహిత్య సార్వభౌము
నిన్ను గొనియాడి వినతు లందించు వేళ
భారతియె నీకు హారతి పట్టును ప్రభు!''

అని ప్రణుతిలిస్తారు

డా ॥ సాళ్వ కృష్ణమూర్తిగారు, తమ పీఠికను పంపుతూ, తాము ఒకే ఒక పద్యాన్ని ఉదాహరించి ఊరుకొనడానికి ఈ విధంగా కారణం చెపుతారు:

**" I have refrained from quoting the verses in my introduction partly because the reader needs the preparation for reading the work and partly because I might find myself quoting many verses once I start doing it I have quoted only one verse"**

ఆ పద్యం 32 వది భగవంతుని పరమైనది.

మాకు తోచిన కీలకమైన ఏకమాత్ర పద్యం ఏదని అడిగితే, 15వది అంటాం!

అందులో కవిరాజహంస భక్తి పరాకాష్ఠ నందుకుంది:

''గుమ్మము కడనె నీకోసము నిలుచుండి
కనుపెట్టుకొని యుంటిఁ గడచె రేయి;
ఏదొ బ్రహ్మానంద మేఁ గందు ననుకొంటి,
రా వైతి వీ వని రవిలె మనసు;
నాకుఁ గోపము వచ్చి, నా కనులకు నొట్టు
పెట్టితి నినుఁ గనుపెట్టకుండ;

శూన్యశయ్యఁ బడి, యక్షులు మూసికొంటిని;
మనసు నా దని నమ్మి మాయఁ బడితి-
కనులు విన్నవి; తనువును కదల దింక;
లేకి మన సేమొ నను వీడి లేచిపోయి,
నిన్నుఁ గనుఁగొని నీ పాదసన్నిధిఁ బడి
కదలిరా దిటు- అది నాది కా దిక ప్రభు!''

అని, దేవుడి దగ్గరికి లేచిపోయిన మనస్సుకి దేవిడీమన్నా చెపుతారు.

మేము ఒకే ఒక పద్యంతో తృప్తి పడి ఊరుకో లేము.

భక్తవరులైన కవిరాజహంస తమ తాపత్రయాన్ని 185వ పద్యంలో ఈ విధంగా వ్యక్తం చేస్తారు:

''పదముఁ బట్టెదఁగాని, పరులు మెచ్చఁగఁ గాదు,
ఏకాంతసేవ నే నెంచికొంటి-
నాట్య మాడెదఁ గాని, నలుగు రౌననఁ గాదు,
ఏకాంతసేవ నే నెంచికొంటి-
భజన సేయుదుఁ గాని, ప్రజ లహోయనఁ గాదు,
ఏకాంతసేవ నే నెంచికొంటి-
కృతులు పాడెదఁ గాని, కీర్తి కెక్కఁగఁ గాదు,
ఏకాంత సేవ నే నెంచికొంటి-
దాంతిశాంతులఁ బిల్చి వందనము లొసఁగి,
భక్తిరక్తులఁ బిల్చి శుభంబుఁ జెప్పి,
నిరత మేకాంతసేవలో నిన్నుఁ గొలుతు-
లోక మే మన్న నా కేమి లోపము? - ప్రభు!''

ఆయన న్యాయస్థాన పరిజ్ఞానాన్ని వెల్లడిస్తుంది 146వ పద్యం:

''మనవి వాదంబున వినువారలును లేరు,
చూచి వచించు సాక్షులును లేరు-
పిలు పంపు వారునుఁ బిలుచు వారును లేరు,
తెలిసిన న్యాయవాదులును లేరు-
రచ్చపట్టులు లేవు, వచ్చు వారును లేరు,
ప్రతివాది లేఁడు, తీర్పరియు లేఁడు-

వాదిని నుంటిని, ప్రతివాది లేఁడని నేనె
తీర్పు చెప్పితిని సందియము మాని-
నా మనోబుద్ధిచిత్త సంతాన మెల్ల
నన్ను విడనాడి శరణు నీ కన్న దేమొ!
మనవి వాదాన నీ వున్న మాట నిలిపి
ఏదొ పైతీర్పు నిమ్మ- నేఁ గాదన ప్రభు! -''

'ఆవాహన' అనదగిన 111వ పద్యాన్ని ఇవ్వకుండా ఉండడం ఎలాగ?

''చదల చుక్కల పేరి జపమాల లీ వోయి
తొలి మంతరపుఁ బాట తోఁచు దాఁక-
కడలి ముత్తెపు నావ నడిపింపఁ గద వోయి
బ్రదుకు పేటల పాట లదుకు దాఁక-
బ్రదుకు టామని తోఁట పల్లవింప గదోయి
జీవకోకిలము కూజించు దాఁక-
జీవవీణను ప్రపంచించి మీట గదోయి
ఆత్మ రాగాలాప మందు దాఁక-
ప్రణయ వాహినుల్ గాత్రగోత్రములఁ దెరలి,
బారు లై వచ్చి, ప్రణ వాబ్ధిఁ బడిన దాఁక-
జీవగాయకుల్ నినుఁ జేరిపోవు దాఁక-
మై మఱచు దాఁక పాటలు మాన్పకు ప్రభు!''

అని కవిరాజహంస వేడుకుంటారు.

68వ పద్యంలో సరసమైన భావాలనే మూలికలతో స్వామికి విందు! -

''పలుకుఁ జక్కెర పాట కళ సొంపొ, చెవి కింపొ,
రసన పెంపో చెప్పరావు గాని-
వలపుఁ దెమ్మెర పూవు కళ పొందొ, తల చందొ,
ముకు విందొ వచియింపఁ బోవు గాని-
తలఁపు మించుం దీవ కళ తీరొ, చద లేరొ,
యెద పేరొ, ఆనతి యీవు గాని-

ఎలమి వెన్నెల వత్తి కళపట్టొ, కసుకట్టొ,
ఆట గుట్టో చెప్పు వైని గాని-
పలుకుఁ దోఁటల నిటు వనస్పతులఁ దీసి,
సరస సద్భావమూలికా శక్తిఁ జేసి,
సచ్చిదానంద నామ రసాయనంబు
సుకవితాపాత్ర నందింప జుట్టెదె? - ప్రభు!''

అని అడుగుతారు భక్తకవి

ప్రభువునకు కృతిసుధాధామ మంకితము చేసే పద్యం 205వది

''నుడిమిన్కు ముత్యాల గొడుగుఁ బట్టితి నోయి
నిలు మోయి! యిది మాయ నీడ గాదు-
అఖిలార్ధ భర్మపల్యంకి నిల్పితి నోయి,
తగు నోయి! యిది యనర్ధకము గాదు-
తలఁపుల రతనాల కొలువుఁ దీర్చితి నోయి,
రావోయి! యిది నశ్వరంబు గాదు-
కృతి సుధాధామ మంకితము చేసితి నోయి,
కను మోయి! యిది యనక్షరము గాదు
బ్రహ్మ సృష్టికిఁ బ్రళయంబు పట్టుఁగాక
సత్కవిబ్రహ్మ సృష్టి శాశ్వత మటంచు
భువన సాహితీ సార్వభౌమునకు నీకు
నిచ్చుకొంటి దీనిఁ బరిగ్రహింపుము ప్రభు!''

ఋగ్వేద ఋక్కుల వంటి పద్యా లెన్నో ఉన్నా వాటిని గూర్చి, గ్రంథవిస్తరభీతి చేత, ప్రస్తావించడం మానుకుని రాజహంస ముగింపు పద్యంతో మా నివేదన ముగిస్తాం

'' అరిగణంబుల లోన నడు గుంప, నైనను
సాధుగణమ్మె నా సాము నోము-
కావిగోచిని గట్టు ఘనయతిఁగా, నైన
నియతిమై యతి గూర్పు నేర్తు నేనె-
అనిసేయఁగాఁ బ్రాసమును దాల్ప, నైన నే
ప్రాస మైనను నాకుఁ బట్టుఁ గొమ్మ-

ఒరుప్రసాదమునకుఁ బరువెత్త, నైనను
నాకుఁ బ్రసాదగుణమ్మె సొమ్ము-
జీవితప్రబంధ శేషసంగరములో
గణము, యతియుఁ, బ్రాస, గుణము నగుచు
సరసభక్తిఁ ద్వత్ప్రసాదంబుఁ గైకొని
అసమ కావ్యకీర్తి నందుదు ప్రభు!''

విశాఖపట్నం,
10-6-1999

-నళినీకాంతరావు
-రజనీకాంతరావు

## నోముల ఛోటా సర్వస్వం

''1904లో ప్రైజు (కల్పంతా పారితోషికం) పొందాక, వేంకటరావుగారు 'స్త్రీల వ్రతకథలు' అనే ప్రయోజనకరమైన పుస్తకం రాశారు. (ఇది ఉత్తరోత్తరా మూడు భాగాలుగా ప్రచురించారు. మొదటి భాగంలో 32 కథలు, ద్వితీయ భాగంలో 32 కథలు, తృతీయ భాగంలో 33 కథలు వెరసి 97 కథలు ఉన్నాయి). మోచేటి పద్మము (మూగనోము) దగ్గర్నుంచి కల్యాణగౌరి నోము దాకా ఉన్న ఈ కథలలో ఒకనాటి మన తెలుగు స్త్రీలు పట్టే నోములు అన్నీ ఉన్నాయి. సామాజిక మానవశాస్త్ర పరిశోధనలకు పనికి వచ్చే పుస్తకం...............ఎందరు పెద్ద ముత్తయిదువుల దగ్గర విని దీనివి రాశారోగాని వేంకటరావుగారు జాతికి మంచి ఉపకారం చేశారు. హంసవింశతి, శుకసప్తతి మొదలైన మన కావ్యాలలో కొన్ని నోముల పేర్లు ఉన్నాయి గాని యిది నోముల ఛోటా సర్వస్వం. చిట్టి బొట్టు కథ, మొగదోసిళ్ల కథ, చిత్రగుప్తుని నోము కథ, అన్నము ముట్టని ఆదివారాల నోముకథ, చద్దికూటి మంగళవారముల కథ, ములగౌరి నోము కథ, అమావాస్యా సోమవారాల నోము కథ - ఒకటేమిటి స్త్రీలు పట్టే నోములు, వాటి ఉద్యాపనలు ఇందులో వివరించారు'' - ఆరుద్ర (''సమగ్ర ఆంధ్ర సాహిత్యం'', పండ్రెండవ సంపుటం, జమీందారీ నవ్యసాహిత్యయుగాలు-II: పుటలు 153,154).

# సంపాదకుని విజ్ఞాపన

''నేను రచియించిన భావసంకీర్తనము అనే భక్తిరూపక పద్యకావ్యమును మీరు ముగ్గురును సముభాగ్యులతో అచ్చు వేయించి వచ్చు లాభము మీ ముగ్గురు సమముగా పంచుకొనవలెను'' అని మా నాన్నగారు తమ విల్లు(19-06-68)లో ఆదేశించారు విల్లులో అది ఏడవ పాయింటు మేము దానిని కూడా అమలు జరిపి ఉంటే, ఈ పుస్తకం ఎప్పుడో అచ్చయి ఉండేది ఆ ముగ్గురం- నేను, చి॥ రజనీ, మా చెల్లెలు (ఇప్పుడు లేదు) కనకదుర్గ ఉరఫ్ అనూరాధ కన్న కూతురికి కనకదుర్గ అని పేరు పెట్టుకోకుండానే మా అమ్మగారు గతించారు, 1922 జనవరిలో

కృతిసమర్పణ పద్యాలలో మా నాన్నగారు తమ సంతానమునూ, కోడండ్రను, అల్లుళ్ళ పేర్వేర పేర్కొన్నారు, అల్లుడు- మేనల్లుడు బుద్ధవరపు నాగరాజామాత్యుడే, కీర్తిశేషుడు ... వ్రాతప్రతిలో 284 మొదలు 288 వరకు కృతిసమర్పణ పద్యాలు 'ప్రణతి' 68వ పద్యం లడ పూర్వకవిస్తుతి ఈ ఆరు పద్యాలూ ముందుండవలసినవని, వాటిని ముందుకు తెచ్చాను- నా ఎడిటింగులో వాటికి ప్రాముఖ్యం ఇవ్వడంతో అవి చేరయాయి నిజానికి వాటితోనే త్రిశతి మొదలవాలి అవి త్రిశతిలోవే

''సదరు పుస్తకము వ్రాతప్రతులు నా కుమారు లిరువురి వద్దను కలవు'' అన్నారు మా నాన్నగారు విల్లులో నా వద్ద ఉన్నది - మొత్తం 332 పద్యాలుగల త్రిశతి సమగ్ర మూలప్రతి అది పాతకలాంటి నల్లట్ట పాకెట్ సైజు డైయరి నా వద్దకు వెమెస్కో ద్వారా వచ్చి పడింది - మా నాన్నగారు డైయిరీలోంచి 290 పద్యాల వరకు సాపు రాసుకున్న డెమీసైజు నోటుబుక్కు- అందులో మూడు, నాలుగు పద్యాలు రజనీ దస్తూరీలో ఉన్నవి

28-1-1948 నుంచీ రాస్తూ వచ్చినవి త్రిశతి పద్యాలు, మా నాన్నగారు వేసిన తేదీ ప్రకారం అవి 1965 వరకు సాగాయి ''అఖిల భారత దేశికాగ్రణి మా గాంధి/ మాయమిత్తిని నేడు మమ్ము వీడి'' అంటూ గాంధీగారికి అంజలి ఘటించిన 5,6,7 పద్యాలు నేను తీసి వేశాను, అవి ఉంటే భావసంకీర్తనము భావతరంగిణి (musings) అయిపోతుందని 'నేడు' అంటే 30-1-1948 ఆ పద్యాలు గాంధీగారికి జోహారుగా విడిగా 'ఆంధ్రప్రభ'లో వచ్చాయికూడా

'ప్రభూ' అన్న ప్రార్థనగేయం (26వది) కూడా వదిలివేశాను ఒక పారాంతరపద్యమూ, పునశ్చరణగా సాగిన మరొక పద్యము తగ్గించాను మొత్తం ఆరు పద్యాలు లేసివేశానన్నమాట అప్పుడు నోటుబుక్కులోని 290-6=284 పద్యాలవుతాయి డైయరీనుంచి నోటుబుక్కుకు ఎక్కని చివరి 42 పద్యాలనూ విడిగా రాసి, వాటితో జతచేశాను అప్పుడు మొత్తం 284+42=326 పద్యాలు అయాయి అందులోంచి తరవాత ముందుకు మార్చగ వేరయినవి-అంకితం పద్యాలు అయిదూ, ప్రణతి పద్యము

త్రిశతి పద్యాలు 27-12-1963 నుంచి 'ఆంధ్రప్రభ' దినపత్రిక సారస్వతానుబంధంలో - అప్పుడప్పుడు- వెలువడుతూ వచ్చాయి ఏ పద్యాలు ఏ తేదీని ప్రభకి పంపుతూ వచ్చిందీ డైయిరీలో ఆ పద్యాల మీద రాసుకుంటూ ఉండేవారు మా నాన్నగారు ఏ పద్యం ఏ తేదీన రాసిందీ దానికింద నోట్ చేసి ఉండేది 284 to 288 పద్యాల మీద 'కృతి సమర్పణ పద్యాలు' అని రాసి ఉండడం నా కళ్ల బడింది ఆ డైయరీ 'మాస్టర్ కాపీ' అనమాట

'ఆంధ్రప్రభ'లో వస్తూండే పద్యాల కత్తిరింపులు (clippings), బడిపంతులుగా పిఠాపురంలోనే ఉంటూ ఎచ్చిన నా పెద్ద తమ్ముడు, కీర్తిశేషుడు దుర్గాప్రసాదరావు ( మా పినతండ్రిగారి లబ్బాయి) శ్రద్ధగా జాగ్రత్తపెడుతూ వచ్చాడు ఆ తునుకలు నేను సన్నపాటి తోకనోటుబుక్కులో వరసగా అతికిస్తూ వచ్చాను- 120,130 పద్యాల దాకా ''చెప్పవే ! నీ సూక్తి శేషేహి వేనోళ్లా, ప్రామిన్కు మువ్వల పావ కోళ్లా'' అని మొదలయే పద్యంతో ప్రారంభం అవుతాయి అవి

నేను ఏర్చి కూర్చిన 326 (284+42) పద్యాలనూ ఏకపుస్తకంలో రాయించాను, కాపీలు తీయించడానికి అందులో చివరి 42 పద్యాలనూ మొదట, తరవాత మొదటి 145 పద్యాల దాకానూ రజనీతో కూర్చుని, తన చేత రివైజు చేయించాను ఆ వ్రాతప్రతి తప్పులతడకగా ఉండడం వల్ల, అంతటితో చాలించి, దానిని అవతల పెట్టాను

అప్పుడు, ఇది పని కాదని, నోటుబుక్కులో మా నాన్నగారి దస్తూరీలో ఉన్న పద్యాలను, వాటితో నేను డైయరీనుంచి ఎత్తిరాసిన 42 పద్యాలనూ చేర్చి, యథాతథంగా జీరాక్స్ చేయించాను రెండు కాపీలు తీయించాను ఎవరిచేతనయినా పీఠిక రాయించాలన్నా, ఆర్థిక సహాయం అర్థించాలన్నా అవే మాకు దిక్కు అయాయి నేను రాయించిన ప్రతిని అప్పుడప్పుడు తీసిచూడడానికి, అచ్చయిన పద్యాలలో కనిపించిన పాఠాంతరాలను అందులో నోట్ చెయ్యడానికి ఉపయోగిస్తూ వచ్చాను

ఈ దశలో తల బొప్పి కట్టే ఒక వెర్రి మొర్రి ఆలోచన వచ్చింది నాకు మూలప్రతి అయిన డైయిరీ, డెమీసైజు నోటుబుక్కు, 'ఆంధ్రప్రభ' కత్తిరింపులు అంటించిన తోక నోటుబుక్కు, వగైరా, రజనీ దగ్గర సుభద్రంగా ఉంటాయని ఒకరి చేత మదరాసునుంచి రాజమండ్రీ పంపబోయి వాటిని శుభ్రంగా పోగొట్టుకున్నాను రజనీ అప్పుడు బొమ్మూరులోని తెలుగు విశ్వవిద్యాలయం పి జి సెంటరులో విజిటింగ్ ప్రొఫెసరుగా పని చేస్తున్నాడు

వేంకటపార్వతీశ్వరకవుల అముద్రిత రచన ఏది ఉన్నా తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించ గలదని వారి అభిమానులు మాకు ఆశ కల్పించగా, వేంకట కవిరాజహంస ''భావసంకీర్తన సీసత్రిశతి'' ని వెలువరించ వలసిం దని లభ్యర్థిస్తూ, ఒక ఎడిషను వెయ్యడానికి అధికారం ఇస్తూ, మా ముగ్గురి సంతకాలతో ఒక అర్జీ తయారు చేసి, త్రిశతి జీరాక్సు ప్రతితో, దానిని తెలుగు విశ్వవిద్యాలయాధికారులకు పంపు కొన్నాము

తెలుగు విశ్వవిద్యాలయం పుస్తకప్రచురణ చేపట్టే ప్రసక్తే లేదనీ, మీ పుస్తకం మీరు వేసుకుంటే ఆర్థిక సహాయం చేయగల దని మా అర్జీకి జవాబు వచ్చింది తెలుగు విశ్వవిద్యాలయం చేసే సహాయం స్వల్పంగా ఉంటుందనీ, తిరుపతి దేవస్థానం వారికి అర్జీ పెట్టుకుంటే తగు సహాయం లభించగలదనీ మిత్రులు సలహా చెప్పారు గాని, [illegible] లేని ప్రవాసాంధ్రుడినైన నేను వీరిమాట గాని, వారి మాటగాని మళ్ళీ తలపెట్టలేదు

జీరాక్సు కాపీలు రెంటిలో ఒక కాపీని ఎడిట్ చేసి నేను రాజమండ్రీ పంపగా రజనీ రాయించిన 'శుద్ధప్రతి' లో కాపీయిస్టు చేసిన ఓఘాయిల్యాలు నా కంట బడడంతో దానిని మూలపడ వేశాను అది కార్బను కాపీతో సహా వచ్చింది అహమదాబాదు 1992లో

x x x

అభిప్రాయసేకరణార్థం పంపిన ''భావసంకీర్తన సీసత్రిశతి'' ప్రతులు 1997-1998లో కుటీరపరిశ్రమగా తయారయిన దినుసు కుటీరం జాంబియా కిట్వేలో ఉంది అందులో ఒక కంప్యూటర్ (దానిని 'కలక' అనమంటారు కవనశర్మ) ఉంది దానిని పొందుపరచినవాడు మా పెద్దబ్బాయి కిరణ్ సుందర్ ''తాతయ్య భక్తికావ్యం మనమే వేసేసుకుందాం, రా నాన్నా!'' అన్నాడు అంటే వాళ్ళమ్మా, నేనూ wheelchairs తోడుగా విమానప్రయాణం చేసి, జాంబియా చేరుకున్నాం

మా అబ్బాయి పర్యవేక్షణలో నా మనవడికీ, కోడలికీ కంప్యూటర్ చేత పని చేయించడం నల్లేరు మీద బండినడక అయింది తండ్రికి తరిఫీదు ఇచ్చాడు కాదని మావాడి మీద నాకు గుర్రు నా మనవడు, పదకొండేళ్ళవాడు, తన సెలవుల్లో శ్రీకారం చుట్టాడు నా కోడలు- తమిళ మహిళ- నడుంకట్టి తెలుగు లిపిని సాధించింది! నా పని డిక్టేషను, inkjet typesetting దిద్దుకోడం- అహోరాత్రాలు.

ఐడియాలు నావి, అమలు జరపడం నా కోడలు- కవర్ డిజైన్, ఇన్నర్ టైటిల్, బాక్స్ కట్టడం, వగైరా సాంకేతిక విషయాలు సింబల్స్ చూసి పెట్టడం, బొమ్మలు వేసి పెట్టడం నా మనవడి పని! త్రిశతి computerised copy కుటుంబ పరిశ్రమ ఫలితం! పది, పన్నెండు కాపీలు తయారు చేసింది నా కోడలు ప్రెస్సు చుట్టూ తిరిగి నాకు కరువు తీరి, సుభిక్షమయాయి అవి!

కంప్యూటర్ ప్రసాదించిన భావసంకీర్తన ప్రతులను ఆయా ముఖ్యులకు చేర్పించడానికి, పేదకు పెన్నిధిలా, నాకు దొరికిన వాళ్ళు- హైదరాబాదులో పద్యకవిగా ప్రసిద్ధుడైనవాడు, నా మేనమామ పెద్ద కొడుకు అయిన డి ఏ ఎల్ ఎస్ మూర్తి, మదరాసులో జర్మన్ టీచరుగా నలుగురికీ పరిచితురాలైన మా రెండవ అమ్మాయి శ్రీమతీ రామ్‌నాథ్ వాళ్ళకి నా థాంక్స్!

x x x

నా జనకుల భక్తికావ్యాన్ని అచ్చువేయించడానికి, 1998లో, జాంబియా నుంచి విశాఖ

చేరుకున్నాను, నా సంరక్షకురాలు జ్యోతిష్మతితో- మాకు మా మూడవ అమ్మాయి లావణ్యా, అల్లుడు శ్రీనివాస్ ఆసరాగా ఉండగలరని అయితే, ఆ ముహూర్తానికే మా అల్లుడికి రాజమండ్రీ బదిలీ అయింది వాళ్ల అజమాయిషీలో తయారయినదే మా మిద్దెటిల్లు 'సాయి జ్యోతి'

విశాఖ నాకు కొత్త, విశాఖకు నేను కొత్త నాకు బాసట అయినవారు - తెలుగు ప్రొఫెసర్ శ్రీమతి కోలవెన్ను మలయవాసిని గారు, నా మేనమామ చిన్నకొడుకు రిటైర్డ్ ఫార్మకాలజీ ప్రొఫెసర్ దుగ్గిరాల విశ్వేశ్వరం భారతీయ శిక్షణమండల్ జనరల్ సెక్రటరీగా దేశసంచారకు డైన ఈ బావకి బాగా అలవాటయిన ప్రెస్సు శ్రీ ఏ నాగేశ్వరరావు గారి 'విజేతా గ్రాఫిక్స్'

ఆ విజేతా గ్రాఫిక్స్‌లో, నాకు తోబుట్టువుగా తోడ్పడిన మలయవాసినిగారు, తాను శ్రమించి-నాకు కొంచమైనా శ్రమ లేకుండా- అయిదు విమర్శక వ్యాసాలను లేజర్ టైప్‌సెట్ చేయించి పెట్టారు ఏ నాటి ఋణానుబంధమో!

కంప్యూటరైజ్‌డ్ ప్రతిని అనురక్తితో చదివి ఇచ్చిన I A S (retd) బావగారు శ్రీ జి వి ఎల్ ఎన్ మూర్తి గారికి నా వందనాలు అందులో నా సవరణలను ప్రెస్సువారి ఆపరేటర్ చేత తన కంప్యూటర్ మీద బాధ్యతగా చేయించి పెట్టిన నా మేనల్లుడు చి|| దుగ్గిరాల రాజకిశోర్‌కి నా దీవనలు

ఆరోగ్యం చెడి, అచ్చుపని పూర్తి కాకుండానే, నేను జాంబియాకి తిరిగి వెళ్ల వలసి వచ్చింది చివరకి, కంప్యూటర్ తీర్చిన పుస్తకం కిట్వేలోనే అచ్చయింది

x x x

కురువృద్ధులు ఆంధ్ర శేషగిరిరాయ మహోదయులు, అప్పటికి నే నివ్వ గలిగిన విడి కాగితాల జీరాక్సు ప్రతినే విసుగుకోకుండా చదివి, బాలగీతావళిని స్మరిస్తూ, భావసంకీర్తన త్రిశతి మధురభక్తి సంభరితమని అభినుతిస్తూ వ్యాసం రాసి, ఆదర భావంతో, ఆశీర్వాదపూర్వకంగా నా కిచ్చారు వారి పాదధూళి శిరస్సున తాలుస్తున్నాను.

గురువృద్ధులు పి సీతారామమూర్తి మహాశయులు సీసత్రిశతిని మున్నూరు పూసల జపమాల అనీ, భక్త్యావేశంతో సాగిన ఆధ్యాత్మిక గవేషణ అనీ అభివర్ణిస్తూ -అడిగినదే తడవుగా, అత్యంత వాత్సల్యంతో ఆంగ్లంలో కవితాత్మక మైన అభినందన వ్యాసాన్ని విరచించి కవిరాజహంస స్మృతికి కానుకగా సమర్పించారు- వారికి నా పాదాభివందనాలు

ఆచార్యసత్తములు డా|| సాళ్వ కృష్ణమూర్తి గారు సహృదయంతో తులలేని పీఠికను సంతరించిన సుహృదులు భావసంకీర్తన సీసత్రిశతి 'ఒక అసాధారణ గ్రంథం' అన్నారు సీసభేదాలను పేర్కొని, పద్యాలు కవి ఆర్తిని తారస్థాయిలో నివేదిస్తున్నవి- అవి ఒక్కొక్కటి ఒక చెక్కిన శిల్పంలాంటివి - భాష పారదర్శకం అన్నారు ''జీవితకాలమంతా భగవత్సాన్నిధ్య స్పృహతో మనగలిగిన'' వేంకటరావుగారు ఆళ్వారుల వంటివా రన్నారు వారికి మా సోదరులం ఋణగ్రస్తులం.

మా పిఠాపురంపేరు నిలబెడుతున్నవారు, మాకు ఆత్మబంధువు వంటివారు

లయిన డా॥ సోమసుందర్ ఆవంత్స - నా యందు అభిమానంతో రాసి పంపిన వ్యాసంలో - కవిరాజహంస కవితాక్షీర వరణాన్ని చక్కగా విశ్లేషించి, భావసంకీర్తన సీసత్రిశతిని వారు మతాతీత ధ్యానకావ్యంగా మలవారని ప్రస్తుతించారు వారికి నా హార్దిక అభినందనలు

శ్రీ తీర్థం శ్రీధరమూర్తి పండితులు నాకు ఆప్త మిత్రులు, గురుతుల్యులు స్వర్గీయ బొమ్మకంటి సింగరాచార్యులు గారు, నేను గౌరవసంపాదకులుగా రూపొందించిన ఎమెస్కో 'సంప్రదాయ సాహితి' ప్రచురణల పథకానికి పట్టుగొమ్మగా తోడ్పడినవారు మా నాన్నగారికి సుపరిచితులు సీసత్రిశతి ప్రతిని సరిచూసి పెట్టి, తమ విమర్శావ్యాసాన్ని ఆప్యాయంతో మా అబ్బాయికి చదివి వినిపించి ఇచ్చారు వారికి నా కృతజ్ఞతాభివందనాలు

''లలితకావ్యము కుశీలవులచేఁ బాడించి/ మునిరాజు మ్రోగించె ముక్తివీణ''(ప 106) అన్న పాదంలోని కుశీలవులు 'కుశీలవుడు' అన్న శబ్దానికి బహువచనం- కుశలవులు అన్న ద్వంద్వసమాసానికి అచ్చుతప్పు కాదు- స్తుతిపాఠకు లని అర్థం కుశీలవ శబ్దానికి ఇంగ్లీషు మాట మిన్‌స్ట్రల్ (minstrel) సమానార్థక పదం

'నోముల ఫోటా సర్వస్వం' -బాలాంత్రపు వేంకటరావుగారి ''స్త్రీల వ్రతకథలు''- రాజమండ్రీలోని కాళహస్తివారి సొత్తు అయింది

తండ్రి తరవాత తండ్రిలా నన్ను సాకుతూ వచ్చిన, పూర్వాశ్రమంలో నాకు 'సత్యం అన్నయ్య' అయిన, మా రెండవ పెదతండ్రి రామయ్య గారి మూడవ కుమారుడు, తన చిన్నప్పుడు మా అమ్మగారి చేతుల్లో పెరిగినవాడు అయిన స్వామీ సత్యప్రకాశ్ మోహరానందుల్ని భక్తికృతజ్ఞతలతో తలుచుకుంటున్నాను

కవికులాలంకారులయిన వేంకట కవిరాజహంస భక్తికావ్యాన్ని ''ఆరవి సుధాకరము'' లోక మాదరిస్తుందనీ, ఏళ్లతరబడి నేను పడిన ప్రయాసకి ఫలిత మైన ఈ సాయి జ్యోతి సమర్పణ మా నాన్నగారి ఆత్మకి శాంతినీ, ముదమునూ చేకూరుస్తుందనీ ఆశిస్తున్నాను

గజ్జల మల్లా రెడ్డి సంపాదకుడిని 'సంపాతకు' డనడం జ్ఞాపకం వస్తోంది యదక్షర పదభ్రష్టం

విశాఖపట్నం, -నళినీకాంతరావు బాలాంత్రపు

10-06-1999

బాహ్యేంద్రియంబులు భవురాప్పుఁ గనుచుండు,
　　　నంతరింద్రియము లా యభవుఁ జూచు-
ఆ పంచకంబును, నీ పంచకంబును
　　　నొకటిగా నేకమై యున్న చోటె
ఆత్మజీవునకు సింహాసనం బనవచ్చు;
　　　అరయుగా తా నుభయంబు నచట-
జీవాత్మలకు నందె, స్థితి భేదమునఁ గాక,
　　　ఏకత్వసిద్ధి తా నెఱిఁగె నేని-
మనసు తా నమనస్కతఁ గనియె నేని,
అంతరంగంబు నందె తా నధిపుఁ గాంచి
శాశ్వతానంద పదవి నిచ్చులు వెలుంగు
సచ్చిదానందు నినుఁ జేరఁ జనుఁ గద ప్రభు!

(13వ పద్యము)



# కృతిసమర్పణము



౧

వేదముల్ బ్రహ్మలై వినుతిసేయుచు నుండ,
గుణములు మూర్తులై కొలుచుచుండ-
ప్రకృతులు నీడలై పంపానర్పుచు నుండ,
కళలాటకత్తెలై క్రాలుచుండ-
జ్ఞానభక్తులు వీజనములై విసరుచుండ,
విద్య యర్ధాంగి యై వెంట నుండ-
ఉపనిషత్పురిఁ బేరోలగం బుండి, నన్
గవిరాజహంసను గరుణఁ బిలిచి,
''కృతిగ వినుపుము, భావసంకీర్తనంబు
లభిమతంబులు మా'' కని, సభ నుతింప,
నిచ్చెఁ గపురంపుఁ దాంబూల మిచ్చినావు-
వసుధ నా భాగ్య మే మనవచ్చును ప్రభు!

## ౨

ప్రతిపద్యమున నిన్నె పలుకరించితిఁ గదా,
అంకితం బని వేఱె యడుగ నేల?
పదపదంబున నిన్నె బతిమాలితిని గదా,
వినిపింపు మని వేఱె వేఁడ నేల?
ప్రతికీర్తనను నిన్నె ప్రకటించితిని గదా,
పేరిడు మని వేఱె పిలువ నేల?
ప్రభువరుం డని నిన్నె ప్రస్తుతించితిఁ గదా,
పతిఁ జేయు మని వేఱె పలుక నేల?
నిండు కొలువు లోన నినుఁ బొగడించుకోఁ
గృతిని జదువ నాన తిచ్చినావె?
నను దరింపఁ జేయ, నా కృతి వెలయింపఁ
జేయ నుంటి గాక- చెప్పుము, ప్రభు!

## 3

వర మానస సువర్ణ సరస హంసకు మ్రొక్కి,
సత్ప్రద పద్మ హంసమును దలఁచి-
పరమార్థ భావ సంపన్న హంసకు మ్రొక్కి,
సాధు ప్రబంధ హంసమును దలఁచి-
భారతీ నామక పరమహంసకు మ్రొక్కి,
సార సానంద హంసమును దలఁచి-
సత్య నిత్య పద ప్రసన్న హంసకు మ్రొక్కి,
ఆత్మ సత్కవిరాజ్ఞ్హంస నగుచు-
అక్షరపదంబునకుఁ బరమార్థపతికి,
భావభారతి కాదిమబ్రహ్మమునకుఁ
బ్రేమ భావకీర్తనము లర్పించుకొంటి-
అనిత రానంద సత్కీర్తి నందితి ప్రభు!

౪

కృతిసుధాధామంబుఁ గీర్తిసౌధముఁ జేసి,
చిర సుఖశ్రీ లందుఁ జేర్చినావు-
గ్రహరాజ రాజులఁ గనుపాపలం జేసి,
గోత్రాభ్యుదయ సిద్ధి గూర్చినావు-
ఆర్యా మహాదేవి నాడుబిడ్డఁగఁ జేసి,
కుల గిరులను మేలు కొల్పినావు-
ఆనంద సామ్రాజ్య మగ్రహారముఁ జేసి,
పరమార్థముల నెల్లఁ బంచినావు-
భావసంకీర్తనపుఁ గృతి భర్త వగుచు
పసదనము లిచ్చి మెప్పించు పాటి గాక,
అల్లుఁడవు మేనయల్లుఁడ వైతి నాకు-
నీకు నే మేనమామగా నేర్చితి ప్రభు!

౫

దినరాజునకు జ్యోతి దేవిగాఁ గూర్చితి,
నీ ప్రభావ మెఱుంగ నేర్తు రెవరు?
రేరాజునకు సుభద్రారామ నిచ్చితి,
నీకు వంకలు పెట్ట నేర్తు రెవరు?
నాగరాజునకుఁ గనకదుర్గ నొసఁగితి,
నీ నేరు పిది యన నేర్తు రెవరు?
జగదీశ! నుత్పూతి సహధర్మిణి యటంటి,
నీ మెప్పు లివి యన నేర్తు రెవరు?
ఆరనిసుధాకరముఁ గృతి నవధరించి,
ఆరనిసుధాకరము లోక మాదరింప
అభ్యుదయ సిద్ధు లెప్పు నీ యంతవాని
ప్రేమఁ దెలియంగ నెవ్వారు పెద్దలు ప్రభు!



ఓమ్

## ప్రణతి

నన్నయ సీసాల నాటిన మతి, నన్నె
వేమని సీసాలఁ జొనిపినావు-
తిక్కన సీసాలఁ ద్రిప్పిన భావాలు
సోముని సీసాలఁ బ్రామినావు-
శ్రీనాథు సీసాలఁ జెలరేగిన మనంబు
పోతన సీసాలఁ బూన్చినావు-
భట్టు సీసాలలోఁ బట్టిన కుతుకంబు
తిమ్మన సీసాలఁ దేర్చినావు-
వారలకు మ్రొక్కి, నీ మెచ్చు వారి ఫక్కి
భావకీర్తన సీసాలఁ బట్టు కొలిపి
చిర సువర్ణ పుష్పముల పొంజేబు లల్లి
శ్రీసదాంకితములు గాఁగఁ జేసితి ప్రభు!



శ్రీరామచంద్రః

# భావసంకీర్తనసీసత్రిశతి

## 1

భాషాప్రకల్పిత బంధురస్కంధంబు,
భావశాఖా శబ్దపల్లవంబు -
ప్రకృతిమనోహర ప్రసవసంతానంబు,
పరమార్థ మాధురీ ఫలభరితము -
కవిపండితామోద కలకలారావంబు,
సరస సల్లాప ప్రసాదితంబు -
నిర్ఝర నిన దుపనిష దభిరామంబు,
గ్రహగతిస్వన శుభోంకారసరణి
గాఁగ విశ్వకవిత్వ వృక్షంబు గూర్చి
ఎన్నికం గన్న ప్రోడ! నిన్నెన్నఁ గలనె?
చిత్తమును బట్టి, నిన్నుపాసింపఁ బట్టి,
పోలికను బట్టి యేమైనఁ బొగడుదు ప్రభు!

## 2

నేనాడు మాటలు నిగమంపుఁ దోఁటలో
శుకభాషణములుగా శ్రుతుల నింతె?
నేఁ బాడు పాటలు నిర్మల శ్రుతివీధి
సామగానములుగా సంతరింతె?
నే వ్రాయు వ్రాఁతలు నీ చిత్రసృష్టిలో
బ్రహ్మసూత్రములుగాఁ బ్రస్తరింతె?
నేఁ జేయు కైతలు నిఖిలభారతములో
ఆత్మభారతముగా ననువదింతె?
అలవుచేఁ గాక - ఆశచే నడుగుచుంటి,
చలముచేఁ గాక- చనవుచేఁ బలుకుచుంటి,
చేవచేఁ గాక- చెలిమిచేఁ జెప్పుచుంటి,
మొదల ననిపించి తుదిని నవ్వేదు గద! ప్రభు!

## 3

నీవు కర్తవు గాన, నీవు భర్తవు గాన,
నీవు హర్తవు గాన నిఖిలమునకు-
నీ సృష్టి జనియింతు, నీ దృష్టి నటియింతు,
నీ లోన నీ చేష్టనే లయింతు-
దేవుండవై నీవు, జీవుండనై నేను
మలపింప నేర్తువు, మలఁగ నేర్తు-
మాయ నాటకముల మఱపించి, వెఱపించి
మోహ పెట్టుట నీకు ముచ్చటైన
నాంది పాడుము ప్రస్తావనంబుఁ జేసి,
సూత్రధారుండ వీ వభినేత్రి నేను -
కూర్మి మీఱంగ నాడించుకొనుము నన్ను,
భరతవాక్యంబునకుఁ బట్టు పట్టను ప్రభు!

## 4

ఇది కర్మగతమైన యిల్లని యనుకొన్న
మమకారమున నిన్ను మఱచియుందు,
ఇది కాలవాహిని నీఁతని యనుకొన్న
మోహాంబునిధి నన్ను ముంచికొందు,
ఇది జన్మపరమైన గుది యని యనుకొన్న
నభిమాన వశత నిన్నరయ కుందు,
ఇది జీవవిఖ్యాత పదమని యనుకొన్న
దురహంకృతిని నన్నె తూల్చికొందు,
దైవకృత మిది యని నిన్నుఁ దలఁచికొన్న
నేను చేసిన తప్పు లన్నియును తెలియు -
తెలిసి తెలియని నను సేదదేర్చి తీర్చి,
ప్రేమ శుద్ధాంతమున నాదరింపుము ప్రభు!

## 5

వయసు వచ్చిన దనవచ్చునో, వయసు చె
ల్లిన దనవచ్చునో లెక్క గట్టి -
ఇన్నేళ్ళు పైఁబడి యిప్పటి కైనను
నిజ మేదొ చెప్పంగ నేరకుంటి -
మొదటినుండియు నాత్మ మోహించి యుంటిని,
ముక్తికాంతను గూడి ముచ్చటింప -
వరుఁడ నై నే నామె వద్దకుఁ బోదునో,
వధు వామెయే చేరవచ్చునొ నను -
కాంతతోడి సంసారము గడవఁ బెట్టి,
కాంతతోడి సంసారంపుఁ గాంక్షఁ బడితి-
కాంత లేనట్టి బ్రదుకు నిక్కముగ లేదె ?
ప్రేమ ముక్తికాంతల నేరు పెద్దలు ప్రభు ? -

## 6

పలికించునది కాంత, పలుకుబళ్ళకుఁ గాంత,
పలుకులోఁ బలు కాడు పలుకు కాంత -
కనిపెంచునది కాంత, చన విచ్చునది కాంత,
తనువులో సగమైన తనువు కాంత -
పద మిచ్చునది కాంత, ముద మిచ్చునది కాంత,
ముదములో నెద నిండు ముదము కాంత -
బ్రదికించునది కాంత, బల మిచ్చునది కాంత,
బ్రదుకులోపల నిండు బ్రదుకు కాంత
రక్తి, భుక్తియు, భక్తియు, ముక్తి నిచ్చి
ఐహి కాముష్మిక సుఖంబు లంద నిచ్చి,
కాంతునకుఁ దోడునీడగాఁ గలది కాంత-
కాంతయే సత్య మాది మధ్యాంతము ప్రభు !

## 7

ఎన్నాళ్ళ నుండియో యే ననుకొనుచుందు,
నొంటిగా నీవు నా కంటఁబడిన,
కాళ్లపైఁ బడి యేడ్చి, కడుపులోపలి బాధ -
సడిఁ బడలేని నా జన్మగాధ,
ఇఁక లోకమునఁ బ్రాకనీ కని, పుట్టు వా
ల్లని ననుఁ గర్మజాలమునఁ బెట్టి
నేరంబు లెంచుచు దూరంబు సేయక
దరి జేర్పు మని చెప్పఁ దలచుచుందు,
నాకుఁ బ్రత్యక్ష మయ్యెడి నాఁడు లేక
తలఁపు లెల్ల నాలోనె వ్యర్థంబు లయ్యె,
చంపుకొంటిఁ గోర్కె, లహమ్మె చంపుకొంటి;
ఇంక భయ మేమి? కరుణించి యేలుము ప్రభు!

## 8

అభవుఁ డై జగముల నాడించు నందునా,
అర్ధనారీశ్వరుం డనుట మాని?
అతనుఁ డై భువనమోహనుఁ డయ్యె నందునా,
దివ్యసుందరుఁ డను తెలివి మాని?
అచ్యుతుం డై వ్రజ మలరించె నందునా,
గోపబాలుం డనుకొనుట మాని?
నిర్గుణుం డీ విశ్వనేతయే యందునా,
గొనముల గని యనుకొనుట మాని?
అభవుఁ, డతనుండు, నచ్యుతుఁ, డగుణుఁ డనుచు
నాగ్రహంబున నైన ని న్ననఁగఁ జాల-
నే నెఱుంగనివానితో నేమి నాకు?
అప్పుడుగ నీవు నా వాఁడ వందును ప్రభు!

## 9

నా గృహ ద్వారంబునన నిల్చి కనుపెట్టు
కొనియుంటి నాస నీకోస మేను -
ఇది రాత్రి, యిది పవ, లిది వేళ యనకుండ
నెన్నాళ్ల నుండియో, యెన్ని యేండ్ల
నుండియో నీ యంఘ్రియుగము సేవింపఁగా
నెదురు చూచుచు నుంటి నింత దనుక-
రాకుంటి వే మని నా కొంటె మనసుతో
నల్లన మంతన మాడుచుండ,
ఆటలో నోడపుచ్చిన తోటిపాప
పగిది నాలోననే యుండి, పక్కుమనుచు
నగుచు నగుచుఁ బ్రత్యక్ష మైనావు నేఁడు -
మేను మఱపించి, తే మనుకో నిఁక ప్రభు !

## 10

కష్టముల్ తొలగించి కాపాడుకొందువా,
ప్రియబంధు వని సంస్మరించుకొందు.,
మాయను మఱపించి మన్నించికొందువా,
వేలుప వంచు సేవించుకొందు,
భవబంధము లెడల్చి బ్రదికించుకొందువా,
జీవేశుఁ డంచుఁ బూజించుకొందు,
ప్రజ్ఞాన మందించి పాలించుకొందువా,
నిజగురుం డంచు ధ్యానించుకొందు;
పేర్కొని ప్రకృతి బాధఁ జెప్పెదను గాని,
పూర్వకర్మానుభూతిఁ జూపుదును గాని-
అభవ! సుజ్ఞానరూప! న న్నాదరించి
కరుణ నేల నన్నిటి కీవె కర్తవు ప్రభు!

## 11

తమ కంపు తమ కింపు, తమ కైత తమ పెంపు
తమకు మెచ్చను మాట తప్పు గాదు,
పలికించెదవు నీవు, పలుకుచుండెద నేను-
నా నుడు లిచట నే మైనఁ గలవె ?
నే వ్రాసినది యేది ? నా వ్రాఁత నీవు వ్రా
సినది కా కున్న మెచ్చెదవె నీవు ?
భువనంపుఁ గవనంపుఁ బ్రోడవు గా కున్న
నీ కైత నిటు త్రిప్పి నీవు మెత్తె ?
తెలిసి తెలియని కవిఁ జేసి, కలముఁ దీసి
కైకొనఁగఁ బెట్టి, గాథలు కట్టిపెట్ట
ఎఱిఁగియొ యెఱుంగకుండనో యేను కూర్తు
నీవు కర్తగా, భర్తగా నేర్తువు ప్రభు! -

## 12

కొకులు దూరని కారు కారడవిని
చీమలు దూరని చిట్టడవిని
ఏ వెలుంగున కైన, రే వెలుంగున కైన
నిందు తా వున్నదే యించు కైన ?
శిథిల శైల్యాస్థి నిక్షేపమో యిది, స్తబ్ధ
జీవ నివాసమో చిత్తగించి
నిశ్చయింపుము; దీన నీ వెటు కా లూనఁ
గలుగుదు? వటు గాన, కాన వదలి,
కదలి నేనె వత్తు; గడ్డు భూతము లిందుఁ
దిరుగుచుండు నంద్రుడు తెరపి లేక;
కాడు వీడుఁ జేయఁగల నైన వేఁడ, నీ
తోడినీడ నగుచుఁ గూడుదు ప్రభు! -

## 13

బాహ్యేంద్రియంబులు భవురూపుఁ గనుచుండు,
నంతరింద్రియము లా యభవుఁ జూచు -
ఆ పంచకంబును, నీ పంచకంబును
నొకటిగా నేకమై యున్న చోటె
ఆత్మజీవునకు సింహాసనం బనవచ్చు,
అరయుగా తా నుభయంబు నచట-
జీవాత్మలకు నందె, స్థితి భేదమునఁ గాక,
ఏకత్వసిద్ధి తా నెఱిఁగె నేని-
మనసు తా నమనస్కతఁ గనియె నేని,
అంతరంగంబు నందె తా నధిపుఁ గాంచి
శాశ్వ తానంద పదవి నిచ్చులు వెలుంగు
సచ్చిదానందు నినుఁ జేరఁ జనుఁ గద ప్రభు!

## 14

భవకృత సుకృ తానుభవము చెల్లిన వెన్క-
స్వర్గంబు కదలి రావలయు నన్న -
బ్రహ్మయు వున్నంత పర్యంత మట నుండి,
నలినగర్భుని వీడవలయు నన్న -
శివుతోడి కైలాసశిఖరి వాసము గూడ
శివరూప కల్పావశేష మన్న -
వైకుంఠ పట్ట ణావాసంబు శ్రీవిష్ణు
కల్పమై యెప్పుడో కదలు నన్న -
కదలు స్వారాజ్య సత్య లోకము లివేల ?
తిరుగు కైలాస వైకుంఠ పురు లవేల ?
నిత్య సత్య సుఖానంద నిలయ, మలయ
మైన పద మిడుము, తిరుగ లే నిఁక ప్రభు! -

## 15

గుమ్మము కడనె నీకోసము నిలుచుండి
కనుపెట్టుకొని యుంటిఁ గడచె రేయి,
ఏదొ బ్రహ్మానంద మేఁ గందు ననుకొంటి,
రావైతి వీ వని రవిలె మనసు,
నాకుఁ గోపము వచ్చి, నా కనులకు నొట్టు
పెట్టితి నినుఁ గనుపెట్టకుండ,
శూన్యశయ్యఁ బడి, యక్షులు మూసికొంటిని,
మనసు నా టని నమ్మి మాయఁ బడితి-
కనులు విన్నవి, తనువును కదల దింక,
లేకి మన సేమొ నను వీడి లేచిపోయి,
నిన్నుఁ గనుఁగొని నీ పాద సన్నిధిఁ బడి,
కదలి రా దిటు- అది నాది కా దిఁక- ప్రభు!

## 16

ఏది నాదో, యేది కాదో యెఱుఁగ నేర
కుంటిని - మాయి నే నుంటఁ జేసి,
ఏది నీదో, యేది కాదో యెఱుఁగ నేర
కుంటిని - ప్రకృతి నీ వుంటఁ జేసి;
ఏది నాదో, యేది నీదో యెఱుఁగ నేర
కుంటి - నిహపరంబు లుంటఁ జేసి,
ఏది నీదో, యేది నాదో యెఱుఁగ నేర
కుంటిని - మన మంటి యుంటఁ జేసి,
నాది నీ దను వేదాంతవాద వీధి
మాయ తెరఁ దీయఁ, బ్రకృతిని మఱుఁ జేయ-
మనము మన మొక్క టను మంచిమాట తోఁచి
మోహ మెడలిన, దెవరికి మ్రొక్కుడు? - ప్రభు!

## 17

పిలిచిన 'నో' యని పలుకుదు వందునే,
ఓంకార వాచ్యత నొప్పినావు -
సచరాచర జగంబు సాకుదు వందునే,
విశ్వేశ్వరుండ వై వెలసినావు -
తలఁచిన - చెంతనే నిలిచెద వందునే,
అనుభావమూర్తి వై యలరినావు -
అఖిలప్రపంచ మీ వై యుంటి వందునే,
భద్రాత్మకుండ వై ప్రబలినావు -
తల్లియును, దండ్రి భక్తుల కెల్ల నీవె
పతియు, గతియును నెల్ల యాశ్రితుల కీవె
గురుఁడు, దైవంబు నారాధకులకు నీవె
ఆత్మపిత - పరమాత్మ - నా కగుదువు ప్రభు! -

## 18

ఉన్నది మనసులో నిన్నుఁ గన్నట్టుగాఁ
గన్నులు చూపెట్టఁ గడఁగుచుండె,
కన్నులు గన్నది కన్నట్టు చూపెట్టఁ
దలపెట్టి తలఁపులు తారుచుండె,
కన్నులు తలఁపులుఁ గన్నది కన్నట్టు
పల్కఁ బల్కులు తొరపడుచునుండె,
కన్నులఁ దలఁపుల నున్నది, పలుకుల
యెన్నిక నీ మూర్తి యింపుమీఱ,
ఉన్న దున్నట్టు వ్రాయఁగా నురికి కరము
త్రిప్పినట్టులు కల మేమొ తిరిగి తిరిగి
పత్రములమీఁద నక్షరచిత్రములను
గూర్చుచున్నది కని నవ్వుకొకుము ప్రభు!

## 19

నీ కన్న వారలే, నాకు వచింపుము,
భక్తులు సుతు లని పలుకుమందు?
నీ యంత వారలే, నిజముగాఁ జెప్పుము,
జ్ఞానులు ప్రియు లని చాటుచుందు?
నీ మెచ్చు వారలే, యే మైనఁ బలుకుము,
ఆ విరాగుల వెంట సరుగుచుందు?
నిజముగా మూర్ఖుఁడనే నేను? కానైన
నీ కన్న బిడ్డను గాకపోను-
విద్దె లెఱుఁ గని బిడ్డల దిద్దికొనుట,
లేకి బిడ్డలఁ గని సమాళించుకొనుట
తల్లి దండ్రుల కున్న బాధ్యతలు కావె?
పెద్ద లెవ రింక నే మెుఱ్ఱపెట్టుఁగ ? - ప్రభు?

## 20

ఆలకించితి ''ఇనిత్యాని శరీరాణి ''
యను సూక్తి శ్రుతివీథి- నందువలన
మనసులోఁ దోఁచిన మాట యే ననుకొందు,
తీరిపికొందు సందేహబాధ-
తనలోన మన సుండి, తనువులోఁ దా నుంట
నట్టింటి మిథునంబు నాఁగఁ దోఁచె-
తనువు వీడిన వెన్కఁ దా నేమి కానోపు?
తన తోడి మన సేమి పనికివచ్చు?
నిత్య మగు నట్టి తన కా యనిత్య మైన
యాలయము మీఁద నటు మన సైన దేమి?
మనసుతో నేడ్పు, నవ్వును దన కిఁకేల?
చెనఁటి మనసు నడంచి నిన్ జేరుదు ప్రభు!

## 21

త్రోవఁ జూపింపఁగాఁ దోడు నా కెవ రమ్మ?
మనస! ముందే నీవు చనితి వమ్మ-
మాట మంతియుఁ జెప్పు చేటి నా కెవ రమ్మ?
బుద్ధి! నన్ భ్రమయించి పోయి తమ్మ-
సిగ్గు ద్రుగ్గింపఁగాఁ జెలియ నా కెవ రమ్మ?
చిత్తమా! న న్నొంటిఁ జేసి తమ్మ-
ఆరాట ముడిగింప నండ నా కెవ రమ్మ?
భావమా! యే త్రోవఁ బట్టి తమ్మ!
కంటి నో యమ్మ! నా వారు కారు మీరు,
ప్రాణసఖు లంచు మి మ్మెంచి భంగ పడితి!
నాకుఁ బ్రాణేశుఁడే శరణం బటంచు
నహము వీడితిఁ- బ్రత్యక్ష మైతివి ప్రభు!

## 22

పితరులు పెట్టిన పే రున్నదియె నీకు?
నామహీనుఁడ వీ వనంగఁ దగవె?
నలుగురు మెచ్చెడి నడత యున్నదె నీకు?
గుణహీను డీ వనుకొనుట కొలయె?
ఒరు కంటఁ బడ వింత యులు కేమిటికి నీకు?
రూపహీనుఁడ వన్న పాప మున్నె?
కన్నవా రెవ రైన నున్నవారే నీకు?
గోత్రహీనుఁడ వనుకొనుట తప్పె?
నామ గుణ రూప భవము లేనాఁడు లేని
వాని నినుఁ బట్టుకొని జగత్స్వామి యనుచు
శ్రుతులు నుతియించు నను టనుశ్రుతముగాక
ఎఱిఁగి యే మని ని న్నాశ్రయింతును? - ప్రభు!

## 23

అరసెనో లేదా చందురు చిన్నివెన్నెలఁ,
గలకల నవ్వు చెంగలువ పువ్వు-
విరిసెనో లేదా తామర పూవు, నెత్తావి
బరు వెక్కి వ్రాలు తెమ్మెరల చాలు-
దరిసెనో లేదా క్రొవ్విరి, తేనెపెర సోన
రుచిఁ బేర్చి యెలదేఁటి రొద లొనర్చు-
కురిసెనో లేదా మైకొని మబ్బులో వాన,
యెల [illegible] వనకోయిల తమించు-
మన [illegible] ంతు విటు చందమామ వగుచు,
తలఁపుఁ బుట్టింతు విటు ప్రాణదాత వగుచు,
ప్రణయసుధ నిచ్చి, విశ్వానుభవముఁ దెచ్చి
గురుకరుణ నిట్లు మ మ్మేలుకొందువు ప్రభు!

## 24

వయ సేమొ పడమట వ్రాలిపోయిన దింక,
దీని నెవ్వరు వెనుద్రిప్ప లేరు-
కాయంబు శిథిల మై కదలిపోయిన దింక,
దీని నెవ్వరు కూడఁదీయ లేరు-
బుద్ధి వైశద్యంబు పొలసిపోయిన దింక,
దీని నెవ్వరును సాధింప లేరు-
భావంబు వికలత బడలిపోయిన దింక,
దీని నెవ్వరుఁ బ్రసాదింప లేరు-
ఆశ లే దని- చింతింప- ఆశ తోఁచి
యెదిగిపోవుచు నుండంగ నెవరు దీని
నాప లే రని నీ పద మాశ్రయించి
నంతలో- వింత!- నీ రూప మైనది ప్రభు!

## 25

తనలోని శత్రులఁ దరలింప లేనైతి,
బాహ్య శత్రుల నెట్లు ప్రతిఘటింతు?
మదిలోని కోర్కుల మరలింప లేనైతిఁ,
బ్రకృతి వాంఛల నెట్లు పాపుకొందు?
తలఁపులో మెలపులఁ దలఁగింప లేనైతి,
లోకబాధల నెట్లు రేకడంతు?
అంతరంగము భక్తి నలుకంగ లేనైతి,
నిఖిలేశు నం దెట్లు నిలుప నేర్తు?
అరులఁ దొలఁగించి, మదికి స్వాస్థ్యమును గూర్చి,
చిత్తశుద్ధిని బుద్ధి వశీకరించి,
అహము నెడలించి, భక్తిదాస్యము గదించి,
నిన్ను సేవించుశక్తి నందింపుము ప్రభు!

## 26

అడుగుల మడుగుల నటు ద్రిప్పి యెవ్వరో
తడఁబెట్ట, నీ దారి తప్పినావొ?
దారిఁ జూపించు నా వారలు చేదివ్వె
మఱువఁగా వెనుకకు మరలినావొ?
ఆటపాటల నిన్ను నలరించు వారల
మరఁగి నీ పైనమే మరచినావొ?
ఆపదఁ బడిన యే యాంతరంగికుఁడొ, తా
మొఱ వెట్టఁగాఁ గావ మరలినావొ?
రాక యుండుట కేమి కారణమొ తెలియ;
ఒడ లవశ మయ్యె, మన మార్తి నొంది కుందె;
నడికి రేయి గతించె; ని ట్లడలు పెంచి,
వేచి యుండిన న న్నింటి వీడుదె? - ప్రభు!

## 27

అంతట శుద్ధశూన్యత తాండవింపఁగా
నాఁడు ఎ న్గనుపెట్టినావె నీవు ?
నిట్టూర్పు సెగ దిశానిలయంబు లలమఁగా
నన్నుఁ గాంచి బాళి గొన్నావె నీవు ?
భువనతరంగముల్ పొంగారుచుండఁగా
నా జీవనము కోరినావె నీవు ?
పంచభూతములు ప్రపంచించుచుండఁగా
నన్నుఁ బిల్చి మాటాడినావె నీవు ?
నాఁడు నేఁడును నీ తోడినీడ నగుచు,
విశ్వమూర్తి నై నాకు నే వెలయుచుండ,
బిడ్డలకుఁ దండ్రి వైతివి ! పెద్ద వైతి !
విశ్వపతి వైతి ! ని న్నెట్లు విడుతును ప్రభు ?

## 28

పతిగ నుండెద వీవు, సతిగ నుండెద నేను
జీవదాంపత్య సంసిద్ధిఁ జూప -
సుకృతిఁ గూర్చెద వీవు, ప్రకృతిఁ బేర్చెద నేను
జీవప్రబంధ ప్రసిద్ధి జూప -
మురళి నూఁదెద వీవు, సరళిఁ బాడెద నేను
జీవప్రణయ ఫలసిద్ధిఁ జూప -
మరలఁ బెట్టెద వీవు, తెరలఁ జుట్టెద నేను
జీవభా వానంద సిద్ధిఁ జూప -
భువన నాటకరంగ ధాముడవు నీవు,
ప్రకృతి నాటకరంగ నాయికను నేను -
యవని కాభ్యంత రాఖిల భవ విచిత్ర
జీవపాత్రల వెలయఁ జేసెద మిటు, ప్రభు !

## 29

వేదాంతవాదాల వెఱ్ఱి యెత్తిన దయా,
గోపాలక విహార గోష్ఠిఁ బడితి?
ఉపనిషత్సారాల నొడలు దూలిన దయా,
సాధు సజ్జన నివాసములఁ బడితి?
పౌరాణికార్థాల భ్రాంతి గూరిన దయా,
తాప సాశ్రమముల దారిఁ బడితి?
చతురేతిహాసాల మతి చలించిన దయా,
భక్తుల పాటల పాలఁ బడితి?
ఇన్ని విధముల పసి దప్పి, యిందు నందు
నెందు నిల్కడ లేక చరించు నిన్ను
నీశ్వరేశ్వరుఁ డంచుఁ బ్రాణేశుఁ డంచు
నొప్పికొనుచుంటి, నభిమాన మున్నదె? - ప్రభు! -

## 30

తన తప్పుటడుగులే తన ముప్పునకు దారి
యను పౌరుషము నొప్పికొనఁగరాక-
తన చెడ్డకాలమే తను పడ్డ కారణ
మను గ్రహచారంబు ననఁగరాక-
వెనుకఁ దా నొనరించుకొనినదే యనుభావ్య
మను కర్మమును దిట్టికొనఁగరాక-
ఏ వాద మెఱుఁగక యెల్ల కష్టములలోఁ
గులదైవముల వేఁడికొనఁగరాక-
పౌరుషము లేక, గ్రహచార బాధ లేక
కర్మమును లేక, దైవాల గాథ లేక,
అన్నిటికి నిన్నె మది నమ్మి యున్న నన్నుఁ
గరుణ దరిఁ జేర్చి మన్నించి కావుము ప్రభు!

## 31

భక్తలోకమునకుఁ బారిపోవకయుండ
నిన్నాపుకొనునేర్పు నేర్చుచుంటి-
జ్ఞానిలోకమునకు జారిపోవకయుండ
నిను నిల్పికొనుతెల్వి నేర్చుచుంటి-
యోగీంద్రలోకాన నాఁగిపోవకయుండ
నిన్ను రావించుకో నేర్చుచుంటి-
నిష్కామ్యలోకంబు నీ కేమి సుఖ మయా,
దానిని సాధింపఁ దలఁచుచుంటి?
మనసు మా చెడ్డ దయ్య! దానిని గ్రహించి,
తీర్చి, బతిమాలి, అదపులోఁ దెచ్చిపెట్టి,
నీకుఁ దో డిచ్చి, నినుఁ బట్టి నిలిపికొనఁగ
మనవిఁ దెలిపికొనఁగ నెంతు మాటికి- ప్రభు!

## 32

మబ్బులోపలి చందమామ చందంబున
నా మాయమనసు వెన్కనె చరింతు-
గుబురులోపలి గండుఁగోయిల వడువున
నా నెమ్మదినె డాఁగి, నన్నుఁ బిలుతు-
పసిరికపట్టులోపలి యిట్టి వలెనె, నా
యంతరంగములోనె గంతు లిడుదు-
తమ్మిపూలోపలి తుమ్మెదరీతి, నా
యెదలోనె తిరుగుచు రొద లొనర్తు-
నిన్ను దాఁచికొంటి నన్ను నా తెల్వినే,
పలుకు నేర్పు రామచిలుక వగుచు,
మానసమున నడల మప్పు రాయంచవై
కొంటె వగుచు, నాఁచికొంటివి- ప్రభు!

## 33

మన మొక్క టైయున్న మాట దక్కిన దింక,
నెవ్వ రే మతి నున్న నేమి మనకు?
తను వొక్క టైయున్న ధైర్య మబ్బిన దింక,
నే యర్థ మెవ రన్న నేమి మనకు?
తలఁ పొక్క టై యున్న తాత్పర్య మైనది,
యెవ రెట్లు భావింప నేమి మనకు?
ప్రాణ మొక్కటైయున్న పరమార్థ మైనది,
యెవ రెట్లు తర్కింప నేమి మనకు?
ఆకసము భూమి యొక్కటే యన్న యట్లు,
ఆత్మ - పరమాత్మ యొక్కటే యైన యపుడు-
ఎవ్వ రే మన్న వినఁగఁ బ నేమి? వారి
కద్వయానంద మే మర్థ మైనది? ప్రభు!

## 34

చీకటి తెర మాటుచేసి నాటక మాడ
నా వాడలోఁ జొచ్చినావు నీవు-
చుక్క త్రొక్కిన త్రోవ సుళువుగాఁ గనుపెట్టి
యే ప్రక్క కేగఁగాఁ నెంచినావు?
ఆకాశ మిలు సేసి యేకాంత మేటికి,
ఆశలు చెవిఁ బెట్టి యాలకింప?
మాపటి పడకిల్లు రేపటి కే మౌనొ,
తలఁపుఁ దల్పుల వెన్క దాఁగఁ గలమె?
ప్రొద్దుపొడిచె, నింటి పెద్దలు లేచిరి,
మాయఁ బెట్టి పోవ మాను మింక-
ఆలుమగల మగుచు నందఱ ముందర
కుందు లేక మసలు కొందము- ప్రభు!

## 35

నా కథ పూర్తి యైనది, వినం దగు నీవు
కీడుమేళ్ళకు నెకిమీఁడ వగుట -
పాత్ర లన్నిటి నేనె పట్టి యాడించెద,
కర్మసూత్రమున కేఁ గర్త గాను -
ఎవరి కర్మమున కెవరు కర్త లటంచు
నాచార రీతి న న్నడుగఁ బోక -
సూత్రధారుఁడ వయి చూచి దిద్దికొనంగ
కథ మనోహరముగాఁ గడచిపోవు -
ఆకసము, సూర్యుఁ, డటు నిటు లోకములును
నా కథా లోకమునఁ ద్రిప్పి, నాకు, నీకు -
గాంచు వారలు మేల్భళా యంచు మెచ్చ -
పేరుపెత్తనముల నిలఁబెట్టుము ప్రభు!

## 36

తూరుపుఁ గొండపైఁ దొంగిచూచిన యంత
పొంగిపోయితిని సాష్టాంగపడితి-
కనుసన్న ననుఁ జేర్చి కౌఁగిలించిన యంత
లొంగిపోయితిని కాళులను బడితి-
నట్టింటి వెలుఁగులో న న్నెత్తికొని నంత
క్రుంగిపోయితిని వ్రేలంగఁ బడితి-
నా పాలిటికి సూర్యనారాయణుఁడ వంచు
చాయనై నా శాయశక్తి కొలఁది-
ప్రొద్దు టావుపాలఁ బొంగించి రంగార,
పడమటింటఁ బైఁడి పళ్లెరమున,
ప్రణయ పంచభక్ష్యపరమాన్న మందింప,
కుడువ కెందు డాఁగి కొంటివి? ప్రభు!

## 37

నా పాపకర్మముల్ నలుగురి లోపలం
గొంకులేక వచించు కొందుఁగాని-
నీ పుణ్య మాయెను! నా పూర్వజన్మ పా
త్రల గాథఁ జెప్పఁగాఁ దలఁపకు సుమి!
ఈ పుట్టు తగులాన నేడ్చుట చాలక
వెనుకటివి తలంచి వెక్కివెక్కి-
పొక్కి యేడ్చుచుఁ గ్రుంగిపోయి, నిన్ మఱతును,
మాయ న న్నిటు లెడసేయఁ బోక-
ఎడద ని న్నెంచి కొనుచు న న్నేడ్వ నిమ్ము-
ఎపుడు నీ పాదములె కొల్వ నేడ్వ నిమ్ము-
పతితపావనుఁడును, భక్తపాలకుఁ డను
బిరుదు నీ కున్న న ట్లేడిపించకు- ప్రభు!

## 38

నీ పాదపద్మ సన్నిధి పెన్నిధులఁ గాంచి
తని వొందు సత్తపోధనులఁ దలఁచి-
నీ సత్కృపాలోక భాసమానతఁ గాంచి
తమి దేరు జ్ఞానిసత్తములఁ దలఁచి-
నీ దరహాస చంద్రికల పొందిక లంది
మతిఁ జొక్కు యోగీంద్రమణులఁ దలఁచి-
నీ విశ్వకల్యాణ దైవమూర్తిని గాంచి
పరవశు లగు భక్తవరులఁ దలఁచి-
తాపసుఁడఁ గాక, యోగసాధకుఁడఁ గాక,
జ్ఞానిఁ గాక, భక్తుఁడఁ గాక, సాధుసేవఁ
జేసి నీ మీఁది కృతు లెన్నొ చేసికొంటి-
పేర్మి విను మంటి - బలవంతపెట్టను, ప్రభు!

## 39

నా గతి నీ వంచు నమ్మియున్నందుకా
కనులఁ జూడ నిదేమి కర్మ మోయి! -
నా పతి నీ వంచు నమ్మియున్నందుకా
పలుకరింప నిదేమి పాప మోయి! -
నా మతి నీ వంచు నమ్మియున్నందుకా
వెతలఁ బెట్టె దిదేమి వేడు కోయి! -
నా స్మృతి నీ వంచు నమ్మియున్నందుకా
దయను బ్రోవ నిదేమి ధర్మ మోయి! -
నా నిమిత్తము నిను నమ్మినా నటంచు
రాక తక్కితొ? కాక మారాము లేల?
ఏ నిమిత్తము లేకుండ నెట్లు పిలుతు?
ఏ మనుచు వత్తు, వెట్లు న న్నోమెదు? ప్రభు! -

## 40

ఆకసం బయ్యెదో నా కందరాకుండఁ
గంటిలోఁ దారనై కలియుదుఁ బ్రభు! -
తెమ్మెరై తిరిగెదో దిక్కు దిక్కులనుండి
వలపునై నీ తోడ వత్తును ప్రభు! -
మబ్బులో నగ్నివై మరఁగి యుండెద వేమొ
మెఱుపునై చెంతనే తిరుగుదుఁ బ్రభు! -
నదముగా జాఱెదో నా కంటఁ బడకుండ
వంక చాలునఁ గూడవత్తును ప్రభు! -
నింగియును, గాడ్పు, నగ్నియు, నీరు మార్చి
ధాత్రి వై విశ్వరూపంబుఁ దాల్తు వేమొ?
సకల జీవులఁ గని పెంచు శక్తి నగుచు
వెంట నంటుదు, న న్నెట్లు విడుతువు? ప్రభు! -

## 41

తమ తల్లిదండ్రులఁ దనిపి ప్రేమించెడి
వారికిఁ బెంపును బేరు వచ్చు-
తమ బంధుమిత్రులఁ దమి మీఱ మన్నించు
వారికి వాసియు వన్నె వచ్చు-
తమ గురుప్రభువులఁ దద్దయు సేవించు
వారికి ధీగౌరవములు వచ్చు-
తమ యిలువేల్పులఁ దాత్పర్యమునఁ గొల్చు
వారికి సుఖవైభవములు వచ్చు-
తల్లియును దండ్రి వీవె, బాంధవుఁడ వీవె,
విహితుఁడవు నీవె, గురుఁ డీవె, వేల్ప వీవె,
అన్నియును వచ్చు నినుఁ గొల్చు నట్టివారి
కఖిల పావన! సాధుజనావన! ప్రభు! -

## 42

చన్న దేమి యటంచు సరిచూచు కొనుచుందు
నా భూత వృత్తంబె నాకుఁ దోఁచు-
ఉన్న దేమి యటంచుఁ గ న్నుంచి చూతును
నా వర్తమానమే నాకుఁ దోఁచు-
రానున్న దే మంచు ధ్యానించి చూతును
నా భావి భాగ్యమే నాకుఁ దోఁచు-
చన్న దున్నది వచ్చుచున్నది సరిచూతు
నా యున్కి యొక్కటే నాకుఁ దోఁచు-
ఇన్ని విధముల గనఁబడుచున్న దేనొ?
వయసు మాయల నను బెట్టి వంక లేక
తాఱిపోయెడి కాలమో, దాని మూల
మైన నీ వేమొ! నా కనుమానము ప్రభు! -

## 43

నే నియంత్రిణి నౌదు, నా నికేతనమున,
కిందలివారు నా యిష్టసఖులు! -
నీ యిష్టరీతుల నిన్నె సేవింపఁగాఁ
బ్రియపడి యంగీకరించినారు-
ఎపుడు వత్తువో యని యెదురుచూతురు వారె,
నిశ్చలభక్తితో నిన్నుఁ గొలువ-
ఎవ్వారి నిట సంశయింపక దయచేయు
మడుగులఁ గొల్తురు మడుగు లొగ్గి-
వీరు నావారు కారు నీవారు గాని-
నేను నాదానఁ గాను నీదానఁ గాని -
ఇల్లు మా యిల్లు గాదు నీ యిల్లు గాని-
వేడ్క నొక యింటివాఁడ వై వెలయుము ప్రభు! -

## 44

పెళ్లి పేరంటాల పే రెఱుఁగఁ డటన్న
సన్యాసి మాటలఁ జిన్నపుచ్చి-
ఇల్లు వాకిలిలేని యేకాకి యితఁ డన్న
పలుగాకి మాటలఁ బదడుపుచ్చి-
మంచిచెడ్డలు లేని మాలకాకి యటన్న
తుంటరి మాటలు త్రోసిపుచ్చి-
పేరుపెంపును లేని పెను బికారి యటన్న
వెంగలి మాటలు విన్నపుచ్చి-
దయ దలిర్పఁగ నా మెడఁ దాళి కట్టి,
వెలయ నొక యింటివాఁడ వై విశ్వవినుతి
గాఁగఁ గడిపెడు బిడ్డలఁ గాంచు మయ్య!
కోటికోటి లోకములకు గుఱుతుగ ప్రభు! -

## 45

కనుఁ బెట్టి మా యాకృతినె చూపుదువు గాని,
నీ యాకృతినిఁ జూడనీయ వేమి?
చెవిఁ బెట్టి మా గళారవమె విన్పెదు గాని,
నీ సుధాసూక్తి విన్పింప వేమి?
ముకుఁ బెట్టి వాసనల్ ముట్టి చుట్టెదు గాని,
నీ కృపాసురభి నందింప వేమి?
మెయి వెట్టి, ఆశల మెట్లఁ ద్రిప్పెదు గాని,
నీ దివ్యధామాన నిలుప వేమి?
దివ్య దృష్టిఁ గాచి, దివ్య శ్రుతులఁ బ్రోచి,
దివ్య సురభి మాకుఁ దీసి వైచి,
దివ్య సుంద రాకృతిని మూల దాఁచితే?
ప్రకృతిఁ గావ నిట్టి పను లఁటె? ప్రభు!

## 46

లెక్కపెట్టఁగరాని చుక్కల యిం డ్లంట!
ప్రతియింట నీవె కన్పడుదు వంట!
తుదిమొదల్‌లేని పెన్‌త్రోవలు గల వంట!
యేత్రోవఁ జూచిన నీవె యంట!
లక్షోపలక్షల లావణ్య సతు లంట!
యెల్లర నొక యట్ల యేలు దంట!
కోటానుకోటుల కూర్మి సంతతు లంట!
యొకలాగె యందఱ నోము దంట!
ఇంతవాఁడ వనుచు నే నెఱుంగని నాఁడె
కోరి నిన్ను వలచికొంటి నోయి!
ఎంతవాఁడ వైతి! - వెఱఁగియొఱఁగి నేఁడు
నిన్ను విడిచికొనఁగ నేర్తునె? ప్రభు!

## 47

ఒడలు వీడకు జీవ! - ఉండ నీతో మాయ!
నిలు నిలు జీవ! - నే నిల్వ మాయ!
దేహి యంటిని జీవ! - మోహపెట్టకు మాయ!
మన చెల్మి జీవ! - కర్మంబు మాయ!
మై మేడలో జీవ! - మురఁగింపకుము మాయ!
సంపత్తిఁ గను జీవ! - చాలు మాయ!
కన్నబిడ్డలు, జీవ! - కట్టైదనే మాయ?
ప్రియ జాయ జీవ! - కప్పెదవె మాయ?
నే నిరాశ్రయ జీవ! - మన్నింపు మాయ!
న్యాయమే జీవ! - ధర్మమే మాయ! యనుచు
జీవ మాయాభియోగంబు చేసికొంటి
మరసి యొక తీర్పు నిప్పింపు మంటిమి ప్రభు! -

## 48

ఈ నాఁటి చెల్మియే యిది మన కో జీవ!
కడతేర్చు కొంటిని గాదె మాయ!
నను వీడుటే సౌఖ్య మనుకొంటివో జీవ!
ఇట్టి యాభాస మిం కేల మాయ?
పూవులలోఁ బెట్టి పూజించితిని జీవ!
జన్మవాసన లింకఁ జాలు మాయ!
బతిమాలు కొలఁదిని బాఱిపోయెదె జీవ!
ప్రారబ్ధ మయ్యెఁగా పాడు మాయ!
సంచి తార్థము లివె జీవ! - చాలు మాయ!
ముం దరసికొంటె జీవ! - యే ముందె? - మాయ!
అనెడి జీవ మాయాభియో గార్థ మరసి
కరుణ నొక తీర్పు గావింపఁగాఁ దగు ప్రభు!

## 49

భయద సంసా రాబ్ధి పారంబుఁ జేర్పించు
నావ, నీ పాద సంసేవ నాకు-
ఘోర దారి ద్ర్యాంధకారంబు వారించు
తరణి, నీ నామసంస్మరణ నాకు-
దారుణ పాప లతా పాశములఁ ద్రుంచు
కత్తి, నీ ధ్యానసంపత్తి నాకు-
బహుజన్మ రోగతాప నివృత్తిఁ గావించు
ఘుటిక, నీ కీర్తనార్చ్బటిక నాకు-
క్రూర కామాది శత్రుపక్షులను గొట్టు
తూఁపు, నీ మీఁది తపములోఁ జూపు నాకు,
సాధుయోగ సదానంద సాధనములు
నీ కథారాధనము లగు నా కిఁక- ప్రభు! -

## 50

ఎందాఁక నీ సత్క్ర్పేక్షణా సార సం
కేత మందాఁక సంగీత కళలె, -
ఎందాఁక నీ వచో హేలా విలాస సా
హిత్య మందాఁక సాహిత్య కళలె, -
ఎందాఁక నీ విశ్వ సుందర వర పదా
ఖ్యాన మందాఁక భావార్థ కళలె, -
ఎందాఁక నీ మంద మందస్మితామృత
స్నాన మందాఁక నానంద కళలె, -
నీ కళాలోక మెందాఁక నిలుచు నంత
దాఁక సంతాన కళలె నిత్యముగఁ జేసి
అఖిల సత్కళా భారతి వగుటె గాక
ఆది సత్కవి బ్రహ్మవు నైతివి ప్రభు! -

## 51

అధికార వాంఛలో నటమట పెట్టెదే
కామమా! ఇంత పోఁగాల మేలె?
కులతత్వ గోష్ఠిలోఁ గలఁత లెక్కించెదే
క్రోధమా! కొంపలు గూల్చి వైతె?
ధనపు మూటలు గప్పి దారి తప్పించెదే
లోభమా! నీ కున్న లాభ మేమొ?
కనకాంగులను బెట్టి గంతు లేయించెదే
మోహమా! ఈ మరు దాహ మేలె?
మదమ! మాత్సర్యమా! మీదు మన్కి నొల్ల,
తలఁగి పొం డని పగఱ నదల్చుచుంటి,
గంతులో వచ్చి- వీరల గం డడంచి,
ఇంతలో నార్తి పుచ్చి- న న్నేలుము ప్రభు!

## 52

తలఁపులో వలపులోఁ దత్తరపాటులోఁ
బ్రియము మీఱఁగ నిన్నె పిలుచుచుంటి! -
మందులో విందులోఁ దొందరపాటులోఁ
బే రెత్తి నిన్ను నే పిలుచుచుంటి! -
మాటలో మంతిలో మచ్చరపాటులోఁ
బలుమారు ని న్నెంచి పిలుచుచుంటి! -
అలపులో సొలపులో నచ్చెరుపాటులోఁ
దెలియ కుండఁగ నిన్నె పిలుచుచుంటి! -
పగలలోఁ జెల్మిలో భంగపాట్ల లోనఁ
బలుకరింతలలోఁ గుస్కిపాట్ల లోనఁ
దలఁచి తలఁపక నిన్ను నే పిలుచుచుంటి,
ఒక్కయపు డైన 'నో' యనుచుంటివె? ప్రభు! -

## 53

తొక్కుపల్కుల నాఁడె తోడ మాటాడితి
చనుబాల దొగరు మోవిని గదించి, -
ప్రక్క కొత్తిలు నాఁడె మక్కువఁ జూపితి
నునుగేలు చిన్ని వెన్నున గదించి, -
ప్రాకఁ జూచిన నాఁడె పడకుండఁ బట్టితి
తెలి పట్టువల్వ పొత్తిట గదించి, -
తప్పుటడుగుల నాఁడె తమిఁ గాలు నిల్పితి
ఎగురు నెమ్మేన దోసిలి గదించి, -
అలరు ప్రాయము నాఁడె న న్నాదరించి,
దిద్ది తీరిచికొంటి సందిట గదించి,
తల్లి వై ప్రోచితివి నాఁడు, తండ్రి వగుచు
నేఁడు నను గావు మనుట నా నేరమొ? - ప్రభు!

## 54

తల్లి ప్రేమయె నన్నుఁ దలదన్ని గెంటఁగా
క్షితి మీఁదఁ బడి కెవ్వుకెవ్వు మంటి-
పత్ని ప్రేమ యెడంద బ్రద్దలు సేయఁగా
సాములోఁ బడి యోము మోము మంటి-
బిడ్డల ప్రేమ నా పేర్మి పంచికొనంగ
దేవులాడుచుఁ గావు కావు మంటి-
రక్తబంధుల ప్రేమ రాపిళ్లు పెట్టఁగా
పడలేక 'పాహి మాం పాహి' యంటి-
ఇంతలో నెట డాఁగెనో యెడఁదలోన
నిట్టనిలువున నీ ప్రేమ నిండఁ గంటి!
నిర్ఝరతఁ గంటి , నిను వేఁడ నేర్చుకొంటి,
నన్ను విడకుండు మంటి నేనాఁడును- ప్రభు!

## 55

కన్నార నీ మూర్తిఁ గనుఁగొని వచ్చిన
సుకృతాత్ము నెపు డైనఁ జూడఁ గలనె?
నో రార నీ తోడ నుడు లాడి వచ్చిన
యనఘాత్ము నెటు లైన నరయఁ గలనె?
చేతు లారఁగ నిన్ను సేవించి వచ్చిన
ధన్యాత్ము నెట నైన దరియఁ గలనె?
చన వార నీ కొల్వు సాగించి వచ్చిన
భవ్యాత్ము నెం దైనఁ బడయఁ గలనె?
భక్తి గన్నవారు, ప్రత్యక్షముగ నిన్నుఁ
గన్నవారు వచ్చి కంటఁ బడిన
నిన్నుఁ గన్న యట్లె నే వారి పాదాలఁ
బూజ చేసి నిన్నుఁ బొందుదు ప్రభు! -

## 56

ఆర్త రక్షణ పరాయణుఁడు గాఁ డనుచు గ
గ్గోల పెట్టెదను న న్నేల వేని,
వర దాభయ కరంబువాఁడు గాఁ డని డప్పు
చాటి తీరెద నన్ను సాఁక వేని,
కరుణాభరణ సుధాకిరణుండు గాఁ డని
మచ్చ పెట్టెద నన్ను మనుప వేని,
సకల లోకావన స్వామి గాఁ డని అవ్వ
సేయుదు నను గృపసేయ వేని,
హితమతిని గోరు బిడ్డ కే మిచ్చి యైన
తండ్రి సవరించు కొనుట పెత్తనము గాదె!
కృపను గోరితిఁ గాని, నీ కీర్తిఁ దీసి
పొదలఁ గిరీటముగఁ బెట్టు మందునె ప్రభు!

# 57

అన్నంపు మత్తు బ్రహ్మానుభూతి మతంబు,
తను మత్తు పంచభూత స్మితంబు-
అన్నువ మత్తు ప్రియాభిమత రతంబు,
జనము మత్తు సమాజ సంగతంబు-
మనసు మత్తు విశిష్ట మాయాకృతి కృతంబు,
ధనపు మ త్తైశ్వర్య సునిశితంబు-
మదనామకపు మత్తు మధు పదార్థ హితంబు,
అధికారమదము గర్వాభిమతము
దైవ భక్తి మత్తు జీవాత్మ విరహంబు-
మత్తు లిట్లు పెట్టి, మాకుఁ గట్టి,
నాకుఁ గాని యట్లు నవ్వుచు నుందువే!
ఇట్టి నాటకంబు లేటికి? - ప్రభు!

# 58

ఉన్నదానికిఁ దృష్టినొంది యుండెదఁ గాని,
లేని దానిని గోరి లేమిఁ బడను-
చన్నదానికి జలాంజలి యిచ్చెదను గాని,
కష్ట సౌఖ్యము లెంచి కస్తిఁ బడను-
కన్నదానికి మెప్పు కాను కిచ్చెదఁ గాని,
నాకుఁ గావలె నన్న లేకిఁ బడను-
విన్నదానికి సత్య మెన్ని చూచెదఁ గాని,
ఔఁ గాము లెఱుఁగంగ నార్తిఁ బడను-
ఉన్న వాఁడవు నా లోన నన్న బుద్ధి,
చన్న దంతయు ననుభూతి యన్న బుద్ధి,
కన్నదియు విన్నదియు మాయ యన్న బుద్ధి
యున్న- నీ కన్న నా కేమి యున్నది? ప్రభు! -

## 59

బహుశి లాక్రాంత దుష్పథ మనోరథముల
సన్మార్గమునఁ ద్రిప్పఁ జాలి నపుడె-
అంధకార హృ దంత రాకాశ వీథి నా
శల జోతు లెల్లెడ నిలిపి నపుడె-
శోక జన్మ ద్రుమ శుష్క-శాఖల నిచ్చఁ
బచ్చతోరణముల గ్రుచ్చి నపుడె-
ప్రబల సందే హార్తి రంగ వాటిక మంగ
ళానంద గీతిక లల్లి నపుడె-
ప్రీతి మీఱంగఁ ద్వత్ప దాబ్జాత పీఠి
నన్నుఁ గల్యాణ వధువుగా నెన్ని నట్టి
నీ కృ పాపాంగ సూత్రము నాకు దొరకె
వరుఁడ వై యింక న న్నేలవలయును ప్రభు!

## 60

ప్రకృతిమయుఁడ వని భావించుటయె కాని,
యే వస్తు వీ వని యెఱుఁగవచ్చు?
త్రిగు ణాత్మకుఁడ వని తేల్చికొంటయె కాని,
యే గుణ మీ వని యెఱుఁగవచ్చు?
మహ దర్థ మని యనుమానించుటయె కాని,
యే చాయ నీ వని యెఱుఁగవచ్చు?
ఓంకార మని నిను నూహించుటయె కాని,
యే యక్షరంబుగా నెఱుఁగ వచ్చు?
వేద మైనను నినుఁ దెల్పలే దటన్న
నాదియును, నంత మెఱుఁగని వాద మేల?
నీ దయాలేశ మే దన్న? నాది యన్న
భక్తిఁ బ్రణమిల్లి, నీ సేవ బ్రదుకుదు ప్రభు!

## 61

లోపలి శత్రుల నా పయిం ద్రోయుట,
ముసుంగులో గ్రుద్దు లాట సుమి! మనకు-
పై వైరులను దెచ్చి పంత మాడించుట,
కసి మసంగిన కయ్యము సుమి! మనకు-
లో వారిం బై వారి నా వంకం ద్రిప్పుట,
అసమంపు టిరు వేరము సుమి! మనకు-
జీవుండనై నేను, దేవుండవై నీవు
వెస పోరికొనుట వేడ్క సుమి! మనకు-
ఈవు నే నిట్లు పోరంగా నేవి మిగులు?
కానంబడునవి, కనరాని వేని, పోవు-
తనువు పడుదాంక మన మిట్టు లనంగి పెనంగి
అవల- అవ్వల- ఏకమే- అగుదుము- ప్రభు! -

## 62

కలకంఠ కూజిత కలవాణిం బిల్తువు,
వినుచుంటిం బ్రాణేశ! వేగ వత్తు-
మధుప ఝుంకార సామశ్రుతిం బిల్తువు,
వినుచుంటి హృదయేశ! వెడలి వత్తు-
గిరి ఝరీ మధుర సంగీతాలం బిల్తువు,
వినుచుంటి జీవేశ! వేడ్క వత్తు-
ఘన ఘనాఘన తూర్య నినదాలం బిల్తువు,
వినుచుంటి భువనేశ! విధిగ వత్తు-
భక్తి పళ్లెరమునం బత్ర పుష్ప ఫలాంబు
లునిచికొనుచుం జెలుల ననిచికొనుచు
నిన్నుం గొలిచి కొనంగ, నీ కృపారసమును
విలిచి కొనంగ వత్తు, వేగమె ప్రభు! -

## 63

చిగురు టిండులవాడఁ జిరభక్తి నిన్నుఁ గొల్చు
కలకంఠి సఖులను గలిపికొనుచు-
తావి పూవుల నీడఁ దమి నిన్నుఁ బూజించు
నెలదేఁటి చెలువల మలపి కొనుచు-
ఫలరసంబుల జాడఁ బట్టి నిన్ను నుతించు
చిలుక నెచ్చెలుల మచ్చికను గొనుచు-
చుక్క కన్నెల తోడ మక్కువ నిన్నెంచు
నెలపుల్గు నెలఁతల నిలిపికొనుచు-
ప్రేమ సంకీర్తనంబులఁ బిలిచికొనుచు,
భక్తి సరసాన్న పాత్రలఁ బట్టికొనుచు,
శ్రీప దాబ్జాత యుగళ మర్చింపఁ గోరి
కేకలో వత్తు నిదె కోప గింపకు- ప్రభు! -

## 64

కన్నవా రెవ రయా! విన్నవా రెవ రయా!
నీ మూర్తి, నీ కీర్తి నీవె కాక -
ఉన్నవా రెవ రయా! చన్నవా రెవ రయా!
నీ యింటు, నీ వెంట నీవె కాక -
చేయువా రెవ రయా! వ్రాయువా రెవ రయా!
నీ బోధ, నీ గాథ నీవె కాక -
ఎఱుఁగువా రెవ రయా! మఱుఁగువా రెవ రయా!
నీ మాయ, నీ చాయ నీవె కాక -
ఒరులు కనఁగ రాక, పరులకు విన రాక,
ఎంతవారి కైన నెఱుఁగ రాక,
ప్రకృతి వికృతి శయ్య బహు పరాకాష్ఠతో
నూర కెంత కాల ముందువు? - ప్రభు! -

## 65

పున్నెంపుఁ దావుల పొంతలఁ బో లేక,
తీర్థంపు రేవులఁ దిరుగ లేక -
ధర్మంపుఁ జేఁతలఁ దలఁపుఁ బెట్టఁగ లేక,
దానంపు రీతులఁ గాన లేక -
జపముల తపముల జాడఁ బట్టఁగ లేక,
కర్మంపు దారులఁ గట్ట లేక -
జ్ఞానంపు దృక్కుల సన్నలఁ గన లేక
యోగంపు దిక్కుల కేగ లేక -
బత్తి యొకటె పూట బత్తెముగాఁ గొని,
వెనుక ముందు లేక, విసువు లేక,
ప్రాణ విభుని నిన్నుఁ బట్టెడి పేరాస
నొక్క లాగె తిరుగుచుంటిని ప్రభు! -

## 66

ఒక నాఁడు గాదోయి! ఒక యేఁడు గాదోయి!
ఎల్ల కాలంబు నీ ముల్లె టోయి! -
ఒక పల్లె గాదోయి! ఒక యూరు గాదోయి!
ఎల్ల లోకంబు నీ యిల్ల టోయి! -
ఒక దృష్టి గాదోయి! ఒక సృష్టి గాదోయి!
ఎల్ల సంసృష్టి నీ వల్ల టోయి! -
ఒక లీల గాదోయి! ఒక హేల గాదోయి!
ఎల్ల దృశ్యంబు నీ కల్ల టోయి! -
అనుచు గర్జించు దాసున కడలి పోయి,
అంత కింత సర్వజ్ఞత్వ మవుఁ బెట్టి,
ఎచట డాఁగితి వోయి! నీ వెదుటఁ బడిన,
దాసవరు తప్పు దండాలఁ దలఁగదె? - ప్రభు!

## 67

కదము ద్రొక్కు తురంగ గతులఁ బట్టించెదే!
యతిమూర్తి! యీలాటి యాట లేల? -
పటుభల్ల మెత్తిన భటునిగా నిల్చెదే!
ప్రాసమూర్తీ! యింత పంత మేల? -
రణగుణ ధ్వని సేయు రధికుని జేయుదే!
గణమూర్తి! యీ ఝుణంఝుణము లేల? -
శబ్దభేది మహాస్త్రశౌరిఁ జేసెదవె! ఛం
దోమూర్తి! యీ త్రోవఁ ద్రొక్కు టేల? -
భాషితానురూప భావసంకీర్తనా
భ్యాస రంగసీమ, నాజి రంగ
సీమఁ జేసి నన్ను జేతగా నిటు సేయ
ప్రీతి గన్న యాత్మనేతవె! - ప్రభు! -

## 68

పలుకుఁ జక్కెర పాట కళ సొంపా, చెవి కింపా,
రసన పెంపో చెప్పరావు గాని-
వలపుఁ దెమ్మెర పూవు కళ పొందొ, తల చందొ,
ముకు విందొ వచియింపఁ బోవు గాని-
తలఁపు మించుం దీవ కళ తీరొ, చద లేరొ,
యెద పేరొ, ఆనతి యీవు గాని-
ఎలమి వెన్నెల వత్తి కళపట్టొ, కను కట్టొ,
ఆట గుట్టో చెప్ప వైన గాని-
పలుకుఁ దోఁటల నిటు వనస్పతులఁ దీసి,
సరస సద్భావ మూలికా శక్తిఁ జేసి,
సచ్చిదానంద నామ రసాయనంబు
సుకవితాపాత్ర నందింప జుట్టెదె? - ప్రభు!

## 69

నవ్వితే నీ వింత, నవరత్న హారాలె!
నా చిన్ని కైతలు నాథ నీకు-
చూచితే నీ వింత, చుక్కల పేరులే!
నా చిన్ని కైతలు నాథ నీకు-
ముట్టితే నీ వింత, ముత్యాల పేటలే!
నా చిన్ని కైతలు నాథ నీకు-
పట్టితే నీ వింత, బంగారు పదకాలె!
నా చిన్ని కైతలు నాథ నీకు-
కూర్మి నేఁ జేసికొన్నది కొంచె మైన,
పేర్మి నీ వంటి నంతనే పెద్ద గాదె!
కీర్తనల నేర్తు, రాగంబు గూర్తు వీవు-
ప్రణయ రాగమొ, నీ యనురాగమొ ప్రభు!

## 70

కోయిల సన్నాయి! కొసరి కూయకు మోయి!
పదవోయి! ప్రసవతల్పము గదోయి! -
అళి దళవాయి! యిం దలజడి తగదోయి!
చను మోయి! పొత్తిళ్ళ నన గదోయి! -
చిలుక సిపాయి! పల్కుల త్రుళ్ళు తగ దోయి!
పరువోయి! క్రొన్నెల బాలుఁ డోయి! -
తెమ్మెర తిరువాయి! గమ్మనఁ బోకోయి!
నిలుమోయి! అద్దాల నిసుఁ గిదోయి! -
కొమ్మ ప్రసవ మైన గుర్తింపఁగాఁ బోక
హాయి యనుచుఁ బవలు రేయి నాక
రేఁగి మూఁగి మారుమ్రోఁగెద వేలోయి!
మాయకొమ్మ కింత మఱఁగితె? - ప్రభు!

## 71

ఎవ్వ రే మంటి రోయీ? కోప మే లోయి?
ఎంత కొంటెవు గదోయీ! పరాయి!
నీ కన్నబిడ్డ లోయీ! కూర్మి లే దోయి?
చిన్నాఁడ వోయి? యోచింప వోయి!
ఎడబిడ్డ- పెడబిడ్డ లెటు లున్న, కడబిడ్డ
లే మేము నీ కోస మేడ్తు రోయి!
ఎవరూర డింతు రోయీ వీరి? మరి వేఱె
పెద్ద లున్నా రోయి? పిలువ వోయి!
పో రుడుప వోయి! నీ చాటు వార లోయి!
తెంపు తగ దోయి! యిది నీకుఁ బెం పటోయి?
నను మఱచి య్యైన బిడ్డల మనుప వోయి!
భువనపిత వోయి! రా వోయి! మ్రొక్కెదు ప్రభు!

## 72

అభ్యాసవశమున 'నహ మస్మి' యంటిని!
నేను తా నగునె యే మైనఁ గాని-
ఆంతర్య మరయక 'హంసోహ' మంటిని!
నేను హంసనె యేమి య్యైనఁ గాని-
సాహసంబునను 'శివోహ' మ్మటంటిని!
నేను శివునె యెన్నఁ డైనఁ గాని-
ఆదిలోఁ గనుక 'సోహం బ్రహ్మ' యంటిని!
నేను బ్రహ్మనె యెన్నఁ డైనఁ గాని-
అక్షరం బైన యీ త్రిప్పులాట లోని
లాను నే ననుకొను వెఱ్ఱితనము లోని
నేను నే నను నభిమాన మానఁగానె
భక్తి నినుఁ గొల్చుకొని 'నేను' బ్రదికితి ప్రభు!

## 73

మన సైనఁ జొరరాక, మాడి యెండిన కోర్కి-
యే జడినో యిట్టె యిగురు వెట్టు-
తలఁ పైనఁ జొరరాక, తలఁగి పోయిన కూర్మి,
ఉండుండి తలయెత్తు నుల్ల మందె-
కల నైనఁ గనరాక, కత్తరించిన యాస,
కలఁతనిద్దుర నిట్టె కాలు ద్రొక్కు-
హం సైనఁ గనరాక, అలసుఁ జెందిన మేను,
వలగాలిలో నిట్టె జలదరించు-
లోని నీ లోక మిట్లు మా లోక మగుటె
కాక, మా లోక మెల్ల నీ లోక మయ్యె,
మాయలోకాల మా దారి మరగఁ జేసి,
ఒదిఁగి యే లోక మందు నీ వుంటివి? ప్రభు!

## 74

జగదేక కవి నని నిగమ రత్న సువర్ణ
బిరుదంబు డాకేలఁ బెట్టినావె?
భువనైక గతి నని భుజగ ఫణా మణీ
భూరి నూపుర మంఘ్రిఁ బూన్చినావె?
త్రైలోక్యపతి నని రవిచంద్ర సౌవర్ణ
భుజకీర్తు లంసాలఁ బొదివినావె?
దీనావనుఁడ నని శ్రీనివా సాశేష
పరమార్థ మింటింటఁ బంచినావె?
ఒరుల కున్నది తనకు లే కున్న దనక
బిరుదములఁ గొట్టి, త్యాగాల పేరు పెట్టి,
విశ్వపతి నంచు మాటల విసరి వైతు-
వేలుబడి కిన్ని వేషంబు లేయుదె? - ప్రభు!

## 75

నీ కటా క్షాలోక నిర తాభిషేకి నై
నిగ మావలోకి నై నెగడ నిమ్ము-
నీ వచో వాహినీ ని త్యావగాహి నై
విగత సందేహి నై వెలయ నిమ్ము-
నీ నిర్మ లాంఘ్రి సే వానంత భోగి నై
యానంద యోగి నై యలర నిమ్ము-
నీ నామ కీర్తన ధ్యాన సంసక్తి నై
పర మార్థ సూక్తి నై ప్రబల నిమ్ము-
నీదు మానస సంజాత నీరజాత
మధుర మకరంద రస పాన మత్త మధుప
మూర్తి నై తావ కామల కీర్తిగాన
వర్తి నై యుండ నిమ్ము నీ వాడను ప్రభు-

## 76

దౌత్యమో, తన వాద పైత్యమో కన నీని
పాండిత్య మదమునఁ బదము దీసి-
శౌర్యమో, తన కార్య చౌర్యమో కన నీని
యైశ్వర్య మదమున నక్షి మూసి-
కారమో, తనదు వికారమో కన నీని
యధికార మదమున నవని ద్రోసి-
ఆలమో, తనకుఁ బోఁగాలమో కన నీని
కలికాల మదమునఁ గాలు వేసి-
మానమో, యభిమానమో కాననీని
జీవ మదరంగమున నన్నుఁ జిత్తు చేసి,
పౌరుషముఁ దీసి, నీ కాళ్లఁ బడఁగఁ జేసి,
చిర కరుణఁ జేసి, నీ దాసుఁ జేసితె ప్రభు! -

## 77

పేరువు దప్పక యుండ బల మిచ్చుకొను దేవ!
ఫలము నా తోటనే పట్టి కొందు-
పేరులు దెప్పక యుండ బాలించుకొను దేవ!
గుణము నా పేటనే కూర్చికొందు-
మడిమ ద్రిప్పక యుండ మన్నించుకొను దేవ!
జయము నా కోటనే చాటికొందు-
తమము గప్పక యుండ దయఁ జూచికొను దేవ!
వెలుగు నా నోటనే వెలిపికొందు-
మాయ గుప్పక యుండ నన్ మనుపు దేవ!
మేలుకొలుపుల నా నోట మెచ్చికొందు,
బాము నప్పక యుండ నన్నాము చాలు,
కూర్మి నా పాట చవు లందుకొందును ప్రభు!

## 78

పాప సంతాపంబు నోపఁ జాలక యుంటి,
నార్తుండ నన్నుఁ గాపాడు మయ్య! -
మూఢ చిత్తుఁడఁ దమంబునఁ గూరియుంటిని,
సుజ్ఞాన భాస్కరుఁ జూపు మయ్య! -
మదరోగమున మేని కుదురు గానక యుంటి,
కరు ణామృత మొసంగి కావు మయ్య! -
ఆసుర బాధలో నటమట పడుచుంటి,
సౌర రక్షను గట్టి సాకు మయ్య! -
పదము గొనియాడికొందును, పాడికొందు
పేరు చెప్పికొందును, తెల్వి పిలిచికొందు,
కరుణ స్మరియించుకొందును, కరముగొందు,
కొసరి నీ యింటి సుఖ మందికొందును ప్రభు! -

## 79

నా మోము నద్దాన నప్పుకొందును సరే!
నీ నగుమోము నెద్దానఁ గందు?
నా విచిత్రాకృతి నైజ మెంచుదు సరే!
నీ చిత్ర మే నెందు చూచికొందు?
ఏ పల్కు సవ్వడి నేని తెల్పుదు సరే!
నీ పల్కుబడి నెట్లు నే గ్రహింతు?
ఏ మూర్తి పాడ వైన నిట్టె పోల్చుదు సరే!
నీ మూర్తి నెట్లు పొందించు కొందు?
కన్నవియు, విన్నవియు నెన్ని యున్నఁ గాని
ఇంతలోన గ్రహింపఁగా నెఱిఁగి యెఱిఁగి,
ఎందులకుఁ గాక దూరాన నుందు వనుచు
నెఱిఁగి, నిమఁ గోరు టెందుకో యెఱుఁగను ప్రభు!

## 80

బొమ్మ పెండిలి నీవె పుస్తె గట్టితి వన్న
నా కథ లాలించినావొ, లేదొ?
ఏ నాఁటి ప్రతినయో - యీవె నా పతి యన్న
నా విన్నపము లందినావొ, లేదొ?
నా దన్ను దాదినే మీఁదుగట్టితి నన్న
నా కూర్మిఁ దెలిసికొన్నావొ, లేదొ?
ఎవరి కై యీ బొందె నే నుందు ననుకొన్న
నా యవస్థల నెంచినావొ, లేదొ?
వలపు టెడఁద తంతులలోనఁ బిలిచికొంటి!
జీవభావ రావములోనఁ జెప్పికొంటి!
ఊర్పుగాడ్పులో వచ్చి న న్నోము మంటి!
పేర్మి బ్రదు కిది- నీ చేతఁ బెట్టెద ప్రభు! -

## 81

సిరిచుక్క పొడిచీని, చెవి నేమొ చెప్పీని,
మరియాద పోనీకె మారు తలఁపు! -
నడిరేయి దోఁచీని, నగుమోము దాఁచీని,
కనుకట్టు కనఁబోకె చెనఁటి చింత! -
కనుమూఁత పుచ్చీని, కలగాని వచ్చీని,
మైసోకు రానీకె మాయ మనసు! -
వలవాన గొట్టీని, తలయేరు పట్టీని,
ఎడఁబాటు పడనీకె వెడఁగు బుద్ధి! -
సిగ్గు వచ్చీని, ఎడఁద హెచ్చీని బెడద,
కుదురుకొని- ఎదుర్కొని- సామిఁ గొలువుఁ డనుచు
ఇంట వెంటను సవరించుకొంటి- ఏల
జాగు చేసేవు? - నే నింక సైపను ప్రభు! -

## 82

నాఁడు తిక్కన వ్రాసినది భారతం బన్న
దధి కార్థ బోధకం బయ్యె నేఁడు-
నాఁడు వేమన చెప్పినది తత్త్వ మన్నది
ఆ- కుల తత్త్వార్థ మయ్యె నేఁడు-
నాఁడు గోపన కట్టినది యాలయం బన్న
దధి పార్థ కైంకర్య మయ్యె నేఁడు-
నాఁడు విస్సన చెప్పినది వేద మన్నది
అధికార వా క్యార్థ మయ్యె నేఁడు-
దేశ కాల పాత్రము లిట్లు త్రిప్పి త్రిప్పి
విమల భూతార్థముల కపార్థములు చెప్పి
ప్రకృతి మాయలు గప్పిన పట్టులోనె
దాఁచికొందువె పరమార్థ తత్త్వము? - ప్రభు! -

himself. Shaila followed him. The policemen holding the leader ran off for their life.

That confusion provided us opportunity to disappear in the dark lane leading to the ghats.

Next day the newspapers reported: "A desperate terrorist shot at an intelligence officer at Godawlia Chowk in Banaras, but the officer was not hurt."

Finding me 'bruised by city hooligans' at the theatre melee, our Acharyaji did not allow me to go out of the college compounds any more without his previous permission.

## 85

వరక రాభయహస్త బిరుదాలు నిల్పుకో!
పాలించుకొనుట యేపాటి మాట? -
భువనరక్ష భూరి భుజకీర్తు లుంచుకో!
పాలించుకొనుట యేపాటి మాట? -
శరణార్థిక శరణ్య చరణాలు నిల్పుకో!
పాలించుకొనుట యేపాటి మాట? -
భక్తలో కావన పదపీఠి నిల్పుకో!
పాలించుకొనుట యేపాటి మాట? -
కోరి వచ్చిన బిరుదాల గొడవ మాని,
కొలువుఁ దీరిచి జగ మేలుకొనుట మాని,
దాసులను బ్రోవ మాని, పెత్తనము మాని,
మూల దాఁగుట కే మంత మునిఁగెను? ప్రభు! -

## 86

పరువెత్తుకొని పోవు భావాలఁ బద్యాల
పాదాలఁ బెట్టుట పాప మనక-
అర్ధనా రీశ్వరు, నాత్మభా వేశ్వరు,
జీవ పదార్థ విశిష్టు నిన్ను-
కలపల్కు-న నుతింతు- కడుపున- కుడుపునఁ
గని పెంచి తిరు కంటఁ గన్నతల్లి!
ఇంట, బైటను, నెల్లవెంట ముక్కంటివై
కరుణఁ బ్రోచితి నన్నుఁ గన్న తండ్రి!
కడుపులో నుండి చీకటిఁ గాననైతి;
కుడుపులో నుండి వెలుఁగైన ఁ గోరనైతి;
జ్ఞాన మెఱిఁగియుఁ గననైతి- కానఁ గలుగు
కన్నడుగుచుంటి- మూఁడేక- మన్నది ప్రభు! -

## 87

సూర్యచంద్రులు లేనిచో మాకు నీ లీల
పవలు-రేయి గ్రహించు ప్రజ్ఞ యున్నె? -
సుజనగోష్ఠులు లేనిచో మాకు నీ దారిఁ
బరువెత్తుకొని వచ్చు భాగ్య మున్నె? -
సుగుణసంపద లేనిచో మాకు నీ కీర్తి
మణిమాల నల్లికో మార్గ మున్నె? -
సుకృతిసంతతి లేనిచో మాకు నీ యింట
తరతరాల సుఖించు దార్ఢ్య మున్నె? -
ఇహమునకు నెన్నొ వసతుల నిచ్చినావు,
పరమునకు నెన్నొ మెట్టులు పఱచినావు,
ఇచటఁ గా లూని యా మెట్ల నెక్కి నంత,
సచ్చిదానంద పదము మా సదనము! ప్రభు-

## 88

శతమాన మొక్కటి సంతరించితి ప్రేమ,
నా గళంబునఁ గట్టినావు నాఁడు-
శతమానము మఱొండు సంతరించితి ప్రేమ,
నా గళంబునఁ గట్టినావు నేఁడు-
అత్తింటి, పుట్టింటి యానవాళ్లుగ, వధూ
వరుల మైతిమి పెండ్లివారు మెచ్చ-
మన పెండ్లి కత లెల్ల మన బిడ్డ లిఁక మీఁదఁ
జిత్తంబు రంజిల్లఁ జెప్పికొనుచు-
భక్తి సంకీర్తనములుగాఁ బలుక నిమ్ము!
భావ సంకీర్తనములుగాఁ బాడ నిమ్ము!
పుత్రపౌ త్రాభివృద్ధిగాఁ బొగడ నిమ్ము!
విని తనియు కంటె వే ఱేమి వేడుక ప్రభు! -

## 89

నెలరాలమేడలోనే నేను నినుఁ గూడి,
చాయనై యద్దంపు జాయ నైతి-
నీలాలవాడలోనే నీవు ననుఁ గూడి,
నిజముగా నా తోడునీడ వైతి-
నిగమాలవీదిలోనే నేను నినుఁ గూడి,
చదువు నై నీ యాస్య సదన నైతి-
నిట్టూర్పునాదులోనే నీవు ననుఁ గూడి,
మూఁడు మూర్తులను నా వాఁడ వైతి-
మఱకువను నేను, తెలియఁగా నెఱుక నీవు ;
ఆదిమ బ్రహ్మ నీవు ; గాయత్రి నేను,
ఏక మైతి మోంకార మం దిరువురమును
అద్వయానంద నిత్యాలయమ్మున ప్రభు! -

## 90

నా భావ సంకీర్తన ప్రార్థనంబులు
వినిపించుకొంటివి వేదవేద్య! -
నా ప్రేమ సంజీవన ప్రసంగంబులు
పోషించుకొంటివి భువనవంద్య! -
నా భక్తి సంశోధన ప్రబోధంబులు
వెలయించుకొంటివి విశ్వవంద్య! -
నా నిశ్చ లారాధన ప్రబంధంబులు
చదివించుకొంటివి సర్వవంద్య! -
నా వినిర్మల సుకృతి సంభావనములు
నీ విశేష కృపాపాంగ పావనములు,
నా జనన పుణ్యాపద పుష్పపూజనములు
సతత తావ కాభీష్ట భాజనములు ప్రభు! -

## 91

వాహినీ జలములు వచ్చి [illegible]గా
ముస్నీటిలోఁ [illegible] యట్లు-
వివిధ నాదంబులు వెడ[illegible]బుగాఁ
బ్రణవనాదంబు[illegible]సిన యట్లు-
సకల తేజంబులు సాగి [illegible]గా
శుచి మీఱ నగ్నిలోఁ [illegible]చ్చినట్లు-
జీవాత్మ లఖిలంబుఁ జే[illegible]బుగాఁ
బరమాత్మలో [illegible] యట్లు-
నా విమల భక్తిసంకీర్తన[illegible]
నా వచోరూప సత్ప్రబంధం[illegible] వెల్లి
సృష్టిచిత్ర విధాత్రు, బ్రా[illegible]త్రుఁ
డైన బహ్మాత్ము ని న్నంది [illegible]త! ప్రభు!

## 92

లోక మంతయును బెంజీకటి [illegible]టిలో
మాయ పాలను [illegible] యుండె-
కనుమూసి త్రావుట, కనువిచ్చి క్రోలుట
యొక యట్లె కన[illegible]ముండె- నంత-
చీకటి తెర వెన్కఁజేసి మా[illegible]ఁ గదా!
ఏక లోకంబు ! [illegible]లోకమయము!
ఉదయరాగ పటానఁ బొ[illegible] నీ మూర్తి ;
వెలుపల లోపం[illegible]సి [illegible]వె!
కంటి నద్దానఁ- దల క్రిందుగా [illegible]లుంగు
వికటమూర్తి! - జ్ఞానాంశుక పీఠిఁ దోఁచె
దివ్యసుందరమూర్తి- దేదీప్యమాన
మూర్తి! - నేఁ గాంచి నీ వని మ్రొక్కితి ప్రభు!

## 93

నా పుట్టి నింటి చింతన మైన లేకుండ
కూర్మిలో మఱపించుకొంటి వోయి!
నా తోడివారి జ్ఞానం బైన లేకుండ
జంట వై మరఁగించుకొంటి వోయి!
నా పుట్టుపాపతనపు టూహ లేకుండ
నింటి పెత్తన మిచ్చికొంటి వోయి!
నా మంకు మాయతనం బుబ్బనీకుండ
దంటగా నన్నేలుకొంటి వోయి!
వింత విశ్వకుటుంబి వై వేడ్క నన్నుఁ
జిత్ర విశ్వకుటుంబిని జేసి తోయి!
నీ కరగ్రహణంబున నిఖిలమునకు
నే సనాతన నైతి నోయీ! ప్రభు! ప్రభు! -

## 94

శ్రుతి చెప్పికొన లేదు, మతి విప్పికొనఁ బోదు-
అది నీవు, ఇది నేను- మొదలొ తుదియొ?
కళ చొక్క మనఁ బోదు, కల నిక్క మన లేదు-
అది నీవు, ఇది నేను మొదలొ తుదియొ?
ఇహ మేది యనఁ బోదు, పర మేది యన లేదు-
అది నీవు, ఇది నేను మొదలొ తుదియొ?
ఎఱుక యే మనఁ బోదు, మఱపు దే మన లేదు-
అది నీవు, ఇది నేను- మొదలొ తుదియొ?
పదము లీ వన్న- భావముల్ పెంచు నన్న,
భావ మీ వన్న- కీర్తనల్ ప్రబలు నన్న,
అది యిదియు నీవు నే నను టర్థ మన్న-
మొదలఁ దుదిఁ గల్పుకొని నీకు మ్రొక్కుట ప్రభు!

## 95

వందనంబులు మౌనివంద్య! శతానంద
వందిత పాదారవింద! నీకు-
వందనంబులు సదానందమందిర! సాధు
సందోహ సన్నుతానంద! నీకు-
వందనంబులు విశ్వవంద్య! యోగీంద్ర హృ
న్మంది రాబ్జ నట న్మిళింద! నీకు-
వందనంబులు భక్తమందార! వందారు
బృందార కాఖిల బృంద! నీకు-
వందనంబులు జగ దభివంద్య ! నీకు-
వందనంబులు నిగ మాభివంద్య! నీకు-
వందనంబులు కవిజనవంద్య! నీకు-
నిత్య సుకృతి! వందనములు నీ కివె ప్రభు!

## 96

ఇది సువ ర్ణాక్షర పద పరమార్థ మై
సరస భావ శ్లోక సంహిత యయి,
సురుచిర హృదయ సంశుద్ధ రాగంబున
రతనాల పతక మ్మై రాజిలంగ,
సత్కీర్తి చంద్రికా సన్మౌక్తికంబుల
సద్గుణ గణమాల సంతరించి,
నా పేరి మీఁదుగా నవభూషణంబుగా
ఆచంద్ర తా రార్క మై రహింప,
వేదవేత్త, కుభయ విశ్వ పండితునకు,
అఖిలబోధకునకు, నాదికవికి
అగ్రహార మనఁగ నర్పించుకొంటిని-
ఇదియె శాసనముగ నేలుము ప్రభు!

## 97

చంటి వాఁ డెడవాని చక్కికి రానీయఁ
డెడయాతఁ డనుజన్ము నేడిపించు-
బండి నుండిన వాఁడు పై వాని రానీయఁ
డా యయ్యఁ బై వాఁడు త్రోయఁ జూచు-
యజమాని తన యింటి కతిథిని రానీయఁ
డతిథి యా గృహమేధి నాగ్రహించు-
అధికారి తన పదం బన్యుఁ ద్రొక్కఁగనీయఁ
డన్యుఁ డాతనిని బోకార్పఁ జూచు-
లీల లిటు సూపి ప్రజలఁ బాలించు నీవు,
ఇహము పై నుండి విధి చలాయించు నీవు
నన్ను రా నిత్తు వని యెట్లు నమ్మవచ్చు,
ఇట్టి నిను బట్టి రచ్చను బెట్టక? - ప్రభు!

## 98

ఇహములో నర్థంబు నిల్లాలు గొనిపోవ
ముదలకింపఁగ లేక మోహ పడితి-
అహములో నర్థంబు నాత్మసంతానంబు
పంచికొనంగ విభ్రాంతి పడితి-
తిరములో నర్థంబు దెయ్యంబు లైదును
దేహి యం చడుగ సందేహ పడితి-
పరములో నర్థంబు పరమార్థ మని చెప్పి
జీవుండు దోచికోఁ, జిక్కఁ పడితి-
నా నిరర్థకతను జూచి, నన్నుఁ జూచి,
అర్థ మడిగెదు బుణదాత యట్లు లిపుడు
నిన్నుఁ గా దని నే దాచుకొన్న దేమి?
శుద్ధ మోక్షము! నా యిల్లు చూడుము ప్రభు!

## 99

భావాల వెంటనే పరువెత్తు పదములు
గణముల కందక కలఁకఁ దేఱి-
పదములతో నైక్యపడిపోవు భావముల్
యతులకుఁ జిక్కరా కారితేఱి-
పద్యాలఁ బాటలఁ బైకొను నర్థముల్
ప్రాసల కందక వాసి మీఱి-
గణయతిప్రాసల కట్టలు విరియించి
వర వచోవాహినుల్ వఱదవాఱి-
భక్తిభావ వేగంబున బహుముఖముల
వర్ణ నాతీత పద పాటవమున వచ్చి
సరస సాహిత్య సాగరేశ్వరుని నిన్నుఁ
గలసిపోవంగనెవ రాఁగఁ గల రిఁక ప్రభు!

## 100

ఒరుల కిచ్చుట నేర్పి, యొరు నొద్ద నొక తృణ
మేనిఁ గైకొన కుండగాను నేర్పి-
ఇచ్చి పుచ్చుకొనుట, యేను నీ వని నేర్పి-
ఉన్నింటి బిడ్డగా నుండ నేర్పి-
నిత్యకృత్యంబుగా నేఁ డగు వెచ్చంబు
ఋణముగా నైన గ్రహింపకుండ-
పైస యేనియును రాబడి చేత లేకుండ
నన్ను నిర్ధనుఁ జేసినావు నేఁడు-
అడుగ కిచ్చితి నెఱదాత వైతి నాఁడు,
అడుగ నీయవు ఋణదాత వైతి నేఁడు-
ప్రోడ వెటు లైన; నే నర్థి వాఁడ నైతి;
అడుగు టిచ్చుట బ్రహ్మాండ మయ్యెనె? - ప్రభు!

## 101

పదము పట్టింపఁగా, భక్తి రెట్టింపఁగా
పద్యమో, గద్యమో పాటఁ బాడు-
అర్థ మందింపఁగా, హాయి పొందింపఁగా
జీవమో, భావమో చేతరించు-
భావ మార్ద్రింపఁగా, ప్రకృతి ముద్రింపఁగా
పాత్రమో, చిత్రమో ప్రస్ఫురించు-
రాగ మేలింపఁగా, రసము తేలింపఁగా ,
ధ్యానమో, గానమో తాన మాడు-
భరతనాట్యంబులో నిట్లు భక్తవరుఁడు
సరస సంగీత సాహిత్య సార్వభౌము
నిన్నుఁ గొనియాడి వినతు లందించు వేళ
భారతియె నీకు హారతి పట్టును ప్రభు!

## 102

మట్టి త్రవ్వ టెఱుంగ , చెట్టు పెట్టు టెఱుంగ,
పుడిసెఁడు నీళ్లైనఁ బోయు టెఱుఁగ -
మట్టి పైఁ బుట్టితి, చెట్టు నీడనె యుంటి ,
గ్రుక్కెళ్లు మ్రింగుచుఁ గూరుచుంటి -
ఏ నాఁటి దీ మట్టి ? యీ నాఁటిదే చెట్టు?
పండ్లు కోయుచు నుందు, పంచు కొందు-
తోడు లై మాటాడ, నీడ లై నడయాడ
వస్తారు, - పోతారు, - వార లెవరొ?
ఎపుడు వచ్చి పోయెడి వారి కేడ్వఁ గాని-
తోడుగా రాక, నీడగా దొరకఁ బోక
ఎడముగా నుండు నీ కోస మేడ్చుచుంటి-
ఎందు కేడ్పింతు? వీ కర్మ మెవరిది? - ప్రభు!

## 103

ఇది జరా మరణాభిహితమైన దేహంబు
మోహంబు దీనిపై మొదటి మెట్టు-
సతి, సృష్టి మాయానుగతమైన చిత్రంబు
నేత్రంబు దీనిపై నిలుచు మెట్టు-
సుతుఁ డవజ్ఞారూప సుజ్ఞాన బంధంబు
సంధియే దీనిపై జాఱు మెట్టు-
ఆలయంబు నిరంత రాశా విశేషంబు
శేషంబు దీనిపై చివరి మెట్టు-
ఇహామునకు నిట్లు మెట్లు నాల్గె యటన్న
పరమునకు నెన్ని యని పల్కఁ బనియె? - క ..
ఉభయ జగముల కొక్కఁడె ప్రభుఁ డటన్న
నీ యడుగు పట్టు మె ట్టొక్కటే యగు ప్రభు!

## 104

వర మనోరథ చక్రవాక రారాజు, స
హస్రార గురురూప కాది హంస-
అమృ లాంతరంగ కల్హార రాకారాజు ,
భా వాంబర విహార పరమ హంస-
హృదయవీణా జీవ సదముల స్వరరాజు,
షట్చక్ర సంచార చారు హంస-
చిత్తపుష్ప మరందమత్త బంభరరాజు,
బుద్ధి ప్రసిద్ధ ప్రబోధ హంస-
రాజు హంసయు నొక్కటై రాజహంస
మనెడి గురుమూర్తి వైతి నా యందె నీవు,
అట్లు కాకున్న కవిరాజహంస బిరుద
మేమిట లభించె నాకు? నీ వీయవె? - ప్రభు!

## 105

నా లోన నెంగిలి, నాలుక నెంగిలి,
నా పల్కు లెంగిలి, నటన లెంగి-
లెంగిలిలోఁ బుట్టి, యెంగిలి ఁబెఱిగితి-
ప్రకృతి యెంగిలి నెట్లు పాపికొందు?
ఎంగిలిలో నుండి యేఁ జేయు కర్మంబు
లెంగిలియే కాక యేమి యగును?
స్నానాల నిది పోదు, సంధ్యలఁ బోవదు,
తంత్రాల మంత్రాల దారిఁ బోదు-
ఇహమున వెదకి చూచితి నిందు నందు,
నెంగిలి దొలంచుకొను మందు లెందు లేవు,
కాన, దీనిని జ్ఞానాగ్నిఁ గాల్చి వైచి,
పావ నాత్మనై నీ యింటఁ బడుదును ప్రభు!

## 106

ప్రభు గోపురము పూర్ణభక్తిచేఁ గట్టించి
గోపరా జెత్తించె శ్రీపతాక-
రక్తి కీర్తనలఁ దారకములోఁ బట్టించి
త్యాగరా జెక్కించె నమృత నౌక-
భక్తికావ్యము రామభద్రుఁడే పల్కింప
పోతరా జూదించె భువనమురళి-
లలితకావ్యము కుశీలవులచేఁ బాడించి
మునిరాజు మ్రోగించె ముక్తివీణ -
వారిలో నెవ్వఁడను గానివాఁడ నైన
నందితి పతాక, నౌ కాశ్రయంబు గంటి ,
మురళి నూదుచు నుంటి, నీ శరణ మంది
వీణ మ్రోగింతు నిఁక, నీవె వినఁ దగు ప్రభు!

## 107

నినుఁ గాంచి నవ్వితి, నను గాంచి యేడ్చితి
కన్నవారల మాయ గప్పి నపుడు-
నినుఁ గానకేడ్చితి, నను గాంచి నవ్వితి
తోడివారల మాయఁ గూడి నపుడు-
ననుఁ గాంచి నవ్వితి, నా వారికేడ్చితి
ప్రకృతి మాయలకు లోఁబడిన యపుడు-
వాసనల్ దిగఁద్రోసి, బోసినై నవ్వితి
కొసనవ్వు ముసలినై ముసలి నపుడు-
నవ్వు నాది, మాయ నాదిగా దనుచుంటి -
ఏడ్పు మాయ దనుచు నెఱిఁగి కొంటి-
నవ్వుమాయలకును నాథుండ నీ వంటి-
నవ్వుకొనఁగ నిమ్ము నన్నిఁక ప్రభు!

## 108

సంసారవార్ధి నెచ్చటినుండి దటుదు,
దీనికిఁ దీరమెందైనఁ గలదె? -
ఇది ఘోష పెట్టుచున్నది యొందుకోసమో,
అంత మీ ఘోషకెట్లైనఁ గలదె? -
జలచరంబుల ఘోష, జలములలో ఘోష,
ఆకాశ వాయువు లందు ఘోష,
బడబానలము ఘోష బ్రహ్మాండమగు ఘోష -
యింతటి ఘోష సహింపఁ గలమె?
ఘోషలో బ్రద్ద లగు నల్లఁ గొండ లన్న,
చావుపుట్టుల ఘోషించు జీవకోట్ల
మ్రింగుటనె దీని కీ ఘోష మిగిలె నన్న
తప్పగునా? మెప్పగునా? ఒప్పఁ జెప్పుము ప్రభు!

## 109

అమ రాపగ జలంబులా యివి! కన్నీళ్ల
మున్నీరు,పాదాలఁ బోయ వెఱతు-
లలిత కౌశేయంబులా యివి! చింతల
బొంతలు, నీ మేనఁ బూన్ప వెఱతు-
మలయానిలంబులా మఱి యివి! నిట్టూర్పు
వేఁడిగాడ్పులు, నీకు విసర వెఱతు-
అమరద్రుమ సుమంబులా యివి! బాసల
సీసాలు, నీ పూజ సేయ వెఱతు-
షోడ శోపచారంబుల చొప్పు లెఱుఁగ,
భక్తి సంభావనంబుల సూక్తు లెఱుఁగ,
జ్ఞాన ముద్రల మనువారి సాటి యెఱుఁగ -
మ్రొక్కు టొక్క టెఱుంగుదు ప్రోవుము ప్రభు!

## 110

తీవ. పుట్టిన చోటు తేల్చి నిన్ వెదకితి,
మొవ్వచ్చులో నాస పువ్వు పూచె-
కొమ్మ పుట్టిన చోటు కోరి నిన్ వెదకితి,
ఘనవర్ణముల కన్ను కాయ కాచె-
చెట్టు పుట్టిన చోటు చేరి నిన్ వెదకితి,
పదములో వాచవి పండు పండె-
వంక పుట్టిన చోటు వచ్చి నిన్ వెదకితి,
జీవార్థ ఫలరస సిద్ధి గూడె-
నింగి వ్రాలిన చోటున నిన్ను వెదకి
పుట్టుతలఁపుల పొత్తంబు పట్టఁ గంటి,
చిత్ర మే మందు నిఁక పత్రపత్ర మందు
అంతటను నీవె ప్రత్యక్షమైతివి ప్రభు!

## 111

చదల చుక్కల పేరి జపమాల లీ వోయి
తొలి మంతరపుఁ బాట తోఁచు దాఁక-
కడలి ముత్తెపు నావ నడిపింపఁ గద వోయి
బ్రదుకు పేటల పాట లదుకు దాఁక-
బ్రదుకు టామని తోఁట పల్లవింప గదోయి
జీవకోకిలము కూజించు దాఁక-
జీవవీణను బ్రపంచించి మీట గదోయి,
ఆత్మరా గాలాప మందు దాఁక-
ప్రణయ వాహినుల్ గాత్రగోత్రములఁ దెరలి ,
బారు లై వచ్చి, ప్రణ వాబ్ధిఁ బడిన దాఁక-
జీవగాయకుల్ నినుఁ జేరిపోవు దాఁక-
మై మఱచు దాఁక పాటలు మాన్పకు ప్రభు!

## 112

పుట్టు పొత్తంబు విప్పుదువు కాఁబోలునే!
మొదటిలో నీ పేరు చదివికొనఁగ-
జీవపత్రములు వ్రాసెదవు కాఁబోలునే!
తెలివిలో నీ వ్రాలు తెలిసికొనఁగ-
హృదయవిపంచి మీటుదువు కాఁబోలునే!
మీటులో నీ మాట చాటుకొనఁగ -
కీర్తిచిత్రములు చెక్కెదవు కాఁబోలునే!
సుకృతిలో నీ మూర్తి చూచికొనఁగ-
నీ చదువు లేక, చదువుకో నేర్తు నోయి!
నీ లిపి యెఱుంగక, పఠింప నేర్తు నోయి!
నీ మడు లెఱుంగ, కాలింప నేర్తు నోయి!
ఎట్లు పోలుతు నోయి ని న్నెఱుంగక? - ప్రభు!

## 113

బల మేది యనఁగ దోర్బలము కా దనుకొందు,
ప్రతిభ మై నీ తపోబలము గొందు-
కుల మేది యనఁగ నాకులత గా దనుకొందు,
గో త్రాగ్రణిని నిన్నె కొలిచికొందు-
మత మేది యనఁగ సమ్మతము కా దనుకొందు,
నర్థించి నీ మత మందికొందు-
కృతి యేది యన నహంకృతి నిల్వ దనుకొందు,
సుకృతిమూర్తిని నిన్నె చూచికొందు-
వరద! నను మెచ్చి తోడుగా వత్తు వేని,
పౌరుషము చచ్చె నని నేను పలుక నేల?
దైవపౌరుషములు రెండు నీవె యైన
శపథములు సుపథమ్ము లై చనుఁ గద ప్రభు!

## 114

కర్మంపు టడవులఁ గాల్చి వైచితి సరే!
నీ రాజ్యమునకు రా నేర్తు నింక-
ధర్మంపు మెట్టుల దాపు వెట్టితి సరే!
నీ సౌధమున కెక్క నేర్తు నింక-
శ్రుతిహి తాచారాల బ్రతుక నేర్చితి సరే!
నీ పురా ణార్థముల్ నేర్తు నింక-
భక్తిప్రబంధముల్ పాడ నిచ్చితి సరే!
నీ యోగవిద్యలు నేర్తు నింక-
శాంతిశమదమాదులు చూపఁజాలితి సరె!
నీదు పదసేవలో నిల్వ నేర్తు నింక-
జ్ఞాన మెఱిఁగిన బిడ్డగా సంతరించి
ఏలుకొను మింక నన్ను నీ యిష్టము ప్రభు!

## 115

చింత గొన్న విధంబు శ్రితజనాశ్రిత మంటి,
శ్రీపదస్మరణంబు చేసికొంటి-
చేసికొన్న సుకృతి శ్రీనిధానం బంటి ,
శ్రీశరణంబుగాఁ జేసికొంటి-
దాచికొన్న ధనంబు తనది కా దనుకొంటి-
శ్రీపదార్పణముగాఁ జేసికొంటి-
పాడుకొన్న పదంబు భవహరం బనుకొంటి,
శ్రీపదాంకితముగాఁ జేసికొంటి-
సేవ మిగిలించుకొంటి నీ చిత్త మింక,
సేవ లందింపు మంటి నా చిత్త మింక,
చిత్త మొక్కటి చేసి నీ సేవఁ జేసి,
అన్య దుర్లభ పదము నే నందుదు ప్రభు!

## 116

ఒకనితోఁ బంతమా! ఓర్వఁ జాలవు సుమీ,
జగ మెల్ల నా వారె జగడమాడ-
ఒక మూల నుందువా! ఉండఁ జాలవు సుమీ,
ఊరూర నిది చాటి తీరు వాఁడ-
పరుఁడ నే నందువా! పరువు దక్కదు సుమీ,
అందఱు పరు లైన నాటకట్టు-
మొఱ విన నందువా! ఒరిమ నిల్వదు సుమీ,
చెప్పెడి శ్రుతు లేమి చేసినట్టు?
మాయ మా యమ్మ! నను మాయ చేయ లేవు-
పంతములు మాని, యొంటరిపాటు మాని,
చెలిమి చేపట్టి ,నా మొఱఁ జెవులఁ బెట్టి-
దాసు ననుఁ బ్రోవు,మెందు కీ తగవులు? - ప్రభు!

## 117

వలపు పుట్టిన వచ్చి వ్రాలదా యెలదేఁటి-
పూవు పిల్చునె తన్ను బొట్టు పెట్టి?
చివురు లెత్తినఁ జూచి చేరదా కోయిల-
యెలమావి పిలుచునే యాల గొట్టి?
వెన్నెలఁ గని పొంగు వెట్టదా కలశాబ్ధి-
జాబిల్లి పిల్చునే సైగ గొట్టి?
మెఱుపు దోఁచిన లేచి పురి విప్పదా కేకి-
పిల్చునే మబ్బు తప్పెటలు గొట్టి?
భక్తిభావ కీర్తనముల పట్టు లరసి
ప్రేమలో వచ్చి ననుఁ బల్కరింతు గాక!
కూర్మి నాతోడ నిట నాడుకొందు గాక!
పేర్మియే నిన్ను ర మ్మని పిలుచుట? - ప్రభు! -

## 118

''కోయి కోయి'' యటంచుఁ గూక వెట్టిన చాలు,
నురిమి కోయిల ''ఎందు కోయి'' యనును-
''రామ రామ'' యటంచు రక్తిఁ జూపిన చాలు,
రాచిల్క '' ఇంత మారామ'' యనును-
''కూర కూర'' యటంచుఁ గేరుచుండిన చాలు,
శారి '' కారము కంటఁ గూర'' యనును-
''జుమ్ము జు'' మ్మనుచుఁ బంతమ్ము లాడిన చాలు,
తుమ్మెద గయ్యాళి ''జుమ్ము'' మనును-
బాలభావంబు లోకరీతిఁ బల్కుచుండ
జీవభా వార్థములు వేఱు చెందుచుండు,
భక్తబాలుండ నా పల్కు పల్కు లందు
దేవుఁడ వపార్థములు నీవు దెత్తువె? ప్రభు! -

## 119

మందు టెండకుఁ గొండ మసిగాదె- తనలోని
చిర నిర్ఝరిణులు రక్షింప కున్న?
పిడుగు పాటున నేల పిండిగాదే- లోని
య ప్పగ్ని గోళంబు నార్ప కున్న?
త్రిప్పట వడి ధూళి దేఱవే గోళంబు-
లా వేగ నియతి కాపాడ కున్న?
ఒధ వక్రతను మనోరథము భగ్నము గాదె-
బుద్ధి సారథ్యంబుఁ బూన కున్న?
జీవ నాంబుధి బడబాగ్ని చేతఁ జెడదె-
నీ కృపామృతల మొక యింత లేక యున్న?
నిఖిల విశ్వంబు రక్షింతు నియతి లోనె-
నీ నియతి యెవ్వ రెఱుఁగంగ నేర్తురు? - ప్రభు!

## 120

పరిపాటిఁ దనవారిఁ బల్కరింపఁగఁ బోయి
ప్రమదాన నిన్నుఁ బిల్చి బయటఁ బడుదు
ఎందుకో చెలువ పే రెత్తి వేఁడగఁ బోయి
అట్టై నిన్ వేఁడి హాస్యమునఁ బడుదు-
చెలువ చేతికిఁ బండ్ల చిక్కంబు నందించి
దక్కితి నీ కని చిక్కు వడుదు-
తలఁపుల పూసజ్జ తల కెత్తి మనసునే
నీ కడ కంపి సందేహపడుదు-
మాటఁ బడి యైన నీ మాట మఱవ నేర-
సొలపు దలఁపులలో నింత చోద్య మున్నె?
మఱపులో నిన్నె యెంతు- నన్ మాయఁ జేసి
మఱవ నీయవు; వన్నెల మఱతువు? ప్రభు! -

## 121

కన్నబిడ్డగ నన్నుఁ గాంచి లాలింపవే
తల్లి వై, పోషించు తండ్రి వగుచు-
చిన్నిబిడ్డగ నన్నుఁ జేర్చి పాలింపవే
గాదిలి వై, పెంచు దాది వగుచు-
ఎడబిడ్డగా నన్ను నెంచి తేలింపవే
తోడు వై, నా తోడినీడ వగుచు-
కడబిడ్డగా నన్నుఁ గరుణ నాలింపవే
జీవంబ వై, యిష్ట దైవ మగుచు-
బొజ్జలో నెల్ల జగములు పొడము కతనఁ
దల్లియును, దండ్రియును, జన్మదాత వగుదు,
ఎల్ల జగములు నీ బొజ్జ నిముడు కతన
స్వామివి, గురుండ, వఖిల రక్షకుఁడవు ప్రభు!

## 122

నా బొమ్మపెండ్లిండ్ల సోబనంబులు చూతు,
నా బువ్వబంతుల కాబ పడుదు-
నా చిఱుతిండుల వాచవి గైకొందు,
నా మేలి పలుకుల కామతింతు-
నా చిన్ని పీఁటపై నాతో వసింతువు,
నే నెటు వోవ నా తోనె వత్తు-
నా పాటలోఁ బాట వై పాడుచుందువు,
నా యాటలో నన్నుఁ బాయకుందు-
వోయి యని పిల్వఁ బల్కుదు వోయి యనుచు,
నన్ను నిన్నుగఁ జూచు కొన్నాఁడ వేమొ?
నాకు నీడ వై తోడ నున్నాఁడ వేమొ?
ఈవు నే నొక్క టని చెలు లెన్నఁగ ప్రభు! -

## 123

కష్టసుఖాలకై కనుఁ దేర్పఁగాఁ బోను
నీ చింత నాకు సన్నిధియె కాన-
కలిమిలేములకునై కరముఁ ద్రిప్పఁగఁ బోను
నీ కల్మి నాకుఁ బెన్నిధియె కాన-
మానాభిమానాల మమతఁ జెందఁగఁ బోను
నీ సేవ నా జీవనిధియె కాన-
ఇహపరంబులకునై స్పృహ వహింపఁగఁ బోను
నీవు నా కేకాంతనిధివె కాన -
ద్వంద్వ భావంబులకు నెల్ల స్వస్తి చెప్పి
నిర్మ లానందకర సుధానిధిని నిన్ను
నిరుపమ బ్రహ్మతేజోంబునిధిని నిన్ను
ప్రేమ శుద్ధాంతమున మఱపింతును ప్రభు! -

## 124

ఒడ లెఱుంగని చింతఁ బడఁజాలఁ బడఁజాల
నీ పాద సేవలో నిలువ నిమ్ము-
మన సెఱుంగని చింత మనఁజాల మనఁజాల
నీ నామ జపములో నిలువ నిమ్ము-
తలఁ పెఱుంగని చింత నిలఁజాల నిలఁజాల
నీ ధ్యాన ముద్రలో నిలువ నిమ్ము-
పర మెఱుంగని చింతఁ జొరఁజాలఁ జొరఁజాల
నీ దివ్య ధామాన నిలువ నిమ్ము-
పాద సంసేవలోఁ జింతఁ బట్టి పట్టి,
నామ మంత్రంబులోఁ జింత నమలి నమలి,
ధ్యాన సన్ముద్రలోఁ జింత దంచి దంచి,
పరమపదములోఁ జింతలు పంచుదు ప్రభు!

## 125

నడి సముద్రమున నా నావఁ ద్రిప్పులు వెట్టి
యొక దరిఁ బెట్టు నావికుఁడ వీవు-
పుట్టువు తెరల నా బొమ్మ నాడఁగఁ బెట్టి
యొక మూలఁ బెట్టు నాయకుఁడ వీవు-
క్షేత్రాంతరముల నా జీవనంబులు వెట్టి
యొక పంటఁ బెట్టు కర్షకుఁడ వీవు-
కర్మాలయమున నా గొంతు మ్రోవఁగఁ బెట్టి
యొక కృతిఁ బెట్టు గాయకుఁడ వీవు-
కవనపుఁ బదాల నా ప్రాణగాథఁ గట్టి
నీ యడుగుదోయి గజ్జెల నీడఁ బెట్టి
యొక ప్రబంధంబుఁ బాడించు సుకవి వీవు
దేని కది క్రొత్త యనిపించి తీరెదు ప్రభు!

## 126

కౌశికా విశ్వేశు కథఁ జెప్పి మెప్పింప
శ్రీనాథ కవిరాజుఁ గాను గాని-
లక్ష్మీనృసింహుని లాలించి మెప్పింపఁ
గవి శంభుదాసుండఁ గాను గాని-
శ్రీకృష్ణలీలలఁ జెప్పి మెప్పింపఁగాఁ
గవి పోతరాజును గాను గాని-
హరిహరునకుఁ గబ్బ మర్పించి మెప్పింపఁ
గవి సోమయాజిని గాను గాని-
చేరి వారల కవితాభిషేకవారిఁ
దాన మాడిన దైవ మూర్ధన్య మణులు
నీవె కావున నీ కృపాన్వితుఁడ నగుచు
భావసంకీర్తనముల విన్ బాడుదు ప్రభు! -

## 127

నీ దారి కడ్డాదునే నాథ! నాకు నీ
జడదారి వేషమే ముడిచినావు-
నీ యిల్లు గైకొందునే నాథ! నాకు నీ
ప్రకృతి పంజరమె యేర్పఱచినావు-
నీ పల్కుబడి మార్తునే నాథ! నాకు నీ
భాషా శుకత్వమే పంచినావు-
నీ మూర్తి గైకొందునే నాథ! నాకు నీ
కావ్య మూర్తిత్వమే కట్టినావు-
రాగినై యుండి వెఱ్ఱి బైరాగిఁ గాక,
పంజరమునఁ బట్టుకొని కవిబ్రహ్మఁ గాక,
భావసంకీర్తనానంద పదవిఁ దవిలి
యిచ్చి దానందు నినుఁ గొల్వ జాలనె? - ప్రభు! -

## 128

ఒంటి నే నని నొచ్చుకొంటిని గాఁబోలు!
జంట నే నని యచ్చు కొంటి వీవె-
పద మంద దని వెఱ్ఱిపడితిని గాఁబోలు!
పదము లందించి కాపాడి తీవె-
అర్థ మున్నదె యని యనుకొంటిఁ గాఁబోలు!
శ్రుతు లంటి చూపి నవ్వితివి నీవె-
భావ్యమా యని తొట్రుపడితిని గాఁబోలు!
నుపనిష ద్భావాల నూర్చి తీవె-
మనము వ్రాసిన దనుకొనఁ జనితి నేమొ?
మనము పాడిన దనుమాట మలపి- యిదియె
భక్తతతి పాట- జ్ఞానుల బాట- భావ
సూనముల పేటు యని- యెదఁ జూపవె? - ప్రభు!

## 129

కృతి విప్పుచున్నది, మతి చెప్పుచున్నది
ఆకృతి గన్నదే యరద మనుచు-
స్మృతి విప్పుచున్నది, మతి చెప్పుచున్నది
ఆశ యై యున్నదే పాశ మనుచు-
గతి విప్పుచున్నది, మతి చెప్పుచున్నది
సంసార మన్నదే చక్ర మనుచు-
శ్రుతి విప్పుచున్నది, మతి చెప్పుచున్నది
యిరు సందు నున్నదే యిరుసనుచు-
ఇంద్రి యాశ్వంబులను బట్టి యిహపథమున
బుద్ధిసారధి నడుపుఁ బ్రబుద్ధరథము,
రథికుఁడవు నీవె, నే ననరాదు నాకు, -
మాయ మన సందు లేకుండఁ జేయుము ప్రభు!

## 130

నావాఁడ వని కూర్మి నవ్వులో నినుఁ బిల్తు
విని నవ్వు మదె పదివేలు నాకు-
నా నేత వని కైతలో నిన్నుఁ బ్రార్థింతు
విని పల్కు మదె వేనవేలు నాకు-
నా పెండ్లికొడు కని నా పాట వినిపింతు
లాలించి విను మదే లక్ష నాకు-
నా ప్రాణపద మని యేప్రొద్దు మ్రొక్కుదు
పాటించి కొను మదే కోటి నాకు-
ఎఱిఁగి నా ప్రేమ గొన్న యంతరువు లోనె
యీ వొసఁగు కూర్మి యుంకు వెంతేని నాకు-
కోటికోటి ఫలంబుల గుఱుతు గాదె!
ఇహపరంబుల పతివి నన్నేలుము ప్రభు!

## 131

కలుముల ని మ్మంచుఁ గాక్షించు చుంటినా
లేముల భరియింప లే నటంటి-
సుగముల ని మ్మంచుఁ దగవాడు చుంటినా
కష్టాలు భరియింపఁ గా దటంటి-
అధికార మి మ్మంచు నాసించు చుంటినా
నీచవృత్తి భరింప నేర నంటి-
భద్రంబు లి మ్మంచు బతిమాలు చుంటినా
ఛిద్రంబులు భరింపఁ జేయ కంటి-
కనులు గనరాని, వీనులు వినఁగరాని
తెలివి గొనరాని, నెమ్మేను దెలియరాని
భోగవృద్ధుల ని మ్మనఁ బూనినానె?
శాంతిజీవన మొసఁగుము చాలును ప్రభు!

## 132

కరములోఁ గర ముంచి తిరిగిపోయెద వేల
శ్రుతి మించి రాగంబు సుడిసి కొనఁగ-
పదములోఁ బద మద్ది పాటిపోయెద వేల
యెద నున్న మించుపే రదరిపడఁగ -
చూపులోఁ జూ పుంచి సురిగి పోయెద వేల
కనుల వెన్నెలతీవ కారు క్రమ్మ-
మనసులో మన సుంచి మఱగి పోయెద వేల
తలఁపులో నీ నీడ పులకరింప-
సృష్టిచిత్రంబులకు నీవె స్రష్ట వగుట
అనఘ! నీ చేష్ట లెవరు కా దనఁ గలారు?
మాయ ని న్నాశ్రయించిన మాత్ర నన్ను
మాయ సేయుట యే మంత మంచిదె?—ప్రభు!

## 133

పూర్ణేందు గని కల్వ పూఁబోణి నవ్వితే
పొడుపుఁ జుక్కలు తెల్లఁబోవ నేల? -
వేగుఁ జుక్కకు నుష వినయంబుఁ జూపితే
ప్రాఙ్నగావళి యెఱ్ఱవాఱ నేల? -
ఘన కంకణము లందికొని నది పొంగితే
జడధు లు భంగార్తిఁ బడఁగ నేల?
భావరాగముఁ గొని భక్తుండు పాడితే
కవు లర్థహీనతఁ గలఁగ నేల? -
దేవునకు జీవుఁ డారతితిల్లి కెత్త
ప్రకృతి సన్న్యాసినులు తొట్రుపడఁగ నేల?
చెలిమిఁ గని ప్రేమ తన కెంత చెప్పుచున్న
జడజగతి నైజ గుణ మేల విడుచును? - ప్రభు!

## 134

''ఇందున్న ముపురిలో నెవరికి మ్రొక్కితి
లలన?'' - ''మీ రెవరు?'' - ''మూర్తులము మేము'' -
''ఏ పాటి గుణవంతు, లేమి నామము వార?'' -
''లెఱుఁగవా మమ్ము?'' - ''నన్నెఱుఁగ రొక్కొ?'' -
''చతురమతివె!'' - ''గుణత్రితయ మూర్తులె మీరు?'' -
''బ్రహ్మ విష్ణుమహేశ్వర ప్రభులము'' -
''గుణములు నా యింటి కొమిరెలు- ప్రభువులా?'' -
'' లోకాధిపతులము'' - ''నాకుఁ గారె?'' -
''ఏమి పే రింతి?'' - ''మహదాఖ్య నెసఁగు దాన'' -
'' నెవరి కిందాఁక మ్రొక్కితి?'' - '' వెఱుఁగ రేల?
నామ గుణ రూప వర్జితునకు'' - అటంచు
మాయ వారలఁ దూల్చె, నీ జాయయె? - ప్రభు!

## 135

హితులకు శ్రుతులు నీ విచ్చుటే నిజమైన
నిపుడు నా మొఱ్ఱల నేల వినవు? -
శ్రితుల కాశ్రయ మిచ్చి చెలఁగుటే నిజమైన
నిపు డాశ్రయంబు నా కేల యీవు? -
సుతుల కున్నతు లిచ్చి చూచుటే నిజమైన
నిపుడు పదంబు నా కేల యీవు? -
సతులకు గతు లిచ్చి సాకుటే నిజమైన
నిపుడు సద్గతులు నా కేల యీవు? -
హితులు, శ్రితులు, సుతులు, సతులు గలాఁడవు!
మతివి, ధృతివి, కృతివి, గతివి నాకు-
విశ్వ పోషకుఁడవు, విశ్వకుటుంబివి,
విశ్వ పతివి, నన్ను విడుతువె? - ప్రభు!

## 136

నామామృత రసంబు నా కీయ నందువా,
పా దోదకములనే బ్రదుక నిమ్ము-
పా దోదకము లైనఁ బడనీయ నందువా,
తల పైన నుంచి నిన్ దలఁప నిమ్ము-
తల పైన నిలుపఁగా దగదు కా దందువా,
యూర్పులో బిగఁబట్టి యుండ నిమ్ము-
ఊర్పులఁ గూర్పఁగా నొప్పని దందువా,
జీవనంబులు బైటఁ జేర నిమ్ము-
జీవనంబులు దీసి నీ చేతఁ బోసి
'అమృత మ' స్తని యనిపింతు నప్పు డైన
ఇచ్చినది పుచ్చుకొన్నది యెఱుఁగఁ గలవు-
భువనపతి వెట్లు నమఁ బ్రోవఁ బూనవు? - ప్రభు!

## 137

ఎలఁబల్కు టలరుఁదీవల నూఁగఁ గద వోయి!
వలపుఁ బూవుల పాట వచ్చు దాఁక-
తలఁపు టద్దాల నీడల జాడ నిలు మోయి!
జీవ చిత్రములు రంజించు దాఁక-
ఎడఁద పిల్లనగ్రోవి యూలవెట్టఁ గదోయి!
భక్తి గోపికలతోఁ బాడు దాఁక-
బత్తి కోవెలఁ దెల్వి పవళింపుఁ గనవోయి!
ముత్తికన్నె నివాళి యెత్తు దాఁక-
పలుకుఁ బలుకున వల పుట్టిపడిన దాఁక,
తలఁపు తలఁపున జీవముల్ కులుకు దాఁక,
బత్తిలో నీవె "ఓ" యని పలుకు దాఁక,
ముత్తికన్నె నివాళి నా కెత్తునె? - ప్రభు!

## 138

పదముఁ బట్టుదు నంతె, పాటిపోవుదు నింతె
జీవరణంబు నా చేత గాక! -
అడుగుఁ బట్టుదు నంతె, అలసి పోవుదు నింతె
జడ జగత్తున ఘోష సైప లేక-
గాలిఁ దూలుదు నంతె, వ్రాలి పోవుదు నింతె
గగన మార్గంబున కెగుర లేక-
మాయఁ జిక్కుదు నంతె, మమతఁ జొక్కుదు నింతె
సంసార గుహ వీడి చనఁగ లేక-
కనులు విప్పిన మూసినఁ గడల,నెడల
పగ లుడుగ లేక, తమి నెడఁబాయ లేక,
అన్య శరణంబు లేక నీ యడుగు లంటి
శర ణనుచు నుంటి, నన్నుఁ బ్రోవ జాలవె? - ప్రభు!

## 139

ఎన్నాళ్ళ కైన రా కున్నాఁడ వని చెప్పి
మనసునెచ్చెలిఁ జెంత కనిచి కొంటి-
మరియాద దక్కెనే! మన్నన మ్రొక్కెనే?
సన్నలఁ దెలిసి ప్రసన్ను నిన్ను
సన్నిధి జేసెనే, సవినయ మూర్తి యై
చన వెంచి మనవుల వినిచి కొనెనె?
పెఱవారిఁ దనవారి నెఱిఁగి నా చింతల
నందించి నీ దయ నంది కొనెనె?
'ఆర్తజన రక్షకుఁడవు, భక్తావనుఁడవు'
అని యెఱుంగుదు నైన నే నడుగుచుంటి:
మనసుఁ దేరిచి, నముఁ గూర్చి కనికరించి,
నా మనసు వెంటఁ బైన మై నాఁడవె? - ప్రభు!

## 140

జగ దేక రక్షక! సర్వ జీవ శరణ్యా!
విశ్వాత్మ! నిన్ను భావించి కాంచి-
ఏ దేని సుకృతి నీ మీఁదఁ జేయఁగఁ బూని
కల మంది పదములఁ దలఁచి నంత-
తెరమీఁది బొమ్మల తెఱఁగున దలఁపుల
పూదండ లెదఁ దోఁచి వాద మాడు-
తలపట్టినవి యెల్ల చలపట్టి కూర్చున్న
పేర్చి గళానఁ జేర్పింపఁ గలనె? -
వలపుదండల నెదఁ బూవఁ దలఁతు వేని,
కూర్చి యేరిచి నీ వెంచుకొందు వేని,
నా పరిశ్రమ తగ్గించినాఁడ వౌదు,
ఫల మధిక మైన భరియింపఁ గలుఁగుదు ప్రభు!

## 141

తలములో లేని వార్తలఁ బంపుచుందువు,
దానికే దేని యంత్రంబు గలదె? -
పొలములో లేని పంటలఁ బెట్టుచుందువు,
దానికే దేని తంత్రంబు గలదె ? -
కలములో లేని వ్రాఁతలఁ జూపుచుందువు,
దానికే దేని చిత్రంబు గలదె? -
చలములో లేని కర్జము దీర్చుచుందువు,
దానికే దేని సూత్రంబు గలదె? -
విధివి, సర్వజ్ఞమూర్తివి, విశ్వకవివి-
ఈ వెఱుంగని విద్య లేవీ జగాన?
నన్ను శిష్యుని జేసికొన్నావు గాన
కీలకము చెప్పు మింక సుఖింతును ప్రభు!

## 142

నైజసంతతులతో నను మన్పు మను టెంత
అభయ భూషణము నీ దైన యపుడు!
నై జార్థితతులతో ననుఁ దన్పు మను టెంత
దానకంకణము నీ దైన యపుడు!
నై జార్తిగణముతో ననుఁ దేల్పు మను టెంత
దీనరక్షణము నీ దైన యపుడు!
నైజబాంధవులతో నను నిల్పు మను టెంత
అఖిలపోషణము నీ దైన యపుడు!
అధిప! నే నెందు నీ వాఁడ నైన యపుడు,
వరద! నా వార లెల్ల నీ వారు కారె!
తండ్రి! నా కింక వేఱె ప్రార్థనము లేల?
అల్పమతి నంటి- క్షమియింపు మంటిని ప్రభు!

## 143

నా చూపులో నుండి నీ చూపుఁ గను దాఁక
దృష్టి మాంద్యంబు నందింపకు ప్రభు! -
నా చెవిలో నుండి నీ చెవి విను దాఁక
శ్రుతి బాహ్యతను గట్టఁ జూడకు ప్రభు! -
నా యెదలో నుండి నీ యెదఁ బడు దాఁక
హృదయ హైన్యంబు రానీయకు ప్రభు! -
నా యాత్మలో నుండి నీ యాత్మ నగు దాఁక
చైతన్య దైన్యంబుఁ జేర్పకు ప్రభు! -
ఇహపరంబుల దృష్టి పో నిచ్చు దాఁక
ప్రణవనా దానుభవములోఁ బడిన దాఁక
అదియు నిదియును దహరమే యైన దాఁక
నీవు నే నుండు దాఁక నన్నేలుము ప్రభు! -

## 144

కను విచ్చి కాంచితేఁ గన కాభిషేకాలె !
పూరు షోత్తముఁడ వై పొదలు మోయి! -
శ్రుతు లిచ్చి వినిచితే శ్లో కాభిషేకాలె!
విద్యాధినేత వై వెలయు మోయి! -
తను విచ్చి మనిచితే జన తాభిషేకాలె!
జనకాది మూర్తి వై కనఁగ దోయి! -
పలు విచ్చి పిలిచితేఁ బట్టాభిషేకాలె!
ధర్మ శాసకుఁడ వై తనరు మోయి! -
కోరి గుణమణి పౌళు లంఘ్రుల భజింప,
తనిసి మహదాఖ్య కాంత చెంతల హసింప ,
బలసి సచరాచర జగంబు ప్రస్తుతింప ,
కొలువుఁ గను మోయి! అఖిలు క్రొత్తలె? - ప్రభు!

## 145

ఓ పరంధామ! నీ శ్రీపదంబులు గన్న
నా భావరూప గంగాభవాని,
అపవిత్ర భూముల, నల్ప ఖండంబుల,
క్షార శిలా క్షేత్ర కర్దమముల,
కల్మష స్థలముల గతి దప్పి ప్రవహించి
చివరకు నీ కృపాశేషవృష్టి,
శీత లాదృష్ట సంజీవన ధారల
సుక్షేత్ర ఖండాలఁ జొచ్చి చొచ్చి
సూక్తి సస్య లక్ష్మీకర స్ఫూర్తిఁ గాంచి
భువన ఫల దత్త సుగతులు పొందఁ గలిగె,
శ్రీప దాభిషేక స్తుతిఁ జేయుఁ గలిగె,
పుణ్యపద కృతు లూరక పోవునె! - ప్రభు! -

## 146

మనవి వాదంబున వినువారలును లేరు,
చూచి వచించు సాక్షులును లేరు-
పిలు పంపు వారును బిలుచు వారును లేరు,
తెలిసిన న్యాయవాదులును లేరు-
రచ్చపట్టులు లేవు, వచ్చు వారును లేరు,
ప్రతివాది లేఁడు, తీర్పరియు లేఁడు-
వాది నుంటిని, ప్రతివాది లేఁ డని నేనె
తీర్పు చెప్పితిని సందియము మాని-
నా మనోబుద్ధిచిత్త సంతాన మెల్ల
నన్ను విడనాడి శరణు నీ కన్న దేమొ!
మనవి వాదాన నీ వున్న మాట నిలిపి
ఏదొ పైతీర్పు విమ్ము- నేఁ గా దన ప్రభు! -

## 147

''పళ్లెరంబునఁ బండ్లు పట్టించుకొని వత్తు,
వె వ్వారి కీయఁగా నెంచి తమ్మ?''-
'' దేవున కివి నివేదింపగా నెంచితి,
నీ కోస మనుకొంటివే? కుమార!''
'' పైఁడి గిన్నెలఁ బాలు పట్టించుకొని వత్తు ,
దేవున కసి కొనితెత్తె? తల్లి!'',
'' దేవున కనుకొంటె? కావు , కావు మటంచు
నేడ్చెడి నా బిడ్డ కీయ దెత్తు-''
'' ఏడ్చు బిడ్డ వెంట నెచట నున్నాఁ డమ్మ?''
'' ఆఁక లెటేఁగి యేడ్చి యతఁడె వచ్చు-''
'' ఎచట డించి తమ్మ?''-'' ఇచటనే '' యని నన్నుఁ
దేర్చు తల్లి నీకు దేవియె? - ప్రభు! -

## 148

జాబిల్లి నింగినే చరియించు టెందుకో!
దినకరశ్రీ లందికొనఁగఁ గాదె-
వెఱ్ఱి చకోరంబు విను వీడ దెందుకో!
క్రొత్త వెన్నెల జుఱ్ఱుకొనఁగఁ గాదె-
ఘనుఁ డాకసము నంటి గర్జించు టెందుకో!
ఆవిరి కావిరి నందఁ గాదె-
చాతకం బే వేళఁ జద లంటు టెందుకో!
వాన చిన్కులు నోట నానఁ గాదె-
గుఱుతుగాని గుఱుతుఁ గొని బైటఁ గన్పించు
జీవు లిట్లు భుక్తిఁ జెందు నపుడు
గగన మట్లు శూన్యగతిఁ దోఁచు నినుఁ జూచు
భక్తకోటి ముక్తిఁ బడయదె? - ప్రభు!

## 149

చూచి బిడ్డల పెంపుఁ జూచు చేఁపను బోలి
దయఁ జూచి పోషింతు తత్త్వవిదుల -
తలఁచి బిడ్డలఁ బెంచు తాబేటి వడువున
ధ్యానించి ప్రోతువు జ్ఞానివరుల-
పొదిగి బిడ్డలఁ బెంచు పులుఁగు చందంబున
పొర విచ్చి యేలుదు పరమమునుల-
పాలిచ్చి బిడ్డల నేలు తల్లి విధాన
పాలింతు మాతవై భక్తమణుల-
మాతవే కాదు జీవనదాత వగుదు,
దాతవే కాదు భద్రసంధాత వగుదు,
ధాతవే కాదు సౌఖ్యనిర్నేత వగుదు,
నేత వఖిలంబునకు, విశ్వదాతవు ప్రభు! -

## 150

చిత్తమా! రాగాది చింతల మ్రగ్గక ,
తాత్కాలిక సుఖాల దగ్గ రిలక-
భౌతిక చిత్రాల భ్రాంతిలోఁ బడిపోక,
ఛిద్ర మార్గంబులఁ జేరఁ బోక-
శాంతిశమదమాది సన్మార్గ సుఖదంబు,
సాధుసజ్జన బుధారాధకంబు-
చిరత రానంద సంసిద్ధి ప్రసిద్ధంబు,
బహుజన్మ కృత పాప భంజనంబు-
పరమపదసౌఖ్యదం బైన ప్రభు పదంబు
పట్టి జీవింపు మని దాని గట్టి పఱచి,
మంచి బుద్ధులు చెప్పి యొప్పించు కొంటి,
సేఁ లిడు, మది యింక- నీ చిత్తము ప్రభు! -

## 151

మోహించి నిన్నెంచి ముట్టుదు నందునా
మోహంబునకుఁ దుది మొదలెఱుంగ-
భావించి నిన్నెంచి పట్టుదు నందునా
భావంబునకు మూలబంధ మెఱుఁగ-
శోధించి నిన్నెంచి చూతు నటందునా
శోధనంబున కాదిసూత్ర మెఱుఁగ-
భేదించి నిన్నెంచి మోదింతు నందునా
భేదానురూప సంవాద మెఱుఁగ-
మోహ మొల్లను, భావించి మురియ నొల్ల,
శోధనం బొల్ల, భేదించి చూడ నొల్ల,
శ్రుతుల వినుచుంటి నా జీవపతి వటంచు-
నిది నిజం బైన వచ్చి న న్నేలుము ప్రభు! -

## 152

మాయ మాటలఁ గట్టి మరఁగఁ బెట్టితి చాలు
నిఁక నైనఁ దుదిమాట యిచ్చి తనుము-
కనికారములఁ బెట్టి కాళ్లఁ గట్టితి చాలు
నిఁక నైనఁ జెలికార మిచ్చి తనుము-
కనుగుట్టి లోపాపఁ గలఁత వెట్టితి చాలు
నిఁక నైనఁ దెలివి క న్నిచ్చి తనుము-
వేసాలఁ గట్టించి వెట్టిఁ బెట్టితి చాలు
నిఁక నైనఁ దెర దింప నిచ్చి తనుము-
చీక టింటి చెఱలఁ జింతఁ బెట్టితి చాలు
నింక నైన మోక్ష మిచ్చి తనుము-
దాసజనుని తప్పు దండాలఁ దలఁగదా?
తలఁగ దనిన- నీకె త ప్పగు ప్రభు! -

## 153

బ్రహ్మాండములఁ గన్న పరమాణువుల తల్లి
నీ పాద రేణువు ప్రాపు నాకు-
నిఖిల విద్యలఁ గన్న నిగమవాణుల తల్లి
నీ పాద రేణువు ప్రాపు నాకు-
భక్తకోటులఁ గన్న ప్రణయవేణువు తల్లి
నీ పాద రేణువు ప్రాపు నాకు-
నిర్వాణపురిఁ గన్న నిశ్రేణులకుఁ దల్లి
నీ పాద రేణువు ప్రాపు నాకు-
జలనిధులఁ గన్న యమృత వేణులకుఁ దల్లి
భ్రమణగతి గన్న ప్రణవనాదముల తల్లి
నిరత మానంద పదమునఁ దిరుగు తల్లి
నీ పదాబ్జ రేణువు నాకుఁ బ్రాపగు ప్రభు! -

## 154

కర్మ మొల్లక మీఁదు గట్టితి కరములు
మన సేమొ తన పని మాన దాయె-
జన్మ మొల్లక మే నసహ్యించు కొంటిని
బుద్ధికిఁ జెడుబుద్ధి పోవ దాయె-
జీవ మొల్లక పదస్థితి గట్టి పెట్టితి
చిత్తంబు పరు వాపి చేర దాయె-
ఇహము నొల్లక యన్య సహకార ముడిగితి
నహ మహంకృతి వీడనాడ దాయె-
ఏమి సేయుదు సంసార మిట్టు లాయె,
ఏను సవరించుకొన వీలు లేని దాయె,
అగతికుఁడ నైతి, శరణార్థి నైతి నీకు-
అడుగులను నిల్పి నన్నుఁ గాపాడుము ప్రభు! -

## 155

అత్తమామల పోరు లా యింట నీ యింట
లే వని చెప్పి పల్కింతు- నిజమె! -
ఆడుబిడ్డల యడ్డు లందు నిందును గూడ
లే వని చెప్పి పోలింతు- నిజమె! -
పెద్దవారల పోరు- పేరు నూరును గూడ
లే దని చెప్పి పాలింతు - నిజమె! -
లోకాల బాములు నాకు నీకును గూడ
లే వని చెప్పి యేలింతు- నిజమె! -
నీ సనాతనత్వంబును నిలిపి కొనఁగ
నా సనాతనత్వము నిల్పి నావు- నిజమె-
మనము పట్టిన కుస్తీల మాట విన్న
చదువుకొన్న వారలు నవ్వ సాగరె? - ప్రభు! -

## 156

అంతికంబునకు రా ననుమతించినఁ జాలు
వెలయించు కొందు నా విద్య లనుచు-
అభ్యంతరం బీయ నాన తిచ్చిన ఁజాలు
సవరించు కొందు నా కవన మనుచు-
మంతనంబున కొక్క మాట యిచ్చినఁ జాలు
సరిపోల్చు కొందు నా చదువు లనుచు-
ఏకాంత సేవ లంగీకరించినఁ జాలు
పాడించు కొందు నా పదము లనుచు-
మమత బడి వ్రాసికొన్న నా మాట లేల?
తెలివి బడి దిద్దికొన్నవే తెలిపికొందు!
మొగ మెఱుంగని ముచ్చటల్ జగతి గలవె?
అగపడుము చాలు, వి న్నేమి యడుగుదు? - ప్రభు!

## 157

నాఁడు నా మునుగడ నడుపంగ నిచ్చిన
జీవ సంచిత భృతి చెల్లిపోయె-
నాఁడు లోకము పాటి నన్నుఁ జేసి పెట్టిన
ప్రారబ్ధ భరణంబు తీరిపోయె-
నాఁడు నా కరమున నమ్మించి కట్టిన
కర్మ కంకణము తాకట్టు పడియె-
నాఁడు నా గళమున నయి మెంచి పెట్టిన
జన్మ సూత్రంబు వెచ్చాలఁ బడియె-
నా బ్రదుకు బైటఁ బెట్టి, యీ నాఁటికైనఁ
గనులఁ బడకుంటి విది యేమి కర్మ మయ్య!
ఏఁ బతివ్రత నై యుంటి నేని, వచ్చి
పరము నం దైనఁ బాదాలఁ బట్టుదు ప్రభు!

## 158

కన్ను విచ్చిన దాది కావు మం చేడ్చెదఁ
జ న్నిచ్చు మా యమ్మ చంక నుండి-
చరణ మూనిన దాది సాకు మం చేడ్చెదఁ
బద మాపు మా యయ్య పజ్జ నుండి-
బడికిఁ బోయిన దాది బ్రదికింపు మని యేడ్తు
చదివించు మా యొజ్జ చక్కి నుండి-
వయసు వచ్చిన దాది వడఁ దేర్పు మని యేడ్తు
సేవించు నెచ్చెలి చెంత నుండి-
పడమటికిఁ బ్రొద్దు వ్రాలి నప్పటికిఁ గూడ,
మరఁగి మరఁగి యేడ్చెదను నీ మాటఁ దలఁచి
ఉన్న నా వారు వీరు-లే కున్నఁ గారు,
ఉన్న లే కున్న దిక్కు నీ వొకఁడవె ప్రభు!

## 159

ఒంటిగా ననుఁ బంపి యుంటివి నీ లోకాన
కొంటిగానే వత్తు నోయి మరల-
వసుధయే క్రుంగఁగా, వారిధుల్ పొంగఁగా
నొంటిగానే వత్తు నోయి మరల-
వహ్నులే మండఁగా, వాయువుల్ చెండఁగా
నొంటిగానే వత్తు నోయి మరల-
గగనంబు వ్రీలఁగా, గ్రహతతుల్ వ్రాలఁగా
నొంటిగానే వత్తు నోయి మరల-
జీవ బీభత్స ఘోషలోఁ జిక్కు పడక
భ్రమణ భూ తోగ్ర ఘోషలో భయము పడక
ఒంటిగా- ఒంటిగా వచ్చుచుంటి మరల-
ఒంటిగా- ఒంటిగాఁ జూచుచుండుము ప్రభు!

## 160

నా మేలుకొలుపులే నీ మేలుకొలుపు లై
యిష్టపదములు నా కిచ్చుఁ గాక! -
నా పల్కుబడులె నీ నామ మంత్రంబు లై
పరమార్థముల నాకుఁ బంచుఁ గాక! -
నా ప్రవర్తనములే నీ ప్రదక్షిణము లై
దివ్యభావము నాకుఁ దెచ్చుఁ గాక! -
నేఁ జేయు కృత్యాలె నీ నిత్య పూజ లై
చిరకృతుల్ నా కందఁ జేయుఁ గాక! -
నాదు భోజనంబె నీదు నైవేద్య మై
సుప్రసాద మహిమఁ జూపుఁ గాక!
నాదు నిద్ర నీ కనంత చిన్మాత్ర యై
మాయ నాకుఁ దొలఁగఁ జేయుత ప్రభు!

## 161

భూత సంఘ కులానఁ బుట్టియుంటి నటంచు
నెఱ నమ్మి నను నేనె మఱచి యుంటి,
అజ్ఞాన వార్ధిలో నంబుచరంబునై
యీఁదు చుండిన మాటె యెఱుఁగ కుంటి-
మాయ మంతనములో మరఁగి యుంటి నటంచుఁ
దెలియక భువనాలఁ దిరుఁగుచుంటి-
జీవ విభ్రాంతిలోఁ జిక్కియుంటి నటంచు
నెఱుఁగక చింతలో మరుఁగుచుంటి
భూతనేతవు, సుజ్ఞానబోధకుఁడవు,
విద్యకు నవిద్యకును గూడ విభుఁడ వనుచు,
జీవదాత వటంచు దేశికులు దెల్ప
నెఱిఁగి శర ణంటిఁ గరుణ నన్నేలుము ప్రభు!

## 162

తండ్రివై పోషించి తలఁగి పోయెద వేల?
అంతనే ప్రాజ్ఞుండ నైతి నయ్య! -
తోడువై దయఁ జూచి వీడిపోయెద వేల?
అంతనే ధీరుండ నైతి నయ్య! -
నీడవై వెన్నాడి నిలిచి పోయెద వేల?
అంతనే సిద్ధుండ నైతి నయ్య! -
గురుఁడ వై బోధించి మరిఁగి పోయెద వేల?
అంతనే ముక్తుండ నైతి నయ్య! -
ఇహము దిద్దికొనంగ నే నెంత వాఁడ!
వింత సంసార మీఁద నే నెంత వాఁడ!
ఈ మనసుఁ బట్టి నిల్ప నే నెంత వాఁడ!
శ్రీచరణ సేవ నిల్పి రక్షింపుము ప్రభు!

## 163

మరుజన్మమున నైన మంజీరమై పుట్టి
శ్రీపాద కమల మర్చింప నిమ్మ-
మరుజన్మమున నైన వర రేణు వై పుట్టి
శ్రీపాద కమల మర్చింప నిమ్మ-
మరుజన్మమున నైన మకరంద మై పుట్టి
శ్రీపాద కమల మర్చింప నిమ్మ-
మరుజన్మమున నైన సురగంగ నై పుట్టి
శ్రీపాద కమల మర్చింప నిమ్మ-
సుజనులకు రక్తి నిగమ సంసూక్తి నగుచు
భక్తులకు భుక్తి నిత్య సన్ముక్తి నగుచు
శ్రీపదాబ్జ సంసేవలఁ జేసికొంచుఁ
జిరత రానంద పదసిద్ధిఁ జెందుదు ప్రభు!
('అర్చింప కొందు' నని నాలుగు పాదాలనూ చదువ వచ్చు-)

## 164

మానస సాకాశ నిర్మల సౌరభ వ్యాప్తి
నా విమానంబును నడుపు నాధ! -
బుద్ధి సాగర భంగ ము క్తాతప ప్రాప్తి
నా రత్ననౌకను నడుపు నాధ! -
చిత్త సంశుద్ధ ప్రసిద్ధ రాజపధాన
నా భూరి రథమును నడుపు నాధ! -
ఇహపర నిశ్రేణి నహమోంకృతులు సేయ
నా జన్మ డోలిక నడుపు నాధ! -
ప్రాణపతి వీవు, నావికాభర్త వీవు,
సారథివి నీవు, లోక విజ్ఞాని వీవు,
చేయి విడకుము నన్ను, నా జీవ యాత్ర
త్వరగ ముగియించుకొందు నీ కరుణనె ప్రభు! -

## 165

హృదయేశ! నీ యాన నేందు నెప్పటి కైనఁ
గందునా కన్నుల కఱవు దీర? -
విశ్వేశ! నీ వచోవేణు వెప్పటి కైన
విందునా వీనుల విందుసేయ? -
సకలేశ! నీ పదార్చనల నెప్పటి కైన
నుందునా నా మది కుందు వాయ?
ప్రాణేశ! నీ కృపారసము నెప్పటి కైనఁ
గొందునా భవతాప గుణము దీర? -
రోగభంజనుఁడవు, రాగానుమూర్తివి,
భక్తపాలకుఁడవు, ముక్తిపతివి
పరమకరుణ నన్నుఁ బాలింతు వేని, నా
కామనములఁ దలఁపుఁ గాంచను ప్రభు!

## 166

చలిమల దేపాటి సంప్రదాయమొ కాని
యైశ్వర్యపతి దాని కల్లుఁ డయ్యె-
క్షారాబ్ధి దేపాటి సరస గుణమొ కాని
ఆనందపతి దాని కల్లుఁ డయ్యె-
ఆ పులోముని వంశ మేపాటిదో కాని
అమరాధిపతి దాని కల్లుఁ డయ్యె-
పంచమకుల మెంత మంచిగోత్రమొ కాని
అల వసిష్ఠుడు దాని కల్లుఁ డయ్యె-
కన్య గుణవతియగుటయే గణన గాని
కన్యఁ గొనఁ బుట్టినిల్లు లెక్కలకు రాదు-
లోకమర్యాద- -నా కవితాకుమారి
యిద్ధగుణమణిఁ గ్రహియించి యేలుము ప్రభు! -

## 167

గుణమణి మౌళికి మణి కిరీటం బిచ్చు
వాఁడనే, నేనెంతవాఁడ ననుచు-
శ్రుతిమంతునకు మరకత కుండలా లిచ్చు
వాఁడనే, నేనెంతవాఁడ ననుచు-
భువన కీర్తికి వజ్రభుజ కీర్తు లర్పించు
వాఁడనే, నేనెంతవాఁడ ననుచు-
ఆత్మాధిపతి కిందుహారంబు లర్పించు
వాఁడనే, నేనెంతవాఁడ ననుచు-
తలఁచి భక్త్యుదకములఁ బాదములు గడిగి,
ఆత్మసంకీర్తనపు బటు వమరఁ జేసి,
నవ్య కావ్యకన్యా ప్రదానం బొనర్తు
ప్రేమ కల్యాణ మంగీకరింపుము ప్రభు!

## 168

ఒరు లాలకింపఁగా నూర్చుచు నుంటినా
నిట్టూర్పు పిలుపులు నీకుఁ గాక! -
నరులు మెచ్చెద రని నడయాడు చుంటినా
నా కూర్మి వినతులు నీకుఁ గాక! -
ప్రకృతులు చెవి యొగ్గఁ బలుకాడు చుంటినా
నా కృతిసన్నుతుల్ నీకుఁ గాక! -
యెవ రైన నెదు రైన నీక్షించు చుంటినా
నా కంటి మ్రొక్కులు నీకుఁ గాక! -
రేఁబవ లెఱుంగ, నడయాడు రీతు లెఱుఁగ,
తిన్న, దున్నది, లో నెంచుకొన్న దెఱుఁగ,
నన్ను మఱచితి - నాత్మార్పణమునఁ - గాని
మనసు కవయిత్రి నీ మాట మఱవదు ప్రభు!

## 169

గతులు దీర్పఁగ నెంచి గజ్జె గట్టితిఁ గదా
అడుగు తప్పని తాళ మైనఁ బెట్టు-
బరువు దింపఁగ నెంచి బండి గట్టితిఁ గదా
అధ్వాన లక్ష్యంబు నైనఁ బెట్టు-
పైరు పెట్టఁగ నెంచి నారు వోసితిఁ గదా
అమృతధా రాధార మైనఁ బెట్టు -
మాట నేర్పఁగ నెంచి గూటఁ బెట్టితిఁ గదా
అక్షరాభ్యాసంబు నైనఁ బెట్టు-
సద్గతుల నీయ, జన్మవాసనలు ద్రోయ
ని న్నెఱుఁగఁ జేయ, నీ యింట నిలుపు సేయ
మానసభ్రాంతిఁ దీసి నీ వానిఁ జేసి
జీవు ననుఁ బ్రోవ నీ పాటి సేయుము ప్రభు!

## 170

పాదాలఁ దన్నిన పాతకునకు నైనఁ
బాదపంబు ఫలాలఁ బంచి యిచ్చు-
కఱుకోల దున్నిన మొఱకు జీవికి నైన
నిల రాజభోగాల నెంచి యిచ్చు-
కాళ్ల బందా లేయు కఠి నాత్మకున కైన
గోవు గుమ్మల పాలు కోరి యిచ్చు-
కొంప నగ్ని దహించు క్రూర కర్మున కైన
దేనీఁగ మధువును దేర్చి యిచ్చు-
స్వార్థపరు లెట్టి యపకృతుల్ సలుపుచున్నఁ
దలఁప నుపకారు లౌదు రుదారమతులు-
స్వార్థ రహితుండ వై యుదా రాత్మ నిన్ను
నెలమి సేవించు నన్ను నీ వేలవె? - ప్రభు!

## 171

నా సందు నీ సందు నడయాడఁ గల నీడ
నచ్చిన సైదోఁడు నాకుఁ గాదె! -
నా మింట నీ మింట నడుచు చందురు మామ
నవ్వు వెన్నెలపువ్వు నాకుఁ గాదె! -
నా తోఁట నీ తోఁట ననుచు తెమ్మెర తీవ
ప్రాకించు నూరుపు నాకుఁ గాదె! -
నా మేడ నీ మేడ నడిమింటి నిచ్చెన
న న్నెత్తికొను డోల నాకుఁ గాదె! -
దీని తాత్పర్య మెవ రైనఁ దెలిసికొన్న
మనసు కామరూపిణి యని యనక పోరు,
మనకు మనసేక మన - నిన్ని మాట లేల?
మనసు జీవేశ్వ రైక్య సన్మార్గము ప్రభు!

## 172

ఇది ప్రశ్న మనుకొందు వేమొ కా దనఁ జూమీ
నీ స దుత్తరమును నిలిపి కొనుము-
ఇది వాద మనుకొందు వేమొ కా దనఁ జూమీ
నీ ప్రతివాదంబు నిలిపి కొనుము-
ఇది యుక్తి యనుకొందు వేమొ కా దనఁ జూమీ
నీదు ప్రత్యుక్తిని నిలిపి కొనుము-
ఇది యర్థ మనుకొందు వేమొ కా దనఁ జూమీ
నీ పరమార్థంబు నిలిపి కొనుము-
సార మిది- విన్నవింతు విస్తార మేల?
ఉన్న వాఁడవే యైనచో నన్నుఁ గూడ
నున్నవానిగఁ జేయుమీ - ఉండి లేవి
వాఁడవే యైన నే మనువాఁడను? - ప్రభు!

## 173

చౌషష్టి విద్యల జయ మందు వారలు
ప్రభువరు మెప్పులు పడయఁ గలరె? -
శక్తిత్రయంబును సాధించు వారలు
ప్రభువరు పేరిమిఁ బడయఁ గలరె? -
అణిమాది సిద్ధుల నార్జించు వారలు
ప్రభువరు మన్ననల్ పడయఁ గలరె? -
వేదాంత వీథుల విహరించు వారలు
ప్రభువరు ధామంబుఁ బడయఁ గలరె? -
కళలు, శక్తులు, సిద్ధులు, తెలువు లిచ్చి
ప్రకృతి రంజించు చుండిన ప్రభుని నిన్ను
నింద్రజాలాల మెప్పింప నెంతవారు!
భక్తి సేవింప నీ కృపఁ బడయరె? - ప్రభు!

## 174

కాసారమున కొక్క కమలిని చాలదా
కమలిని సిరికన్నెఁ గన్నతల్లి! -
క్షీరాంబునిధి కొక్క సిరికన్నె చాలదా
సిరి జగంబులఁ గన్న చిన్నితల్లి! -
హిమవంతునకు నొక్క యుమ యున్నఁ జాలదా
ఉమ వేలుపుల నేలు కొమరు తల్లి! -
ఉదయ దిక్కున కొక్కయుష యున్నఁ జాలదా
ఉష యరుణుని చాయ నున్న తల్లి! -
ఇందు నందు వెలుఁగు లిచ్చెడి జోతులు
కన్న యాడుబిడ్డ లెన్ని చూడ;
మాయ యాడుబిడ్డ మున్ముక్తి దీపిక
భవ దనంత ధామ పథమున ప్రభు!

## 175

మన సున్న నా కున్న మక్కువల్ వినిపింతు
మనసు లే కున్నఁ జేయునది లేదు-
మన సున్న నాకుఁ దోఁచిన మాట లనిపింతు
మనసు లే కున్నఁ జేయునది లేదు-
మన సున్న నీ పాద వనజంబులఁ దలంతు
మనసు లే కున్నఁ జేయునది లేదు-
మన సున్న నీకు నే వినిపింతు నా చింత
మనసు లే కున్నఁ జేయునది లేదు-
మనసు నే నాఁడొ నీ చెంత కనిచికొంటి
మనసు గలిగియు నే నిట్లు మఱుఁగు చుంటి
నా మనసుఁ బట్టి , యొంటిగా నన్ను బెట్టి
మనసుగలవాఁడ విటు నన్ను మఱతువె? - ప్రభు!

## 176

నియమంబు దప్పని నీ సృష్టి కృతులలో
లేదు సాదృశ్యంబు లేశ మైన-
సత్యంబుఁ దప్పని సముచిత స్థితులలో
లే దుపమానంబు లేశ మైన-
కాలంబుఁ దప్పని లీ లాలయములలో
లేదు సమానత లేశ మైన-
భద్రంబుఁ దప్పని భవ దనుగ్రహములో
లేదు పోలిక లవలేశ మైన-
లీలఁ దెలుపవు , పాలించు వేళఁ దెలుప,
వాత్మకీలాప్రభావంబు లైనఁ దెలుప,
వాగ్ర హానుగ్ర హాది సామగ్రిఁ బట్టి
తిరిగా దేటికి? - పరమార్థపరుఁడవు ప్రభు!

## 177

నవమించు మెత్తని నా పల్కు దువ్వల్వ
లొసఁగి పూజింతు రావోయి వేగ-
నలి లేని తొలి లేని నా కృతి రత్నాల
చాయలఁ గొల్తు రావోయి వేగ-
నలఁగని తొలఁగని నా వలపుల పూవు
టూయెల నూతు రావోయి వేగ-
నవకంపుఁ గప్రంపు నా నవ్వుటారతి
నుంచి మ్రొక్కుదును రావోయి వేగ-
యెడఁద విరిదమ్మి పవళింపు లీవు మెచ్చ,
జీవరా గానుభవ సుఖశ్రీలు హెచ్చ,
ఆత్మవి జ్ఞానుబోధ గా నామృతంబు
విందు సేయుదు రావోయి వేగమె ప్రభు!

## 178

ప్రాణ్నాడి తోడు, పేరిమిఁ జెప్పుచుంటి, నా
యెదదమ్మి విచ్చి నీ కిచ్చుకొంటి-
తొలుపల్కు లాన, నిక్కలఁ జెప్పుచుంటి, నా
మచ్చిక వాయి నీ కిచ్చుకొంటి-
కనుపాప యొట్టు, నిక్కమ చెప్పుచుంటి, నా
యిరుచూపుఁ జేర్చి నీ కిచ్చుకొంటి-
ప్రణవంబు బాస, డాపక చెప్పుచుంటి, నా
వెచ్చ యూరుపులు నీ కిచ్చుకొంటి-
శిథిల గృహములోని చిన్ని దివ్వియఁ గూడ,
నీవు సాక్షి, నీకె యిచ్చుకొంటి-
కల ధనంబు లిచ్చి, కరయుగళము మోడ్చి
యొఱఁగు నన్ననుగ్రహింపుము ప్రభు! -

## 179

నల్లని మబ్బుల నడుమ మించును బోలి
సూక్ష్మంపు వరిముల్లు చొప్పుఁ దాల్చి-
పరమాణువున కంటెఁ బరమాణు రూపమై
పసుపు పచ్చని వన్నె మిసిమి తోడ-
నఖిలంబుఁ దినుచుండు శిఖిశిఖామూర్తివై
పరమాత్మవై పరబ్రహ్మ మగుచు-
వీతిహోత్రుండవై విశ్వాత్మకుండవై
భూరి జగత్ప్రాణమూర్తి వగుచు-
జంగమ స్థావ రాత్మక సకల భువన
వర్తివై లోకములఁ బ్రోచు వాఁడ వగుచు-
అక్షరుండవై నిత్య సత్యాత్మ వగుచు
వెలయు సచ్చిదానందు నిన్ దలఁతును ప్రభు! -

## 180

అవినీతి సంతతి కంబ య్యె మను కంటె
ఆలు గొడ్రాలుగా నగుట మేలు-
క్షార జలంబుల నూరి యుండుట కంటె
ఉత్త గోయిగ నూయి యుంట మేలు-
పరిమళహీన పుష్పములఁ బూనుట కంటె
అగము వంధ్యానగ మగుట మేలు-
శ్రుతిహీన గానసంగతులఁ దేలుట కంటె
ప్రకట గాయకు వినాయకత మేలు-
దానహీనుల యాశ్రయ మూను కంటె
అర్థి వారికిఁ బ్రత్యర్థి యగుట మేలు-
భక్తిహీన భావంబున బ్రదుకు కంటె
చచ్చుటయె మేలు దేవుని సన్నిధి ప్రభు!

## 181

నిండు చందురుఁ బోలు నెమ్మోము! - కం దయ్యె
నెంతగాఁ జిక్కిపోయితివి నాథ! -
ననఁ బోలు నెమ్మేన! - నాలి చెమ్మట గ్రమ్మె
నెంతగా నలసి పోయితివి నాథ! -
అలరుఁ దమ్ములఁ బోలు నడుగులా! - కసుగందె
నెంతగాఁ బడలి పోయితివి నాథ! -
వలపుఁ దెమ్మెరఁ బోలు వలయూర్పు! - యుర వయ్యె
నెంతగా సొలసి పోయితివి నాథ! -
అనద ననుఁ జూడఁగాఁ, జూచి యాదరింప
నిటు నడచి వచ్చితే! దయ యెంత సేసె!
అవశ నై యుంటి, నుపచార మరయకుంటి
నెంత యపచారమో! అనుగ్రహింపుము ప్రభు!

## 182

నాగస్వరము నూఁది నను మేలు కొలిపితి
పాములవాఁడు సర్పమును బోలె-
మంత్రించి నా మేని మైకంబుఁ దీర్చితి
మంత్రవేత్త గ్రహంబు మలపి నట్లు-
సామశ్రుతులఁ జెప్పి చైతన్య మిచ్చితి
గురుఁడు శిష్యుని తెల్వి గొలిపి నట్లు-
కరమునఁ గర ముంచి కరుణ నన్నెత్తితి
వరవధూద్వాహోత్సవమునఁ బోలె-
బ్రతికితిని నీకు నుపచార బాధ లిచ్చి,
బ్రతికి యపరాధినిగ నుండి బ్రతుకఁజాల,
నను క్షమించితి వేని నా నతులతోడఁ
గృతులతో నన్ను నీ కిచ్చి బ్రతుకుదు ప్రభు!

## 183

ఆకాశ మొకపదం, బవని రెండవ పదం
బట్టులే యుంటి నా కట్టుకథల-
చుట్టాల కర్థంబు, సూరుల కర్థంబు
పంచి పెట్టితిని నా ప్రాణకథల-
వికృతుల భావంబు, సుకృతుల భావంబు
వివరించుకొంటి నా వింత కథల-
జీవున కొక బాస, దేవున కొక బాస
చేసి యుంచితిని నా చిత్రకథల-
ఏ ప్రకృతు లెట్లు నవ్వ నా కేమి గాని
నవ్వుచుందువు నీవును, నవ్వుకొనుము
నవ్వుకొను మోయి! నేను నీ నవ్వులోనె
నవ్వుకొను దాఁకఁ గలకల నవ్వుము ప్రభు!

## 184

చిదిమిన పత్ర మర్పింపఁగా రా దను
కరమున బిల్వంబుఁ గన్న తల్లి-
పుణికిన పుష్పంబు పూజింప రా దను
వెన్నెల పువు తల నున్న వేల్పు -
త్రెంపిన ఫలము నర్పింపఁగా రా దను
చేత నామలకంబు చెలఁగు వెజ్జు-
చేదు తోయము లభిషేకింప రా దను
గంగను పాదాలఁ గన్న తండ్రి-
ఇన్ని ప్రజ్ఞలు వారి కీ విచ్చు టెఱిఁగి
మదిఁ బొదలు భక్తిఁ దెలుప, నీ మాట నిలుప
పత్ర పుష్ప ఫలాంబు ప్రబంధ మాల
నేక మతి నిచ్చికొంటి గ్రహింపుము ప్రభు!

## 185

పదముఁ బట్టెదఁ గాని, పేరులు మెచ్చఁగఁ గాదు,
ఏకాంత సేవ నే నెంచి కొంటి-
నాట్య మాడెదఁ గాని, నలుగు రౌ ననఁ గాదు,
ఏకాంత సేవ నే నెంచి కొంటి-
భజన సేయుదుఁ గాని, ప్రజ లహో యనఁ గాదు,
ఏకాంత సేవ నే నెంచి కొంటి-
కృతులు పాడెదఁ గాని, కీర్తి కెక్కఁగఁ గాదు,
ఏకాంత సేవ నే నెంచి కొంటి-
దాంతిశాంతులఁ బిల్చి వందనము లొసఁగి,
భక్తిరక్తులఁ బిల్చి శుభంబుఁ జెప్పి,
నిరత మేకాంతసేవలో నిన్నుఁ గొలుతు-
లోక మే మన్న నా కేమి లోసము? - ప్రభు!

## 186

ఇది భూత, మిది భావి, యిది ప్రస్తుతము నాక
కాలత్రయిగ నిన్నె కాంచుచుంటి-
ఇది సత్త్వ, మిది రజం, బిది తమం బనకుండఁ
త్రిగుణాత్మగా నిన్నె తెలియుచుంటి-
ఇది యాది, యిది మధ్య, మిది యంత మనకుండ
మూడింటి మొదలుగాఁ బాడుచుంటి-
ఇది రాత్రి, యిది పవ, లిది సంధ్య యనకుండ
ముప్పొద్దుగా నీకు మ్రొక్కుచుంటి-
నీ యవస్థల మూడింటి నేను గంటి
నా యవస్థల మూడింటి నడపఁగంటి
ఇఁకఁ దురీయము నాకు నీ కేక మైన
నిత్య సత్త్వైక పదమున నిలుతును ప్రభు!

## 187

తమమును ద్రోచి లోకము లేలు నాదిత్య
మూర్తిగా ని న్నెంచి మ్రొక్కి కొలుతు-
కరి మబ్బు ద్రోచి లోకము కంటఁ జూపించు
పావనమూర్తిగాఁ బ్రస్తుతింతు-
విప్లవంబులఁ ద్రోచి విశ్వంబు రక్షించు
సౌభద్రమూర్తిగా సన్నుతింతు-
క్షామంబులను ద్రోచి క్ష్మామండలముఁ బ్రోచు
సౌభాగ్యమూర్తిగా సంస్మరింతు-
దైన్యమును ద్రోచి భక్తసంతతికి శాంతి
కరము లందించు వరమూర్తిగాఁ దలంతు;
మఱకువను ద్రోచి మౌనుల కెఱుక నిచ్చి
కాచు సుజ్ఞానమూర్తిగాఁ గందును ప్రభు!

## 188

రాతిరి వెన్నెల రవ్వలఁ బెట్టక
రాయిడి సేయక రాగదోయి! -
దవ్వుల చుక్కల నవ్వులఁ బెట్టక
జాగర మేటికి రాగదోయి! -
కోవల పూవుల కోలలఁ బెట్టక
వేగమె ప్రోవఁగ రాగదోయి! -
కమ్మని తెమ్మెర కైపులఁ బెట్టక
వేగని యాఁగక రాగదోయి! -
భక్తిశృంగార మను పరమోక్తిఁ గాక
పడతి బంగార మను సూక్తిఁ బట్టి యైన
ప్రేమకాంతము న న్నాదరింప వోయి!
ముక్తికాంతతో మూలల మునుఁగక ప్రభు!

## 189

జీవితేశ్వరు నిన్నుఁ జేరుదు నందునా
భవవార్ధి నీఁదు నుపాయ మెఱుఁగ -
ప్రాణేశ్వరుని నిన్నుఁ బట్టుదు నందునా
కర్మప్రభంజన గతు లెఱుంగ -
ఆత్మేశ్వరుని నిన్ను నరయుదు నందునా
ఆశల కంతంబు నైన నెఱుఁగ-
పరమేశ్వరుని నిన్నుఁ బడయుదు నందునా
భూతలోకము దాటిపోవు టెఱుఁగ-
కాని, మది నీదు పదభక్తిఁ గట్టి నిలిపి
ఎఱుక నా కిచ్చి కరుణ నన్నేలి తేని
ఎల్ల మర్మంబుల గ్రహించి యంతలోనె
వచ్చి వ్రాలుదు నీ యింటి వాకిట ప్రభు!

## 190

పాపంబు లెటు లైనఁ బరిహరింపఁగ వచ్చు
నరివర్గ మే విధిఁ దఱుమ వచ్చు?
బుద్ధి నె వ్విధి నైన బుట్టఁ బెట్టఁగ వచ్చు
కర్మంబు నెద్దానఁ గట్టవచ్చు?
సంచితం బెటు లైనఁ బంచిపెట్టఁగ వచ్చు
ప్రారబ్ధ మే విధిఁ బాయవచ్చు?
ఆగామి నెటు లైనఁ బోఁగొట్టుకొనవచ్చు
భవసూత్ర మెమ్మాడ్కిఁ బట్టవచ్చు?
ఈ విచారంబులను మాని, యీవె నాకు
రక్షకుఁడ వని నమ్మి భారంబు నీకె
వదలి శరణంటి, ననుఁ బ్రోచు వాఁడ వైన
జన్మకష్టములను మాన్పు చాలును ప్రభు!

## 191

పశుపతి వని నిన్నుఁ బ్రార్థింతు, నింక నా
ముందటి కాళ్లకు బంద మిడకు-
జీవనపతి వంచుఁ జేమోడ్తు, నింక నా
సుగతుల నరికట్టఁ జూడఁ బోకు-
ప్రాణపతి వటంచుఁ బలవింతు, నింక నా
పావ నాచార మాపంగఁ బోకు-
ఇహపర పతి వంచు నేఁ గొల్తు, నింక నా
ముక్తిధామము దారి మూయఁ బోకు-
అణువు బ్రహ్మాండములఁ జేసి యాటలాడు
చిత్రకేళి కే నెంత, నా జీవ మెంత!
అడుగుఁ బట్టి యాత్మార్పణ మంటిఁ గాన
ప్రేమ నన్నేలు మాటలఁ బెట్టక ప్రభు!

## 192

నలినాప్త కువలాప్త నయన! వందనములు
తాపసవంద్య! వందన శతంబు-
వరకరాభయకరద్వయ! వందనమ్ములు
దాస మందార! వందన శతంబు-
కమలజాండానేక గర్భ! వందనములు
ధర్మ నిర్మాత! వందన శతంబు-
నిత్యసత్యానంద నిలయ! వందనములు
తత్త్వస్వరూప! వందన శతంబు-
తామరసగర్భవినుత! వందన శతంబు,
నవ ఘనశ్యామ వర్ణ! వందవ శతంబు,
అక్ష రానంద వర్తి! లోకైక కీర్తి!
అనఘమూర్తి! వందన శత మందుము ప్రభు!

## 193

అల్లించితివి నూఱు, చల్లించితివి నూర్లు
భావ సంకీర్త నాభ్యాస లీల-
అల్లించితివి నూర్లు, జల్లించితివి నూఱు
భక్తి సంకీర్త నాభ్యాస లీల-
అల్లించితివి నూఱు, చెల్లించితివి నూర్లు
ప్రణయ సంకీర్త నాభ్యాస లీల-
అల్లించితివి నూర్లు, మళ్లించితివి నూర్లు
పరమార్థ భావ నాభ్యాస లీల-
ఇంక నూఱు, నూ ఱందువు, శంక యేల?
నూర్లు, వేలు, లక్షలు, కోట్లు నుతు లొనర్తు-
నాకుఁ బరమార్థములు నీ కృపాకరములు-
ఇఁకను నీకు నే నాస్థాన సుకవిని ప్రభు! -

## 194

మదిపరా కన లేవు, మళ్లించు కొన లేవు,
చాటి చెప్పెద నాది నాటుకైత-
ఆలింప నన లేవు, వేళ గా దన లేవు ,
చాటి చెప్పెద నాది నాటుకైత-
మూఁకవై చన లేవు, నా కేల యన లేవు,
చాటి చెప్పెద నాది నాటుకైత-
సమయ మీ నన లేవు, చక్కఁ బొ మ్మన లేవు
చాటి చెప్పెద నాది నాటుకైత
విల్లవిద్య నీది- విలువిద్యయే నాది
మాయ యలుగు నీది- మాట నాది
పేర్చి యేయు మలుగు, కూర్చి యే నేయుదు
ఎదఁ గరంచు వేదొ యెఱుఁగుదు ప్రభు!

## 195

కమలజాండము లేని కందుక క్రీడలు,
విశ్వాళి కే యమ్మ విడిది పట్టు-
మేదిను లెవ్వాని పాదపద్మ రజంబు,
పుడముల కే యమ్మ పురిటి యాలు-
గ్రహమండలము లేని కనుపాప బిడ్డలు,
చుక్కల కే యమ్మ చూపు వెలుగు-
అమ్బు తాంబు నిధు లేని యడుగుల మడుగులు,
పాలేళ్ల కే యమ్మ పాలతల్లి-
మాయ లేని హాసంబు సీమంత రేఖ,
పరుని కే యమ్మ చేరుపు ప్రకృతి కాన్పు-
అట్టి యాదిమ పురుషకాం తాకృతునకు,
విశ్వకేళికి నీకు నా వినతులు ప్రభు!

## 196

దీనత లేని సన్మానంబు నొసంగుము,
వక్రత లేని జీవనము నిమ్ము-
భేదంబు లేని సమాదరం బొసంగుము,
క్రౌర్యంబు లేని విక్రమము నిమ్ము-
చలనంబు లేని యైశ్వర్యంబు నొసంగుము,
తర్కంబు లేని యౌదార్య మిమ్ము-
చింతాకులత లేని సిరిసంపదల నిమ్ము ,
నైచ్యంబు లేని బాంధవము నిమ్ము-
శాత్రవంబు లేని సౌహృదం బొసంగుము,
భంగ గతులు లేని భక్తి నిమ్ము,
స్వార్థపరత లేని జ్ఞానం బొసంగుము-
వేఱె యింక నేమి కోరుదు? - ప్రభు! -

## 197

ఋణ ముండి పుట్టును ఋణముఁ దీర్పఁగ జీవి
గడియించి ఋణములు కట్టుచుండు-
ఋణ మున్న వారలు ఋణముల కోస మై
బంధు మి త్రానురూపమున వచ్చి-
ఋణ మందు కొందురు, ఋణములు తీర్తురు,
బ్రదికించుఁ బరిమార్చు నదియె ఋణము-
ఋణము సఖ్యం బిడు, ఋణము వైరం బిడు,
ఋణమునఁ బడి జీవి మిణుకు చుండు-
ఋణము గల్గిన సర్వంబు గణన కెక్కు,
ఋణము లే కున్న నన్నియు మఱఁగి పోవు-
ఋణము కర్మానురూపము, ఋణము భవము,
కర్మభవరూప ఋణము నీ కట్టడి ప్రభు!

## 198

ఋణములఁ బుట్టింతు, ఋణముల గిట్టింతు,
ఋణము లే కున్న నీ గణన లేదు-
ఋణములఁ జేర్తువు, ఋణములఁ దీర్తువు,
ఋణము లే కున్న నీ గణన లేదు-
ఋణములఁ ద్రిప్పుదు, ఋణముల మప్పుదు,
ఋణము లే కున్న నీ గణన లేదు-
ఋణములఁ గల్పుదు, ఋణముల నిల్పుదు,
ఋణము లే కున్న నీ గణన లేదు-
గొప్ప ఋణదాత వై ప్రాణికోటి నిట్లు
త్రిప్పి చంపుట ధర్మంబు తీరె నీకు?
నా ఋణము దీర్పఁ జాల నే నాఁటి కైనఁ,
గర్మభవరూప ఋణ మీవె కట్టుము ప్రభు!

## 199

తూర్పుగొండను ప్రొద్దు దోఁచెనా, వెలుఁగెక్కి-
కలకల లాడు లోకంబు లెల్ల-
నట్టింట సిరి కాలు పెట్టెనా, సదనంబు
తులఁదూఁగు చుండు బంధుగుల తోడ-
క్షేత్రాన ఘనుఁడు వర్షించెనా, పొలములు
పసి మించి సస్యసంపదలఁ బొదలు-
వనమున కామని వచ్చెనా, వృక్షముల్
పత్ర పుష్ప ఫ లాళిఁ బ్రణుతి కెక్కు-
భక్త విజ్ఞాని యోగి తాపసుల హృదిని
నీ కృపాదీపమాలిక నిలిచె నేని,
ప్రాణి కర్మాంధకార దుష్పటలిఁ దూల్చి
దివ్యధామంబు తెరు వేదొ తెల్పదె? - ప్రభు!

## 200

జన్మ మాస్థానంబు సౌఖ్యదుఃఖములకు
నవి రెండు లేని మూడవది యేదొ? -
సకల జీవజగంబు జననమృత్యు విహార
మవి రెండు లేని మూడవది యేదొ? -
దిన విభావరు లున్కి తేజస్తమములకు
నవి రెండు లేని మూడవది యేదొ? -
భువనంపు సంసృష్టి పుంస్త్రీవిలాస మౌ
నవి రెండు లేని మూడవది యేదొ? -
జ్ఞాన మజ్ఞానమును సదసత్తు బిడ్డ
లా ద్వయము లేని యట్టి మూడవది యేదొ? -
నిర్గుణ నిరంజన స్థితి నెగడు వేదొ?
ఆ పరబ్రహ్మమునకు నీ కంజలి ప్రభు!

## 201

నా పొంత లే వంచుఁ గోపగించుటె కాని
విశ్వాత్మ వంచు భావింప నైతి-
నన్నుఁ జూడ వటంచు నవయు చుండుటె కాని
దివ్య దృష్టి వటంచుఁ దెలియ నైతి-
నా కృతుల్ వినవంచు నానఁ జెందుటె కాని
కర్మ సాక్షి వటంచుఁ గాన నైతి-
నను బ్రోవ రా వంచు వసటఁ జెందుటె కాని
యఖిల రక్షకుఁడ వం చరయ నైతి-
ఒంటి నే నని చింతిలు చుంటిఁ గాని
జంట వై యుండు టరయింగ జాల నైతి-
ఎఱుఁగ కేఁ జేసికొంటి నె న్నేని తప్పు
లరసి క్షమియించి నన్నుఁ గాపాడుము ప్రభు!

## 202

పూ లిచ్చుకొను టేను, పూజ లందుట నీవు-
వాసనల్ నను బట్టి వదల వేమొ?
కృతు లిచ్చుకొను టేను, కీర్తి కెక్కుట నీవు-
కర్మచారత్వంబు కదల దేమొ?
దుస్తు లిచ్చుట నేను, ముస్తా బగుట నీవు-
సంచితార్థము కాలు కుంచ దేమొ?
అమృ తాన్న మిడు టేను, ఆరగించుట నీవు-
ప్రారబ్ద మిం తైనఁ దీర దేమొ?
అఖిల మర్పింతు, భారంబు లనుభవింతు-
అఖిలము భరించి భరియింప వబ్బురంబు!
ఇచ్చుకొని త్యాగిఁ గా నైతి నేమొ, కావి
పుచ్చుకొని త్యాగి నైతి నీ పున్నెము ప్రభు!

## 203

తృణ మైన నందించు, తృణము మేరువు నాకు,
తృణములో ఋణములు తీర్చికొందు-
పణ మైనఁ గల్పించు, పణము భాగ్యము నాకు,
పణములో నీ యాటఁ బట్టికొందు-
కణ మైనఁ బెట్టుము, కణ మమృతము నాకు,
కణములో భవ బాధఁ గట్టికొందు-
క్షణ మైన మది నిల్పు, క్షణ మనంతము నాకు,
క్షణములో నీదు రక్షణముఁ గందు-
ఇంచు కంత కరుణ యుంచి చూచినఁ జాలు
సలిపికొందు సేవ శాశ్వతముగ,
కొంచె మేని దాఁచికోను నా మే నింక
పదము లంటి బాస పల్కెదు ప్రభు!

## 204

నేలఁ గొట్టిన బంతి నింగి పై నిల్చునా
పడకుండ నీ చేతఁ బట్టఁ గలవు-
పైకి వీడిన గాలిపడ గట్టె యాడునా
తెగకుండ సూత్రంబు ద్రిప్పఁ గలవు-
తెరనుఁ బెట్టిన బొమ్మ తిమిరాన దోఁచునా
లోవెల్గు పోకుండఁ గావఁ గలవు-
పాతి పెట్టిన గింజ, పై మట్టిఁ దూల్చునా
నీ రాని వారుగా నిల్పఁ గలవు-
జీవులను ద్రోతు వభయంపుఁ జేతు లెత్తి
త్రిప్పి యాడింతు మాయల తెరలఁ బెట్టి
చెప్పి మరలింతు సుజ్ఞాన సిద్ధు లిచ్చి
నీ ప్రభావంబు నెఱుఁగ గంగ వేర్తుమె ప్రభు!

## 205

నుడి మిన్కుముత్యాల గొడుగుఁ బట్టితి నోయి,
నిలు మోయి! యిది మాయ నీడ గాదు-
అఖి లార్థ భర్మ పల్యంకి నిల్పితి నోయి,
తగు నోయి! యిది యనర్థకము గాదు-
తలఁపుల రతనాల కొలువుఁ దీర్చితి నోయి,
రావోయి! యిది నశ్వరంబు గాదు-
కృతి సుధా ధామ మంకితము చేసితి నోయి,
కను మోయి! యిది యనక్షరము గాదు-
బ్రహ్మ సృష్టికిఁ బ్రళయంబు పట్టుఁగాక
సత్కవిబ్రహ్మ సృష్టి శాశ్వత మటంచు
భువన సాహితీ సార్వభౌమునకు నీకు
నిచ్చుకొంటి దీనిఁ బరిగ్రహింపుము ప్రభు!

## 206

శృంగార రతులు భక్త్యంగీకృత పదాల
మది పొంగి వ్రాలి పోవుదురు గాక!
వైరాగ్య పరులు శృంగార సంగీతాల
మది మది చొక్కి పోవుదురు గాక!
జ్ఞానాంబునిధులు సంసార సువృత్తాల
తుది దాఁకఁ గలసి పోవుదురు గాక!
యోగీంద్ర మణు లాత్మరాగ ప్రబంధాల
కెదురేఁగి చేరి పోవుదురు గాక!
తనదు కీర్తన మొకరి ప్రార్థనము గాదు
త్వ త్కృపాభాగ్య మొక్కరి ధనము గాదు
పంచి పాడించుకొనుట నీ ప్రభుత యైన
పాడి పాడించుకొనుట నా భాగ్యము ప్రభు!

## 207

సేవింప లేనైతినో వెన్క జన్మాన
బల మిచ్చి కూర్తు నీ భవము నందు-
ధ్యానింప లేనైతినో నాఁటి జన్మానఁ
బలికించి చూతు నీ భవము నందు-
నుతియింప లేనైతినో తొంటి జన్మానఁ
బాడించుకొందు నీ భవము నందు-
ప్రేమింప లేనైతినో ముందు జన్మాన
వలపించినా నీ భవంబు నందు-
తప్పి పోయిన పసరంబు చొప్పు లరసి
దయను గొనితెచ్చి సుగుణబంధములఁ బెట్టి
ప్రోది గావించు యజమాని పోల్కి, నన్ను
ఎఱుక పుట్టుకఁ బెట్టి యి ష్టేలెదే? - ప్రభు!

## 208

అణువు బ్రహ్మాండంబు లట్లు కావింతువే
అణురూపు నన్నుఁ గాపాడ వైతి -
భూతపంచకము నీ ప్రోల వ్రేలింతువే
భూత శరీరు నన్ బ్రోవ వైతి -
గ్రహమండలము మింటఁ గట్టి త్రిప్పింతువే
గ్రహచార గతు నన్నుఁ గావ వైతి-
ప్రాణికోటులఁ గర్మపాణి నాడింతువే
నీ కన్న ప్రాణి నన్ సాకవైతి -
విశ్వలీలాత్మ వై నన్ను విడిచినావొ?
మాయతెర వీట నా మాట మఱచినావొ?
నీ పదధ్యాన నిరతు మన్నింప వైతి
నీ పరధ్యాన మెందుకో యెఱుఁగమ ప్రభు!

## 209

నీ కున్న కనులను లోకాళి కొసఁగితి
కన్నవారల నేమి కాంతు వయ్యా?
నీ కున్న శ్రుతులను నీ వారి కిచ్చితి
విశ్వంబు మొఱ లేమి విందు వయ్యా?
నీ కున్న మనసును నీ మాయ కిచ్చితి
శ్రితుల నే మని మానసింతు వయ్యా?
నీ కున్న గుణముల నీ మూర్తులకు నిచ్చి
తే మని సాధుల నేలు దయ్యా?
తనకుఁ గలవాని నొరులకు దాన మిచ్చి,
ప్రాభవంబును నితరుల పా లొనర్చి -
ఈ జగము లెట్లు పోషింప నెంచి తయ్యా?
విశ్వదాత వై యేమి కావించెదు? - ప్రభు!

## 210

ఏఱు దాటిన, తెప్ప నెవ రైనఁ దలఁతురా!
ముప్పు దప్పిన, మేని గొప్ప యేల?
ఋణము దీరిన, పత్ర మెవ రైనఁ జూతురా!
బరువు దింపిన, గంప భార మేల?
ఇరులు విచ్చిన, ప్రొద్దు నెవ రైన గాంతురా!
పగలు దీఱిన, శత్రుబాధ యేల?
యెఱుక వచ్చిన, మాయ నెవ రైనఁ బిలుతురా!
మది మాయ, మఱుకువ మాట యేల?
ఉసురుపోఁ దిత్తి నెంతురే! యొక్క రైన,
అడుగు జాఱిన, కుండతో నాట లేల?
కర్మజీవత్వ మిఁక నాకుఁ గట్టిపెట్టి,
ధర్మ దైవత్వ మిప్పింపఁ దప్పదు ప్రభు!

## 211

క్ష్మామండలము ధూళిగాఁ జేయు చేతనే
ధూళి ధాత్రిగఁ జేసి యేలఁ గలవు-
మేరువు తృణముగా మెలిపెట్టు చేతనే
తృణము మేరువుఁ గాఁగఁ దేర్పఁ గలవు-
అమ్బు తాబ్ధి కణముగా నమరించు చేతనే
శీకర మమ్బు తాబ్ధిఁ జేయఁ గలవు-
బ్రహ్మాండ మణువుగాఁ బట్టిన చేతనే
అణువు బ్రహ్మాండ మట్లాడఁ గలవు-
మాయయును విద్య నీ చేత మసలి నపుడు,
ప్రళయసృష్టులు నీ యాజ్ఞ సలిపి నపుడు,
చిత్ర శక్తివి నీ వేమి చేయ లేవు?
నీ యనంత శక్తికి నతిసేయుదు ప్రభు!

## 212

విప్రుండ నయ్యును వేదముల్ వల్లింప ,
శాస్త్రవిజ్ఞానముల్ సంగ్రహింప-
ఉపనిష ద్భావంబు లుల్లంబులో నిల్ప ,
త త్త్వానురూప గీతలఁ బఠింప-
వర పురాణంబుల వైఖరి నాలింప ,
నితిహాసముల నైన మతిఁ దలంప-
కావ్యప్రబంధముల్ కడముట్టఁ దిలకింప ,
కృతుల కీర్తనముల స్మృతి వహింప-
సాధు సంసేవలో మానసంబు నుంప ,
నైన - నా పూర్వజన్మ పుణ్యమున నేమొ,
బత్తికైతతోఁ బుట్టి విన్ బాడుచుంటిఁ
జాలదా యిది, ననుఁ బ్రోవఁ జాలద? - ప్రభు!

## 213

పదభాగ్య మి మ్మని బతిమాలు చుంటినా
అడుగుల కడ నిల్పు మంటిఁ గాని-
ఐశ్వర్య మి మ్మని యర్థించు చుంటినా
అనుఁగు నెచ్చెలిఁ జేయు మంటిఁ గాని-
స్వారాజ్య మి మ్మని సాధించు చుంటినా
అనఘ జీవన మీయు మంటిఁ గాని-
బ్రహ్మత్వ మి మ్మని ప్రార్థించు చుంటినా
ఆత్మధామముఁ జేర్పు మంటిఁ గాని-
అనుభవము లేని మోక్ష మి మ్మంటి నోయి?
అనిత రానంద పదము ని మ్మంటిఁ గాని-
ఇన్ని కోరిక లేల? నా యిష్ట మెటిఁగి
యిచ్చినదె పుచ్చుకొందు, నీ యిష్టము ప్రభు!

## 214

దయసేయు మను పిల్పు తలఁ పసంభావ్యమా
లెక్కసేయక రాక తక్కినావు-
కృపఁ జూడు మను కోర్కి కేక యన్యాయమా
చెవిఁ బెట్టకే విసర్జించినావు-
పాలింపు మను మొఱ్ఱ పలు కనాహూయమా
మన్నింప కెచటికో మళ్లినావు-
నను బ్రోవు మను ప్రార్థనపుఁ గృతి వికృతియా
ఆలింప కే మింటొ యాఁగి నావు-
ఈవె యీరేడు లోకాల కేడుగడవు-
పాడి దప్పిన నినుఁ ద్రిప్పువాఁడు గలఁడె?
ఆడి తప్పిన నిను దెప్పువాఁడు గలఁడె?
వేఁడుకొను చుంటి, నను దయఁ జూడుము ప్రభు!

## 215

కర్మపాశంబులఁ గాళు లంటం గట్టి,
చింతాఫలంబులఁ జేతఁ బెట్టి-
పత్నీసుతాదుల భార మౌదలఁ బెట్టి,
నీచవృత్తులఁ జుట్టు నిలువఁ బెట్టి-
ఆహార నిద్రా విహార రోగముఁజుట్టి,
కామాది వైరి తస్కరులఁ బెట్టి-
మాయాంధకార నిర్మగ్నాటవిని బెట్టి,
విషయమ్ము గోగ్ర దుర్వ్యధఁ బెట్టి-
త్రిప్పి త్రిప్పి యెందాఁక శోధింతు విట్లు?
ఆత్మ కళ నిన్నుఁ బాసిన యంతమాత్ర
జీవి యై యిన్ని బాములు చెంద వలెనె?
ఈ మహాగ్నిపరీక్ష నీ కేటికి? - ప్రభు!

## 216

చరణ మంజీర నిస్వన సామములు మ్రోగ,
దరిసెన మిమ్ము నా తల్లి వగుచు-
పదపద్మ నూపుర ప్రణవనాదము లొప్ప,
దరిసెన మిమ్ము నా తండ్రి వగుచు-
లలిత రత్నప్ర భాలంకార రుచు లొప్ప,
దరిసెన మిమ్ము నా తల్లి వగుచు-
-భూరిమణీ దివ్యభూషలు వెలుఁ గీయ,
దరిసెన మిమ్ము నా తండ్రి వగుచు-
తన్నుఁ గడుపారఁ గాంచిన తల్లి కంటె,
తన్నుఁ బ్రియమారఁ బెంచిన తండ్రి కంటె,
కడుపులోఁ బెట్టుకొని నన్నుఁ గావఁ గలవు-
ముక్తికాంతవు , నిర్వాణమూర్తివి ప్రభు!

## 217

కమలజాండంబు లోంకారంబునను బిల్వ
దయ సేయు మోయి, నాదస్వరూప! -
ఆత్మప్రభాపుంజ మాశల రంజింప
కృప సేయు మోయి, వహ్నిస్వరూప! -
అఖిల భూభువనంబు లమృతమ స్తనిపింప
పద ముంప వోయి, ఆపస్స్వరూప! -
సచరాచర జగంబు స్వాగతం బని చెప్ప
విచ్చేయు మోయి, పృధ్వీస్వరూప! -
పంచభూాత ప్రపంచ సోపాన పంక్తి
బలసి జీవభక్తులు బరాబరులు సేయ,
జ్ఞానమూర్తులు సంకీర్తనములు సేయ,
కొలువు గనుమోయి! యిది చిత్రకూటము ప్రభు!

## 218

మాతృసేవయె దేశమాతసేవ యటంద్రు
మాతృత్వ మా దేశ మతము గాన-
దేశసేవయె మాతృదేవిసేవ యటంద్రు
దేశ మెల్లర మాతృదేవి గాన-
జీవసేవయె తన దేవసేవ యటంద్రు
జీవుల దేవుండు చెలఁగు గాన-
దేవసేవ సమస్తజీవసేవ యటంద్రు
దేవుండు జీవసంజీవి గాన-
యేది యెటు లైన లక్ష్యమే కాదె తనకు
సంత తానంద సక లార్థ సాధనంబు?
జననియును జన్మభూమియుఁ దనకు నొకటె,
జీవుఁడే దేవుఁ డగు వాత్మసిద్ధికి ప్రభు!

## 219

ముగురి పెద్దలఁ జేసి ముఖపత్రమును వ్రాసి
నా ఋణధన మిచ్చినావు కావు-
పంచాయతినిఁ బెట్టి బాముల నొడిఁ గట్టి
నా జీవధన మిచ్చినావు కావు-
పగవారిఁ దగిలించి బాసలు మిగిలించి
నా శాంతిధన మిచ్చినావు కావు-
కర్మకాండలఁ గట్టి కచ్చేరులనుఁ బెట్టి
నా యాత్మధన మిచ్చినావు కావు-
సిరులు గలవాఁడ వేమి చేసిననుఁ జెల్లు
ఒద్దిక లటంద్రు నీ పనుల్ పెద్ద లెల్ల
ధర్మ మున్నది, నీ తోడ తగవు లేల?
అన్నిటికి మోక్ష మనుము, ని న్నడుగను ప్రభు!

## 220

ఎవరిని బిల్చినా యీవు పల్కిన యట్లె
శ్రుతి కెక్కు నేమి సత్కృతియొ కాని-
ఎవరిఁ గోపించినా యీ వడ్డుపడి నట్లె
మది దోఁచు నేమి సంపదయొ కాని-
ఏ తెన్ను ద్రొక్కినా నా తోడ నున్నట్లె
కాన్పింతు వేమి భాగ్యంబొ కాని-
ఏరికి మ్రొక్కినా యెదుట నీ వున్నట్లె
యగుపింతు వేమి పుణ్యంబొ కాని-
భ్రాంతు లనుకొన్నఁ గా వని పలికి నట్లు
చిత్రము లటన్న గా వని చెప్పి నట్లు
కరుణ ననుఁ బ్రోవ నా వెంటఁ గంట నిలిచి
న న్ననుసరించి వచ్చుచున్నాఁడవె? - ప్రభు!

## 221

మాయ బీజముఁ బెట్టి మాను గట్టించితి
చిగురులో దానిని జిదుమ వైతి-
గొనపుఁ దీవలఁ బెట్టి కొనలు సాగించితి
పూవులో వానిని బుణుక వైతి-
మరుల యాకులఁ బెట్టి పరువు పట్టించితి
పిందెలో వానిని బేల్ప వైతి -
కర్మ ఫలా లిచ్చి కడుపు నిండించితి
తొలుతనే వానిని ద్రుంప వైతి-
జన్మవృక్షంబొ- మాయబీజంబొ- ముందు
తెలియకుండంగ జీవులఁ ద్రిప్పుచుంటి
విది విలాసంబొ, ప్రకృతియో యెఱుఁగ నేర-
ఇట్టి యింద్రజాలములు నీ కేటికి? - ప్రభు!

## 222

చేసిన తప్పునే చేయింపఁ జెల్లునా
పెద్దవాఁడవు నీవు దిద్ద రాదె? -
కుమిలిన కొంపనే కుమిలింపఁ జెల్లునా
మంచివాఁడవు నీవు మాన్ప రాదె? -
తప్పిన దారినే త్రిప్పింపఁ జెల్లునా
కన్నవాఁడవు నీవు కావ రాదె? -
నొగిలిన జీవినే నొగిలింపఁ జెల్లునా
ప్రోడవాఁడవు నీవు ప్రోవ రాదె? -
ఎవరి కర్మంబునకుఁ గర్త లెవ్వ రనుచు
గొప్ప వేదాంతమును జెప్పి తప్పికొనెదె? -
'ఆత్మవ త్సర్వ భూతాని' యనుట మాని
కర్మ భవ దుఃఖముల జీవిఁ గట్టెదె? - ప్రభు!

## 223

ఇంతలో నవ్వింతు వంతలో నేడ్పింతు
వెవరి పాప యటంచు నెంచి నావొ? -
చేతఁ బెట్టెద విట్టె మూతి ద్రిప్పెద వట్టె
యెవరి బిడ్డ యటంచు నెంచి నావొ? -
కాలూనఁ బట్టెదు కడగండ్లఁ బెట్టెద
వెవరి సంతాన మం చెంచి నావొ? -
పలుకరింతువు కొంత పాటిపోవుదు వంత
యెవరి సైదో డని యెంచి నావొ? -
సుఖములును దుఃఖములు నాకుఁ జుట్టఁ బెట్టి
ఆట లాడించి కనుట నీ కాట లయ్యె?
కన్న బిడ్డను న న్నిట్లు కలఁతఁ బెట్టి
కూర్చు టనుభవ మని యెంచుకొంటివె? - ప్రభు!

## 224

అగము లై పేర్చిన యాపదలను నైన
వ్రాలింతు వంతలో వజ్ర మగుచు-
మబ్బు లై పట్టిన మమకారముల నైనఁ
దూలింతు వంతలో గాలి వగుచు-
ఏఱు లై పాఱిన దారిద్ర్యముల నైన
నడగింతు వంతలోఁ బుడమి వగుచు-
చిచ్చు లై దరికొన్న చింతాతతుల నైన
వదలింతు వంతలో వర్ష మగుచు-
నిన్ను నమ్మిన వారి న న్నింట నిట్లు
కంటికిని ఱెప్ప చందానఁ గాతు వనుచు
నిగమములు చెప్పు మాటలు నిజము లైన
కర్మరోగార్తు న న్నేల కావవు? - ప్రభు! -

## 225

నేమ్మేను పసి దప్పి సొమ్మసిల్లిన నేమి
రసన నీ నామ మంత్రమె జపింప-
కన్నులు కావిరుల్ గ్రమ్ముచుండిన నేమి
లోదృష్టి నీ మూర్తిలో లయింప-
చెవులు రెండును గళ్లు చెందు చుండిన నేమి
యంతశ్శ్రుతులు నిన్నె యాలకింప-
మనసు స్వాస్థ్యంబును మాని యుండిన నేమి
తలఁ పాగి నీ పాదములె తలంప-
భూత సంస్పృష్టి నను వీడిపోవ లేక
యెన్నొ యాతనలను బెట్టుచున్న నేమి
జన్మబాధల కొక జలాంజలి ఘటించి
శ్రీపదాశ్రయమున స్వస్తిఁ జెందెద ప్రభు!

## 226

తన తల్లిదండ్రులఁ దక్క నెంతటి వారి
నితరుల వేఁడికో నెఱుఁగఁ గాని-
తన యన్నదమ్ములఁ దక్క నెంతటి వారి
నితరులఁ గూడఁగా నెఱుఁగఁ గాని -
తన కన్నవారలఁ దక్క నెంతటి వారి
నితరులఁ గూర్పఁగా నెఱుఁగఁ గాని-
తన యంత వారలఁ దక్క నెంతటి వారి
నితరుల వియ్యంబు నెఱుఁగఁ గాని-
ఇది గుణమ్మొ! యవగుణమ్మొ యెఱుఁగఁ గాని
తల్లి వని, తండ్రి వని, సహోదరుఁడ వనుచు,
నన్నుఁ గన్నాఁడ వనుచు, బాంధవుఁడ వనుచు,
నిన్ను నమ్మి కొల్చెద-విది నేరమా? - ప్రభు!

## 227

కన్నీటఁ బాదాలఁ గడిగించు కొందువా
కరు ణాత్మునకు నిది తెలఁ గటయ్య?
ప్రిదిలిన యెదతమ్మిపీఁటఁ గొలు వుందువా
గురుమూర్తి కీ పని కూడు నయ్యా?
వేఁడి నిట్టూర్పుల విసరించు కొందువా
శుచిమంతునకు నిది చొ ప్పటయ్య?
నిప్పచ్చరపు టింటనే విందుఁ గొందువా
భువనంపు బొ జ్జేమి పూడు నయ్యా?
అధిప! నిను వీడి, విరహతా పాగ్నిఁ గూడి
చిక్కి శల్యమై యున్న యీ జీవి తోడి
సరస మే మంత సుఖ మీయఁ జాలు నయ్యా?
మాయ లేమిటి ? కిఁక దయసేయుము ప్రభు!

## 228

ఆత్మయు ఉన్న గృహద్వారమున నుండి
యెవ రన్న- నే నని యెంచి కొందు-
పదుగురిలోన, నుపన్యాసములు చెప్పు
నెడ, నేను నే నని నొడివి కొందు-
తా నొనర్చిన కార్యతతిఁ జెప్పుకొనుచోట
నేను నే ననియె, వర్ణించు కొందు-
తన పెత్తనమ్ము ప్రదర్శించు కొనువేళ
నేను నే ననుచు, మన్నించుకొందు-
నేను సర్వనామము గాన నేను విడువ-
నేను నేనులో నుండి జన్మించు కతన
నేను నే నగుదాఁక-తః నేను విడువ-
నే నహ మ్మనఁ బోక మన్నింపుము ప్రభు!

## 229

విడిచి వచ్చితి నేదొ? - విశ్వంబు తిలకించి
కనువెల్గు దానికై కలఁత నొందు-
మఱచి వచ్చితి నేదొ? - మన సౌఖ్య దాని పై
నిలువక దానికై నెమకు లాడు-
ఎడసి వచ్చితి నేదొ? - హృదయంబు దానికై
నిట్టూర్పుగాలిలోఁ గొట్టు కాడు-
నిలిపి వచ్చితి నేదొ? - తలఁపు మంటను మింటఁ
బరువిడి దానికై ప్రాకులాడు-
భౌతికపుఁ జెఱఁ బద్ధ యీ ప్రాణి కింక
మరల నా పరమార్థంబు దొరకఁ బోదె? -
ఇహములో నెంత వెదకిన నేమి ఫలము!
పరమునకు వచ్చి క్రమ్మఱఁ బడయుదు ప్రభు!

## 230

వేదవల్లికిఁ జొక్కి పాద మాపకు సుమీ
గడె యైన నిను వీడి గడపఁ జాల-
జ్ఞానవల్లిఁ దలంచి పైన మాపకు సుమీ
నినుఁ బాసి త్రుటి యైన మనఁగఁ జాల-
ఆనందవల్లి కై యాగిపోవకు సుమీ
క్షణ మైన నిను వీడి సైపఁ జాల-
ప్రణవవల్లికిఁ జిక్కి భ్రమ పడియెదు సుమీ
నిముసంబు నిను వీడి నిలువఁ జాల-
జీవవల్లి నై నిను వీడి పోవ నేమి?
నీకు దయ యున్న నన్నియు నేను గానె? -
బ్రదికి యుండితి నీకు నై, కదలి వచ్చి
యెల్ల సందేహములఁ దీర్చి యేలుము ప్రభు!

## 231

జీవ విశిష్టుఁడ క్షితి నను కొందునా
క్షితి జలంబులలోనఁ జేరిపోవు-
నారాయణుఁడ నని ననుఁ బిల్చు కొందునా
నారంబు లగ్నిలోఁ జేరిపోవు-
జాతవేది నటంచు సరిపుచ్చు కొందునా
శిఖి వాయు సంగతిఁ జేరిపోవు-
వాయువు నే నని వర్ణించు కొందునా
యూరు పాకసములోఁ జేరిపోవు-
ఆకసం బందునా, అది యైనఁ గాని
దహరమునఁ జేరుఁ గాన , భూతములఁ ద్రోసి,
గుణములను బాసి , శక్తులఁ గూడఁ దీసి,
ఆదిమబ్రహ్మ వైన నీ వగుదును ప్రభు! -

## 232

విద్యాసతీ హాస విమల మౌక్తిక మాల
నిటల పట్టంబుగా నిలిపి నావె? -
మాయాకు వాలోల మణిమాల డాకేల
సింహతలాటంబుఁ జేసి నావె? -
ప్రకృతి సువర్ణ ముద్రాకాంచి డాకాల
గండపెండెరముగాఁ గట్టినావె? -
క్షితిసతీ సాగర చిత్రాంశుకము, తల
నుష్ణీషకంబుగా నుంచి నావె? -
ఆడువారి చేతులలోన నాడ మరిఁగి
ఆడువేషంబులను బూని యఖిలజగతి
జీవకోటుల నాడుకోఁ జేయుచుందె?
భాగవతమూర్తి కివి యాటపాటలె? - ప్రభు!

## 233

పసిపాప యేడిచి పల్కించుఁ దన తల్లి
నాఁకలిఁ దీరుచు నంత దాఁక-
అర్థి దాతను వినయానతిఁ గొనియాడు
నిష్టార్థమును సంగ్రహించు దాఁక-
కూలివాఁ డధికారి గుణముఁ బట్టి చరించుఁ
బూట బత్తెము తన్నుఁ బొందు దాఁక-
మనుజుండు ఋణదాత కనువర్తి యై యుండు
చేసికొన్న ఋణంబు చెల్లు దాఁక-
నిహము నం దెల్ల జీవులు నిట్లె యిట్లె
ఋణము గొని ఋణజీవు లై యేగుచుంద్రు;
పరమునం దట్లు గాక, నీ పాలఁ బడిన
జీవుఁడే దేవుఁ డగు నేమి చిత్రమొ ప్రభు!

## 234

అడుగులో నడు గుంచి నడయాడి నట్లగు,
పద మాపి చూడఁ జూపట్ట వేమి?
పలుకులోఁ బలు కుంచి పలికించి నట్లగు,
పలు కాపి పిలువఁ గాఁ బలుక వేమి?
వీనులో వీ నుంచి వినిపించి నట్లగు,
వినిపించు కొనఁ బోవ వినుప వేమి?
తలఁపులోఁ దల పుంచి తర్కించి నట్లగు,
తర్క మాఁపఁగ నాఁగఁ దలఁప వేమి?
ఇదియు నీకు వినోదమో యేమొ యెఱుఁగ
ఇదియు నా భ్రాంతి మూలమో యేమొ యెఱుఁగ
నీ వినోదంబు,నా భ్రాంతి నిజమొ యైన
నిజము(నకు) సుఖ మిం తన వేర్తువె ప్రభు!

## 235

మాటమంతులు నీవె మరచిపోవను గాని
యేను నీ వని చెప్ప నీయ వేమి? -
ఆటపాటలు నీవె యడ్డుపెట్టను గాని,
యేను నీ వనుకొన నీయ వేమి? -
కర్మకాండలు నీవె కాంక్షఁ జెందను గాని,
యేను నీ వని చూడ నీయ వేమి? -
భుక్తిముక్తులు నీవె పోరువెట్టను గాని,
యేను నీ వని వాడ నీయ వేమి? -
నా నిఖిల జీవనములు నీ వైన యపుడు
నా నియతి వర్తనములు నీ వైన యపుడు
కావు కా వని మొఱ లిడఁ బోవఁ గాని
ఏను నీ వనుకొన నీయ వే మిఁక? - ప్రభు!

## 236

జీవనదీ తీర సికతాతలము నాది
అమృత తరంగ హస్తములు నీవి-
ఆ శాంధకార ఘో రారణ్యమే నాది
కరుణా కటా క్షేందుకళలు నీవి-
శత్రు సంతప్త విస్తార తాపము నాది
సంతాన శీతల చ్ఛాయ నీది-
బహుజన్మ వాసనా సహనకుంజము నాది
దివ్య సుగంధ మందిరము నీది-
వ్యసన దుష్కృ తాకరముల వాఁడ నేను,
వర వరాభయ కరముల వాఁడ వీవు-
శరణుఁ జొచ్చితి, నన్ను నీ పరమకరుణ
చరణములఁ జేర్చి రక్షింపఁ జాలవె? ప్రభు!

## 237

కలఁడు, కలఁడు దీనగణములఁ బ్రోవఁగాఁ
గలఁ డను దాసవాక్యములు వింటి-
కలఁడు, కలఁడు భక్తగణముల గావఁగాఁ
గలఁ డను సుజనవాక్యములు వింటి-
కలఁడు, కలఁడు జ్ఞానిగణముల యొంటనే
కలఁ డను సాధువాక్యములు వింటి-
కలఁడు, కలఁడు యోగిగణముల వెంటనే
కలఁ డను సూరివాక్యములు వింటి-
కలఁడు, కలఁ డను శ్రుతివాక్యములను వింటి-
నీవు కల వను పల్కు సందిగ్ధ మయ్యె!
నీవు కలవాఁడ వేని సందియము దీఱ
వచ్చి, జన్మార్తు ననుఁ బ్రోవ వలవవె? - ప్రభు!

## 238

రమ్మని బతిమాలరాదు రా దనుకొంటి
వచ్చిన నే మనవలెనొ యెఱుఁగ-
పొడసూపు మని వేఁడఁ బోను పో ననుకొంటి
తలసూప నే మనవలెనొ యెఱుఁగ-
కూర్మి నిల్పఁగఁ గోరఁ గోర నే ననుకొంటి
వలపింప నే మనవలెనొ యెఱుఁగ -
వరము నర్థింపఁగా వద్దు వ ద్దనుకొంటి
వర మీయ నే మనవలెనొ యెఱుఁగ-
పైనముల నాపు మని చలపట్ట నింక-
చెంతనే యుండు మని రవ్వసేయ నింక-
వలపుగీటులో నాఁగఁగాఁ దలఁప నింక
ఏ మడిగి కొందును? నీ వేమి యిచ్చెదు? - ప్రభు!

## 239

రెప్ప నీ కోస మై విప్పి యుంచిన యంత,
అనిమేష సిద్ధి నా కంద నయ్యె-
మేను నీ కోస మై మీఁదు గట్టిన యంత,
అమరత్వ సిద్ధి నా కంద నయ్యె-
మనసు నీ కోస మై మట్టుపెట్టిన యంత,
అమనస్క సిద్ధి నా కంద నయ్యె-
ఉసురు నీ కోస మై యుగ్గఁ బట్టిన యంత,
ఆత్మ సంసిద్ధి నా కంద నయ్యె-
లక్ష్య మొం డైన , సిద్ధుల లాభ మేల?
ప్రేమలో సాముగరిడీల పెంపు లేల?
ప్రేమమూర్తి వై సాక్షాత్కరించి తేని,
ఇష్టసిద్ధిని గని సుఖియింతును ప్రభు!

## 240

చెప్పుట సులభంబు, చేయుట కష్టంబు,
చెప్పిన ట్లెవ్వారు చేయు వారు?
చెప్పుట యర్థంబు,చేయుట స్వార్థంబు,
చెప్పిన ట్లెవ్వారు చేయు వారు?
చెప్పుట ధర్మంబు,చేయు టధర్మంబు,
చెప్పిన ట్లెవ్వారు చేయు వారు?
చెప్పు టలౌక్యంబు,చేయుట లౌక్యంబు,
చెప్పిన ట్లెవ్వారు చేయు వారు?
కాలి కా ర్థాధికార ముష్కరులు మొదల
దైవమును జెప్పి,పౌరు షార్థములు విప్పి,
సాధులో కాపకారంబు సలిపి, తుదకు
వారె,దై వోపహతి,నేల వ్రాలరె? - ప్రభు!

## 241

ఇది సువర్ణ విశిష్టయే యన్నవారికి
పావన పద భద్ర భాగ్యవృద్ధి,
ఇది మనోహర దేశియే యన్నవారికి
బహుళ పదార్థ సంప త్సమృద్ధి,
ఇది పవిత్ర సుజాతియే యన్నవారికి
తరతర భావ గోత్ర ప్రసిద్ధి,
ఇది పూర్వ సంస్కృతియే యన్నవారికి
అభ్యుదయ పరంప రాభివృద్ధి
సిద్ధిర స్తని విబుధు లాశీర్వదింప;
చిరత రాయు రారోగ్య సంసిద్ధి రస్తు,
ప్రియ వచ స్సిద్ధిర స్తని పెద్ద లనఁగ
భావసంకీర్తనముల నిన్ బాడితి ప్రభు!

## 242

లోకంబు గనవలెనా కులతత్త్వంబు?
లే కులంబున వాఁడ వీవు చెపుమ! -
మాకు పగలు వెట్ట నీకు వినోదమె?
నమ్మిక కిది నిదానంబె చెపుమ! -
లేమిఁ బెట్టితి గాని, ప్రేమధనము మాకుఁ
బంచిన నీకు లోపంబె చెపుమ!
నీకు మా కొక ప్రాణమే కద! యెడముగాఁ
దలఁగుట యేమి పెత్తనము చెపుమ! -
చెంతఁ గనఁబడ్డ, మముబోఁటి జీవు లూర
కుండ నీ రని కొం డెక్కి యుండినావె!
మాయ తగులంబు లెల్లనూఁ బాయఁ జేసి,
హెచ్చు కుందులు ద్రోసి, మ మ్మేలుము ప్రభు!

## 243

నీరూపె లక్షింప నేర్చితి, లోకంబు
నన్ను పరాఙ్ముఖుఁ డన్న నేల?
నీ మీఁది కృతి సేయ నేర్చితి, లోకంబు
న న్నహంకృతి యనుకొన్న నేమి?
నీ తోడ మాటాడ నేర్చితి, లోకంబు
నన్ను మహోన్మాది యన్న నేమి? -
నీ ధ్యాన మతి నుండ నేర్చితి, లోకంబు
నన్ను పరధ్యాని యన్న నేమి? -
నిన్నె సన్నుతి సేయఁగా నేర్చి కొంటి,
నిన్నె నిత్యంబు సేవింప నేర్చి కొంటి,
నీవె లోకంబుగా నుండ నేర్చి కొంటి,
లోక మే మన్న నా కేమి లోపము? - ప్రభు!

## 244

మాన పాలయ కృతి మాన్యత లాదిగా
నందనవన నిధానముల తోడ,
సంసారకూప నిస్తారంబు తుదిగాఁగ
సప్త సంతాన ప్రశస్తిఁ గంటి,
సుకృతి కన్యాదాన శుభకార్యములఁ జేసి
జీవేశు ని న్నల్లుఁ జేసికొంటి-
ఏడేడు తరముల నిటు పవిత్రము సేసి
యేడేడు లోకంబు లేలఁ గంటి-
నన్నుఁ బోలిన ధన్యు లున్నారె చెపుమ!
నన్నుఁ బోలిన మాన్యు లున్నారె చెపుమ!
నన్నుఁ బోలిన సుకృతు లున్నారె చెపుమ!
కంటి నిన్నియు, మంటి, నీ కరుణనె ప్రభు!

## 245

ప్రభుతోడ నే మని పలుకాఁడఁ బోయితే!
నోరు వా యిచటనే జాఱఁ బెట్టి-
విశ్వ సుందరు నెట్లు వీక్షింపఁ బోయితే!
కను చూపు లిచటనే కట్టి పెట్టి-
విభు పల్కు లే లీల విను నాసఁ బోయితే!
వీను దో యిచటనే విడిచిపెట్టి-
పరమాత్ము నే మని దరియంగఁ బోయితే!
జీవాత్మ నిచటనే చెఱలఁ బెట్టి-
కలధనము వీడి-నన్ను నెచ్చెలిని వీడి-
ఇంత వెఱ్ఱిదాన వయితి వేమె మనస?
అనుచు వాపోవు చున్న నన్ గనుచు నీవు
నా మనసుఁ బట్టి నవ్వుకున్నాఁడవె? - ప్రభు!

## 246

ఏటి కావల నూళులే లే వనెడి యాతఁ
డన్య దేశముల మా టైన వినునె? -
'విస్సన చెప్పిందె వేద' మన్న యతండు
శ్రుతి చతుష్కం బున్న చొప్పుఁ గనునె? -
తను మున్గినదె గంగ యని నమ్మి యున్న వాఁ
డన్యతీర్థముల పేరైన వినునె? -
తన తోడిదే లోక మనుకొన్న యాతఁడు
పరలోక లక్ష్యానుభవముఁ గనునె? -
తన్నుఁ బ్రభుఁ డని మన్నించు కొన్న యతఁడు
ఇహపరంబుల ప్రభు నిన్ను నెఱుఁగఁ గలఁడె?
మానవుల నిట్టి వెఱ్ఱుల మమతఁ బెట్టి-
నీడలోఁ గట్టి నవ్వుచున్నాఁడవె? - ప్రభు!

## 247

అమ్మ నా సన్నుల నాలించి పాలిచ్చు,
తండ్రి నా పలుకులఁ దలఁచి పిలుచు-
చుట్టంబు నా నడఁ జూచి కూరిమి నించు,
గురువు నా తెలివికిఁ గొనలు వెట్టు-
నెచ్చెలి నా జీవనిధికి మెట్టులు గట్టు,
ప్రజలు నా సంపత్తి పంచు కొంద్రు-
బాములు నా యనుభవములఁ జిత్రించు,
జనన మృత్యువులు న న్ననుసరించు-
సృష్టికల్పంబులో నేనె చిన్నవాఁడ,
పేర్మి విద్యలలో నేనె పెద్దవాఁడ,
బుద్ధి వృద్ధులలో నేనె ప్రోడవాఁడ-
ఈడ నా వాఁడ! ఆడ నీ వాఁడను ప్రభు!

## 248

ప్రళయ మైనదె నీకు జలచరంబుల భాష,
యీాశ! నీ భాషలో నిమిడి నదియె-
గహన మైనదె నీకు బహు మృగావళి భాష,
యీాశ! నీ భాషలో నిమిడి నదియె-
గగన మైనదె నీకు ఖగ మండలపు భాష,
యీాశ! నీ భాషలో నిమిడి నదియె-
మర్మ మైనదె నీకు మర్త్యలోకపు భాష,
యీాశ! నీ భాషలో నిమిడి నదియె-
ప్రకృతిభాషల గ్రహియించి, పరమ మైన -
ఆదిమం బైన నీదు రహస్య భాష
మాకుఁ దెలుపవు - దానఁ బ్రహ్మాద మున్నె
విశ్వభాషల యాధ్యక్ష విభుతకు? - ప్రభు!

## 249

సౌఖ్యమునకు నేది సారమో! - సాధన
మున కేది తుది లక్ష్యమో! - నితాంత
తృష్ణ కెయ్యది తృప్తితీరమో! - ఆ నిగూ
ఢప్రగాఢాత్మ నైజ ప్రకృతికి-
అనితరానంద నిత్యాభిరామమునకు-
ఆ యమృత ప్రవాహమున కెన్ని
భవముల నుండియో ప్రాకులాడెదఁ గాని,
అది యందకున్నదే! - అందు కనియె-
నిత్యమును జచ్చుచుంటి, జన్మించుచుంటి,
మరలఁ బుట్టకుండఁగ నిట మందు లేదు,
త్రిప్పి చంపక నీ కృపామృతము నొసఁగి,
అమృతమ స్తని నన్నుఁ గాపాడుము ప్రభు!

## 250

కుమతి సుమతు లిద్ద ఱమల భక్తిశ్రద్ధ
లం గొని యమృతకల్పంబుఁ గోరి,
తుది లేని యీ జన్మతోయధి మథియించు
చున్నారు; జీవున కొక నిమేష
మైన విశ్రాంతి యన్నది లేదు; విరహ వి
షానల శిఖలచే నంగకములు,
బహిరంతరంబులఁ బ్రాంతరంబులతోడ
దగ్ధ మౌచున్నవి తమకుఁ దామ,
కాని, ప్రేమామృతం బందరాని దై, ని
రాశ క్రమ్ముచున్నది, దీని నవలఁ ద్రోసి,
యేకమతిఁ జేసి, భంగంబు లెడముఁ జేసి
నీ కృపామృత మిచ్చి మన్నింపుము ప్రభు!

## 251

ఒక రూప మైన నీ కున్నదే యంటినా?
ఆది విరాణ్మూర్తి వంటి గాని-
ఒక పెత్తనము కల్గియుంటివే యంటినా?
అఖి లేశ్వరుండ వీ వంటి గాని-
ఒక పల్కుబడియు నీ కున్నదే యంటినా?
అన్న మాటలె శ్రుతు లంటి గాని-
ఒక యింటివాఁడవై యుంటివే యంటినా?
అఖిలలోక కుటుంబి వంటి గాని-
మింటి వంటినా ? నా కంద వంటి గాని,
కుంటి వంటినా ? పద మాప వంటి గాని,
కొంటె వంటినా ? నను బ్రోవ వంటి గాని,
ఒంటి వంటినా ? జంట నే నంటిని, ప్రభు!

## 252

ఒక వేదము పఠింప నోపని నాకు నీ
సత్కృప శ్రుత్యర్థ సమితి దోఁచె-
ఒక యుపనిష దర్థ మొలయని నాకు నీ
చిరకృప సుజ్ఞాన సిద్ధి దోఁచె-
ఒక శాస్త్ర మెఱుఁగంగ నోపని నాకు నీ
దయ సర్వశాస్త్ర పద్ధతులు దోఁచె-
ఒక పురాణము చూడనోపని నాకు నీ
కరుణ పురాణమార్గములు దోఁచె-
ఒక్క సద్భక్తి కళ దోఁప కున్న నాకు
తావక కృపాకటాక్ష విస్తార సార
సుకవితా భావగీత మాలికలు దోఁచె,
శ్రీచరణ భక్తికీర్తనల్ దోఁచెను, ప్రభు!

## 253

సకలేంద్రియంబుల సద్దణంగిన దిందు
రావోయి సామి ! నా సేవ లేల?
అరివర్గముల మద మడఁగి పోయిన దిందు
చనుదెమ్ము నాథ ! నా చనవు లేల?
భవబంధముల బాధ పాసిపోయిన దిందు
పరతెమ్ము దేవ ! నా పజ్జ లేల?
జీవ విభ్రాంతులు చెదరి పోయిన విందు
విచ్చేయు మీశ ! నా మెచ్చు లేల?
ఎల్ల కర్మానుభవములు చెల్లె నిందు,
ఎల్ల సందేహ వికృతులు డుల్లె నిందు,
సచ్చిదానంద పద మిది, జయ పదంబు,
అద్వయానంద పద మిది, యందుము ప్రభు!

## 254

మున్నాట యఱువది మ్రొక్కుల పూదండ
సుమనస్తుతుల పెంపుఁ జూపు దండ, -
వాడుకొన్న కొలంది వలపు లీనెడి దండ,
తలఁపుల మెలపులు తెలుపు దండ, -
అవధరించు కొలంది నవక మెక్కెడి దండ,
వసివాళ్లు వాడని మిసిమి దండ, -
పరికించు కొలఁదిని మెఱుఁగు లెచ్చెడి దండ,
దళదళంబుల మేలుకొలుపు దండ, -
ప్రకృతి కవితల చూపు పోలికల దండ,
చిత్ర మగు దండ, కాలాలఁ జెడని దండ,
కూర్మి నీ కయిదండను గూర్చుకొంటి
నెలమి నంగీకరించి నన్నేలుము ప్రభు!

## 255

కనుపెట్టి కృపఁ జూచు క న్నెఱుంగఁగ నైతి,
కన్నెఱ్ఱఁ జేయఁగాఁ గడఁగు చుంటి-
శ్రుతు లిచ్చి బోధించు చొ ప్పెఱుంగఁగ నైతి,
నో రెత్తి తిట్టఁగాఁ గోరు చుంటి-
చే యెత్తి యభయంబు నీయఁ జూడఁగ నైతి,
కర మెత్తి కొట్టఁగాఁ గడఁగు చుంటి-
దయ వచ్చి దీవించు తలఁ పెఱుంగఁగ నైతి,
ఎద నొచ్చి సాధింప నెంచు చుంటి-
ప్రేమ పుట్టదె! యీలాటి బిరుసు లున్నె?
భక్తి పుట్టదె! యీలాటి భ్రాంతు లున్నె?
తప్పు లెన్నియొ పుట్టె నా తలనె నేఁడు
తమము నెడలించి, యెఱు కిచ్చి తనుపుము ప్రభు!

## 256

అమృ తౌషధం బంచు నాసించి నందుకా
మోహ సంసా రాబ్ధి ముంచి నావు-
కల్పవృక్షం బంచుఁ గాంక్షించి నందుకా
కర్మఫలము లంటఁ గట్టి నావు-
కామధేను వ టంచుఁ బ్రేమించి నందుకా
భవబంధముల పాలు పఱచి నావు-
చింతామణి య టంచుఁ జేఁ జాపి నందుకా
చింతాకుల ప్రాణిఁ జేసి నావు-
ఘనతరుఁడ వంచు నమ్మి యిక్కట్లఁ బడితి,
గోపతి వ టంచు నమ్మి చిక్కులను బడితి,
జీవపతి వయ్యు న న్నిట్లు పేయఁ జన్నె?
పరపతికి మేలె యీలాటి పంథలు? - ప్రభు!

## 257

అడిగినఁ గాని యి మ్మైనఁ బెట్ట ద టండ్రు,
అడిగించుకొని యీయఁ గుఱఁగ నైతి-
కోరినఁ గాని చేకొని దాత యీఁ డండ్రు,
కోరించుకొని యీయ నేర నైతి-
పొగడినఁ గాని భూపుఁడు చిత్త మీఁ డండ్రు,
పొగడించుకొని యీయఁ బూన నైతి-
మీఁదుఁ గట్టినఁ గాని మే లీఁడు వే ల్పండ్రు,
మీఁ దందుకొని నోరు మెదప నైతి-
మాత వని నమ్మి నే నెంతొ మాయఁ బడితి,
దాత వని నమ్మి నే నెంతొ దైన్య పడితి,
నేత వని నమ్మి నే నెంతొ నికృతిఁ బడితి,
దేవుఁ డని నమ్మి ని న్నేమి తిట్టుదు? - ప్రభు!

## 258

పాపమో పుణ్యమో ప్రకటింపఁగాఁ బోని
పర పదంబులఁ గొను బాస నాది-
కష్టమో సౌఖ్యమో గణియింపఁగాఁ బోని
పరమార్థములఁ గొను పంథ నాది-
ప్రళయమో విలయమో తలపింపఁగాఁ బోని
పరభావములఁ గొను ప్రజ్ఞ నాది-
సమరమో సంధియో సమసింపఁగాఁ బోని
పర సత్క్రతులఁ గొను ఫణితి నాది-
పదమునకు, నర్థమునకును, భావమునకు
సుకృతియే కార్య మై యున్న చోట నన్ను
పరప దానత కృతి యన్నఁ బాప మున్నె?
పరపతిని నిన్నుఁ బాటలఁ బట్టితి ప్రభు!

## 259

నను నాస్తికునిఁ జేయ వని నమ్ముకొంటిని
తావక శ్రుతులను దలఁచి తలఁచి -
నను శతాత్మునిఁ జేయ వని నమ్ముకొంటిని
తావక గుణములఁ దలఁచి తలఁచి-
నను విరాగిని జేయ వని నమ్ముకొంటిని
తావక లీలలఁ దలఁచి తలఁచి-
నను విదూరునిఁ జేయ వని నమ్ముకొంటిని
తావక ప్రకృతులఁ దలఁచి తలఁచి-
నన్ను మాయలోఁ బడనీని నమ్ముకొన్న
ధర్మ సత్యాత్ముఁ డీ వని తలఁచి తలఁచి,
నన్ను మఱపులోఁ బడనీని నమ్ముకొన్న
దైవ మీ వని తలఁచితి- తలఁచితి ప్రభు!

## 260

బత్తిఁ గొల్చిన వారి బంగారు జడ గంట
నా వెంటఁ దోఁచె నిన్నాళ్ల కిపుడు-
తలఁచి కొల్చినవారి తళుకు చుక్కల జంట
నా కంట నిల్చె నిన్నాళ్ల కిపుడు-
వలచి కొల్చినవారి వరుమానముల పంట
నా యింట నిండె నిన్నాళ్ల కిపుడు-
మ్రొక్కి కొల్చినవారి మొగ మానికపు దంట
నా జంటఁ గూడె నిన్నాళ్ల కిపుడు-
పాడి కొల్చినవారల పైఁడి గంట
నాదు కౌఁగింట మ్రోఁగె నిన్నాళ్ల కిపుడు,
ఆడుకొనఁ బాడుకొనఁ గృప వేఁడికొనఁగ
నాకు సమయ మిచ్చితె యిన్నినాళ్లకు ప్రభు!

## 261

జనన మృత్యు విధాన సరణిఁ బెట్టిన నీవు
అభవత్వ మిచ్చి కాపాడ లేవె? -
కష్టపాశంబులఁ గలయఁ గట్టిన నీవు
సౌఖ్యమోక్షంబు లొసంగ లేవె? -
ఐహి కార్థంబుల యాశఁ బెంచిన నీవు
పరమార్థ భాగ్యంబు పంచ లేవె? -
మాయా విమోహ సంభ్రాంతిఁ ద్రిప్పిన నీవు
నిత్య సన్మార్గ మందింప లేవె? -
విధివిధాన వేత్రముఁ బట్టి విశ్వరంగ
సీమ జీవుల నాడింతు వేమి కోరి? -
యముఁడ వై భయపెట్టక సముఁడ వగుచుఁ
గరుణ మముఁ బ్రోచి సత్కీర్తిఁ గాంచుము ప్రభు! -

## 262

ఏలువాఁ డని యాశ్రయించి నాఁడను గదా
నా తప్పులను గాచి నావె? దేవ ! -
ఉన్నవాఁ డని వేఁడుచున్న వాఁడను గదా
నా యప్పులను దీర్చినావె? యీశ ! -
మేలువాఁ డని చాల మెచ్చినాఁడను గదా
నా త్రిప్పులను మాన్చి నావె? స్వామి ! -
కన్నవాఁ డని నమ్ముకొన్న వాఁడను గదా
నా ముప్పులను ద్రోచినావె? తండ్రి ! -
ప్రోచువాఁడ వంచు నోచినాఁడను గదా
నన్నుఁ గనికరించి నావె? నాథ ! -
ఏడుజగము లేలువాఁడ ! నీ వాఁడ, నే
నడుగువాఁడ, మాఱు నుడువుము ప్రభు!

## 263

లోకసంచారి వై రాకుంటి వంటివా
నా గ్రహచార మన్నాను గాని-
బ్రహ్మాండభర్త వై పాలింప వంటివా
నాదు ప్రారబ్ధ మన్నాను గాని-
భువ నోదరుండ వై పోషింప వంటివా
నా జన్మదోష మన్నాను గాని-
విశ్వమయుండ వై వీక్షింప వంటివా
నా పూర్వ కర్మ మన్నాను గాని-
అఖిల జీవాత్మ వై ప్రోవ వంటి వోయి?
నా యదృష్ట మీపాటి దన్నాను గాని-
లోటు లెన్నియొ నా కున్న మాట నిజము,
సర్వరక్షకుఁడవు నన్ను సాకవె? - ప్రభు!

## 264

నవకవితా ప్రబంధశుకంబు నా దన్నఁ
బలికింతు వింతలోఁ బంత మేల? -
జాతీయ సుకవితా శారిక నా దన్నఁ
జెప్పింతు వింతలోఁ జింత యేల? -
మధుర భావకవిత్వ మధుపంబు నా దన్న
వినిపింతు వింతలో వింత యేల? -
అభ్యుదయకవిత్వ హంసంబు నా దన్న
రప్పింతు వింతలో రంతు లేల? -
లలిత పదకవితా కోకిలంబు నాది
యన్నఁ బాడింతు వింతలో నంత యేల? -
ఇంత గీర్వాణమా, యన కిష్ట మేదొ
సుంత సెల విమ్ము, విన్ను మెప్పింతును ప్రభు!

## 265

నా పతి విశ్వావనీపతి కనఁగంటి
మాయలోకం బేమి సేయు నన్ను-
నా రాజు సకల సన్మార్గ రా జనఁగంటి
మాయతమం బేమి సేయు నన్ను-
నా నాథుఁడు ప్రపంచనాథుఁడే యనుచుంటి
మాయభూతము లేమి సేయు నన్ను-
నా స్వామి భువ నావన స్వామి వీ వంటి
మాయభంగము లేమి సేయు నన్ను-
నా ప్రభుండు గుణమణిప్రభుఁ డౌ నంటి
ఛిద్ర సృష్టి యేమి సేయు నన్ను-
నా కుభయము నీవె- నా కభయము నీవె,
మాయ న న్ని కేమి సేయును? - ప్రభు!

## 266

పరునకుఁ బలు కీయ నెఱుఁగని నన్ను నీ
మంచి కై మాట లాడించి నావు-
పరునకుఁ జేజాఁపి యెఱుఁగని నన్ను నీ
పేర్మి కై చేయిఁ జాఁపించి నావు-
పరునకు మన సీయ నెఱుఁగని నన్ను నీ
సేవ కై మన సొగ్గఁ జేసినావు-
పరునకుఁ గృతిఁ గూర్ప నెఱుఁగని నన్ను నీ
ఠీవి కై పాటఁ బాడించి నావు-
పరున కే మౌదునో చెప్ప నెఱుఁగఁ గాని,
పరునిఁ గాని యే పౌరుషపరునిఁ గాని
చింత సేయని వాని న న్నింత వానిఁ
జేసి, పరపద దాసునిఁ జేసితె? - ప్రభు!

## 267

ఆశల వెన్నెల, లలము కొ న్నప్పుడే
నా మింటి చుక్క వన్నార లెవరొ?
చూపు టూయెల లూఁపి చూపిన యప్పుడే
నా కంటిపాప వన్నార లెవరొ?
తలఁపుఁ బొలము కలకల లాడి నప్పుడే
నా పంటలచ్చి వన్నార లెవరొ?
కోర్కె కోవెల మింటికొన లంటి నప్పుడే
నా యింటివేల్పు వన్నార లెవరొ?
నీకు నే నేమి యగుదునో లోక మెఱుఁగుఁ
గాక, నీవ యెఱుంగుదు గాక, నీవు
నాకు నెలబాలుఁ డని సిరినాయకుఁ డని,
అంతరంగపతి యని, నే నందును ప్రభు!

## 268

హృద యార్పణమునకు హేతు వు న్నదొ లేదొ
హృదయేశ్వరుఁడ వని యెఱిఁగితి ప్రభు ! -
ప్రా ణార్పణమునకు భావ మున్నదొ లేదొ
ప్రాణేశుఁ డని నిన్నుఁ బట్టితి ప్రభు ! -
అ ర్థార్పణమునకు నాత్మ యున్నదొ లేదొ
పరమార్థపతి నిన్నుఁ బడసితి ప్రభు ! -
ఆ త్మార్పణమునకు నర్థ మున్నదొ లేదొ
ఆత్మేశ్వ రునిగ ని న్నందితి ప్రభు ! -
అంతరంగంబు, భావంబు,నర్థ , మాత్మ
హేతువులఁ దప్పిపోవునే యెన్నఁ డైన?
సకల జీవ జగంబుమఁ, బ్రకృతి గూడ
ఆత్మ కర్మ కారణ బద్ధ మరసితి ప్రభు!

## 269

ఈ మాట నా మాటనే చెప్పితివి గాని,
నీ మాట యిచ్చి మన్నింప వైతి-
ఈ పాట నా పాటనే మప్పితివి గాని,
నీ పాట వరు సైన నేర్ప వైతి-
ఈ గాధ నా గాధనే విప్పితివి గాని,
నీ గాధ యింత విన్పింప వైతి-
ఈ వాడ నా వాడనే త్రిప్పితివి గాని,
నీ వాడ దరిఁ జేర్చి ప్రోవ వైతి-
నీవి నీ వుంచుకొనుటలే యీవు లైన
మావి మా కిచ్చుటలు మడిమాన్యము లని
అగపడిన యప్పు డైన ని న్నడుగఁ బోని
యెఱుక మాలిన వాఁడనే యింకను ప్రభు!

## 270

ఏది నా రాజ్యలక్ష్మీ దేవి యందువు
సౌందర్య సౌభాగ్య మందుఁ గలదొ?
ఏది యేకాంతసేవా దివ్యమధు వందు
వద్వ యానందమే యందుఁ గలదొ?
ఏది బృందావ నామోద భాగ్యం బందు
వా నంద నానంద మందుఁ గలదొ?
ఏది పూజాపుష్ప సౌదామని య టందు
వమర పరీమళ మందుఁ గలదొ?
ఏది పరమార్థ కీర్తనం బేది యందు,
వేది భక్తి సంకీర్తనం బేది యందు,
వేది భావ సంకీర్తవం బేది యందు-
తినుచు రుచు లేల? యే మని తెలుపుదు? - ప్రభు!

## 271

తోడి కవులు తల లాడింపఁగా నేల
నా భావములు నీకు నచ్చుఁ గాక!
తోయంపు గాయకుల్ హా యనఁగా నేల
నా రాగములు నీకు నచ్చుఁ గాక!
ప్రక్క నెచ్చెలులు చప్పట్లు గొట్టఁగ నేల
నా నృత్తములు నీకు నచ్చుఁ గాక!
కన్న పెద్దలు కన్నుసన్నఁ జేయఁగ నేల
నా వృత్తములు నీకు నచ్చుఁ గాక!
ఒరులు నా భరతముఁ బట్టి మురియ నేల
నా కళా కలాపము నీకు నచ్చుఁ గాక!
ఎవరి మెప్పున కై నటియింతు నోయి?
భర్త నీవు మెచ్చినఁ జాలు, బ్రదికెద ప్రభు!

## 272

మేయి వీడు దాఁక నీ మే లెంచు కొనుచుందు
సద్గోష్ఠి యిచ్చినఁ జాలు నాకు-
బ్రదికిన దాఁక నీ భజన సేయుచు నుందు
సద్భక్తి యిచ్చినఁ జాలు నాకు-
జీవించు దాఁక నీ చింత సేయుచు నుందు
సంస్మృతు లిచ్చినఁ జాలు నాకు-
కను మూయు దాఁక నీ ఘనత నెంచుచు నుందు
సద్గతు లిచ్చినఁ జాలు నాకు-
అవల-నవ్వల-నే నేమి యడిగికొందు?
కొంచె మడిగితి నని కోపగించు కొనక
యిష్ట మున్నది యిచ్చి న న్నెట్టు లైన
నేలు- మీవ లావలలు నీ కేటికి? - ప్రభు!

## 273

దోస వాటికలలో ధ్వనియించు నిది యేమి?
శ్రుతి శు కానంద సంస్తుతుల రవ.
తాప సాశ్రమముల వ్యాపించు నిది యేమి?
వేదవల్లికల క్రొవ్విరుల తావి-
యోగీంద్ర మణులలో నుదయించు నిది యేమి?
నిగమభానుని ధగద్ధగల వెలుఁగు-
ఉపనిష ద్వీధుల నొఱయున దిది యేమి?
వేదాంత సత్పథ విధుని కాంతి-
దివ్య ధామ మందుఁ దేలిన దిది యేమి?
శాంతిపదము- నిత్య సత్య పదము-
ఆత్మపదము- సచ్చి దానంద పద మని
బ్రహ్మవాదు లెఱుక పఱతురు ప్రభు!

## 274

దయసేయ కుంట నీ త ప్పనఁ గాని, నా
చెంతకు ర మ్మను టెంత తప్పొ? -
కృపఁ జూడ కుంట నీ యె గ్గనఁ గాని, న
న్నేలుకోవలె నను టెంత యెగ్గొ?
మొఱ విన కుంట నీ తెలుఁ గనఁ గాని, నా
కండ యి మ్మను టెంత దుండగంబొ?
కనిపింప కుంట నీ క ల్లనఁ గాని, నా
దృష్టులఁ బడు మను టెంత దొసఁగొ?
అధిప! ని న్నొకమాట నే ననఁగఁ బోక
తప్పు లన్నియు నా వని యొప్పికొందు,
దండనముచేతఁ దప్పులు తలఁగు నండ్రు,
నేర మొప్పితి నీవె దండింపుము ప్రభు!

## 275

సౌవర్ణ శైలేంద్ర! సరస నిర్ఝరిణి నై
నీ యంఘ్రులకుఁ బాద్య మీయ నిమ్ము-
సంతాన తరురాజ! సత్కల్పవల్లి నై
నీ కరశాఖలఁ బ్రాఁక నిమ్ము -
శ్యామల ఘన మూర్తి! చంచలా లతిక నై
నీ యురస్థలిఁ గ్రీడసేయ నిమ్ము-
క్షీ రాంబుధి వరేణ్య! శ్రీక రోర్మిక నయి
నీ గృహకన్యగా నెగడ నిమ్ము-
విశ్వగాయకా! నీ దివ్యవీణ మ్రోఁగు
ప్రణయ తంత్రీ శ్రుతి స్వర పాళి నగుచు
యోగరూప నిత్యానంద రాగలహరి
నిన్నుఁ దేలింప నిమ్ము- మన్నింపుము ప్రభు!

## 276

చిన్ని వెన్నెల పువ్వు సిగపువ్వు నీ దైన,
మూఁగ వెన్నెల నవ్వు మొవ్వ నాది-
తొలిపల్కు ముత్యాల తోరంబు నీ దైన,
గొనపుఁ దీవల చేతిగొలుసు నాది-
అందాల రతనాల హారంబు నీ దైన,
మెఱుఁగు తెన్నుల బన్నసరము నాది-
నీ రెండ నిగ్గుల వీ ర్కావి నీ దైన,
డం బైన నీ లాంబరంబు నాది-
చెడని వెలుఁగు నీది- విడని చీకటి నాది,
యెఱుక నీది- మఱపు టెఱుక నాది-
నీకు నేను ప్రకృతిలోకము- నీ కృపా
లోక మొకటె నాకు లోకము ప్రభు!

## 277

ఇంటివా ర డ్డున్న నెగిరి వత్త మ టన్న
కనికారముల త్రాళ్ల కాళ్లఁ గట్టు-
పరులు నవ్వుచు న్నన్న పరు వాఁపఁబో నన్న
కులగోత్ర భారంబు క్రుంగఁ బెట్టు-
వారు వీ రే మన్న వచ్చి వ్రాలుదు నన్న
దురభిమానము తప్పు త్రోవఁ బెట్టు-
పెద్ద లే మను చున్న వద్దఁ జేరుద మన్న
జీవనభ్రాంతులు చెఱలఁ బెట్టు-
చరణసే వాభిలాష పాశములఁ జుట్టి ,
నిన్ను మఱవంగ నీయని నియతిఁ బట్టి ,
ఇహమునకు నెట్టి, యడ్డంకు లెన్ని పెట్టి ,
ఎందు కేడ్పింతు? - దరిఁజేర్చి యేలుము ప్రభు!

## 278

కొసు వీసము చేతఁ గల్గి నన్నాళ్లను
నిను లేనివానిగా నేను గంటి-
నిరుపేద నై యింట నిల్చి నన్నాళ్లను
కలవాఁ డెవం డని కలలఁ గంటి-
ఇలు వీడి తల బోడి యిచ్చి యిన్నాళ్లను
విపినాల నెందుకో వెదకి కొంటి-
చెట్టునీడ సుఖింపఁ జేరి యీ నాఁటికి
ఘనతరుం డని నిన్నుఁ గాంచఁ గంటి-
ఇపుడు నీ యున్కి నీ కృప నెఱుఁగఁ గంటి-
లేనివాఁడ నేనే యని కానఁ గంటి-
ఉన్నవాఁడ వీవే యని యొప్పుకొంటి-
మఱవు మఱపించి యెఱు కిచ్చి మనిపితి ప్రభు!

## 279

మబ్బులో మెఱుపు పని మఱచిగి పోయితిఁ గాని
యిది చంచల యటంచు నెంచ నైతి-
మరుభూమి నీ రని పరువు లెత్తితిఁ గాని
యిది యెండమావు లం చెంచ నైతి-
ప్రకృతి సుందరి యని భ్రాంతిఁ జెందితిఁ గాని
యిది మాయకళ యని యెంచ నైతి-
జీవంబు సత మని చింతఁ జేసితిఁ గాని
యిది యనిత్యం బని యెంచ నైతి-
పరమ ధాము నిన్నుఁ గరుణాకరుని నిన్ను
ఆది దేవు నిన్ను నభవు నిన్నుఁ
జిన్మయాత్ము నిన్ను సేవింపగాఁ జాలు
తెలివి నిచ్చి నన్నుఁ దేర్పుము ప్రభు!

## 280

తల్లి దండ్రులు నీవె, యెల్ల సోదరు లీవె,
తనయులు నీవె, బాంధవులు నీవె-
ఇరుగు పొరుగు లీవె, యిష్ట సఖులు నీవె,
చదువు సాములు నీవె, పదవు లీవె-
మడుగు సొమ్ములు నీవె, మడి మాన్యములు నీవె,
పాడిపంటలు నీవె, బ్రదుకు నీవె-
వాడమేడలు నీవె, వన్నెచిన్నెలు నీవె,
భోగభాగ్యము లీవె, బుద్ధు లీవె-
భద్రపథము లీవె, పరమార్థములు నీవె,
ఇహపరంబు లీవె. యేను నీవె-
నాకు నీవు గాని తోక మేమున్నది?
కలదె నీకు నేను గానిది? - ప్రభు!

## 281

నీ కన్ను గనుపెట్ట నేఁ గందు ననుకొందు,
నగపడనీవు మోమైన గాని-
నీ నుడు లాలింప నే నందు ననుకొందు,
పై నుంప వొక్క మాటైనఁ గాని-
నీ నడవడిఁ బట్ట నే మందు ననుకొందు,
కాన నీ వడుగు జాడైనఁ గాని-
నీ యున్కిని గ్రహింప నే నుందు ననుకొందు,
నందనీ వే లీల నైనఁ గాని-
ఈవు నే నేక మని చెలులేవావు లెన్న,
ఇద్ద రొక టని పెద్దలు పద్దుసేయ,
మనకు భేదంబు లే దని మనసు చెప్ప
నమ్ముకొని యుంటి, నిటు సేయ న్యాయమె? - ప్రభు!

## 282

ఓగాము లెఱిఁగింప నానఁ బెట్టఁగ నేల?
శ్రుతి విన్నినదె నమ్మఁజూతుఁ గాని-
పాలు పంపక మని పట్టు పట్టఁగ నేల?
యిం దన్నదే పుచ్చుకొందుఁ గాని-
కలదు లే దనిపింపఁ గయ్యి మాడఁగ నేల?
పాణిఁ బట్టినఁ బ్రియ పడుదుఁ గాని-
కాదు కూడ దటంచు వాదు లాడఁగ నేల?
అడుగు నిల్పిన మంచి దందుఁ గాని-
నీవు నే నొక్కమాటగానే చరింప
ఇచ్చునది, పుచ్చుకొనునది యేమి గలదు?
ఒకటి నీ వన్న, నేను వే ఱొక్క టన్న -
చదువుకొన్న వారలు నవ్వపోగరె? - ప్రభు!

## 283

నాఁటికి నేఁటికి నడతెంచు వాఁడనే,
కరుణించు మే మైన ఘనుఁడ వైన-
వీటికి వాటికి వేధించు వాఁడనే,
యిప్పింపు మే మైన నినుఁడ వైన-
చీటికి మాటికిఁ జేసాచు వాఁడనే,
దయసేయు మే మైన దాత వైన-
అప్పటి కిప్పటి కలయించు వాఁడనే,
చదివింపు మే మైన స్వామి వైన-
ఘనులకు ఘనుండ, వినులకు నినుఁడ వైన-
దాతలకు దాత, స్వాముల నేత వైన-
పరుల వేఁ డని యర్థి నీ పాలఁ బడిన
నే మిడిన నేమి? నీ కీర్తి యినుమడి ప్రభు!

## 284

కవ లని యందురే కద! భక్తుడును నీవు-
చీకటి వెలుఁ గట్లు చేర రావొ?
దంపతు లంద్రు గదా! దాసుఁడును నీవు-
ప్రకృతి పూరుషు లట్లు పట్ట రావొ?
కనుపాప లందురే కద! కింకరుఁడు నీవు-
వల డా కడల యట్లు కలయ రావొ?
తర తము లంద్రు గదా! భృత్యుఁడును నీవు-
జీవాత్మ లట్టులు చిక్క రావొ?
అలరు జంట వేఱె, అర్ధాంగి యన వేఱె?
చూపు పాప వేఱె, చొప్పు వేఱె?
అలరు టూర్పు మలయు ముందువా యందువా?
పిలుపు లోనె పలుకు పెద్దవు ప్రభు!

## 285

నా ప్రభుండవును లీలాప్రభుండవు గాన,
మఱపించి, మరలించి మనిచినావు-
నా జన్మగాధ లానాఁటివి విప్పకు
చెప్పకు మింకఁ గన్నుఁ గప్పఁ బోకు-
నా నాధుడఁవు, జగన్నాధుండవును గాన,
వలపించి, తలపించి కలసినావు-
నా జన్మబాధ లీనాఁటివి విన్పింపఁ
గాన్పింప నింకను గలవె నాకు?
ఎన్ని జన్మము లని, యీ జన్మ మిది యని
కాలవశము వలనఁ గలిగెఁ గాని,
ఎల్ల వేళ లందు నేను నీవే కాదె?
శుద్ధ తత్త్వ మెఱిఁగి చూచితి, ప్రభు!

## 286

కోర్కె ద్రొక్కఁగ నేల, కొండ యెక్కఁగ నేల?
భవపాశలత కిది పాదు గాక-
ఆశ పుట్టఁగ నేల, అందకుండఁగ నేల?
దుఃఖవారిధి కిది త్రోవ గాక-
తలఁపు గూడఁగ నేల, దారి వీడఁగ నేల?
బాముల కిది యాటపట్టు గాక-
చింత ముట్టఁగ నేల, చిక్క కుండఁగ నేల?
అగచాట్ల కిది యాలయంబు గాక-
మనసుపడ నేల, నిలకడ మాన నేల?
జీవనంబున కిది పెద్ద చిచ్చు గాక-
అహ మనఁగ నేల, ఇహముతో నడఁగ నేల?
అభయ మిడ, వాశ్రయింతు ని న్నభవుని- ప్రభు!

## 287

పసిపాప కే బాస పాల నిప్పించెనో
కన్నతల్లికి జాలికబురుఁ బంపి-
కందున కే బాస విందు సేయించెనో
కనికారముల తల్లిఁ గడకుఁ బిల్చి-
ఎలబిడ్డ కే బాస యిష్టంబుఁ దీర్చెనో
ప్రేమంపుఁ దల్లికిఁ బిలుపు వెట్టి-
చిఱుకూన కే బాస జీవంబు నిల్పెనో
వలపుల తల్లిని వద్దఁ జేర్చి-
నో రెఱుంగని నరి జంతు వారమునకు,
వా యెఱుంగని పశు పక్షి వర్గమునకు
తెలిసె నే బాస యక్కఱఁ దీర్చి కొనఁగ,
పిలుతు నా బాస, తల్లి వై పలుకవె? - ప్రభు!

## 288

తల్లిదండ్రుల బాస వల్లించి మల్లించి
అది మూల సాహిత్య మను నొకండు-
అన్నదమ్ముల బాస నట్టిట్టు సరిపెట్టి
అది నవ్య సాహిత్య మను నొకండు-
ఆలుబిడ్డల బాస లాలించి పోలించి
అది నైజ సాహిత్య మను నొకండు-
దేశాంతరుల బాస తిలకించి పలికించి
అది దేశి సాహిత్య మను నొకండు-
ఎవ్వ రే పేరఁ బిల్చిన నేమి గాని,
పరసు లా బాస చర్విత చర్వణ మన
నాది నీది కా దనఁగ ననాది యనఁగ
నీవు దాని సేబా సందువే కద, ప్రభు!

## 289

స్తుతివీణ మొఱయించి శ్రుతి విందు లందునా,
సామగా నానంద ధామ మీవు-
ప్రణయ వేణువు నూది పద వర్గ మందునా,
సుకృత సంచయ విభాసురుఁడ వీవు-
ప్రణవ శంఖం బొత్తి పరమార్థ మందునా,
సక లార్థ సాగర స్వామి వీవు-
జీవతంత్రిని మీటి శ్రీలీల యందునా,
కల్యాణ గుణరత్న ఖనివి నీవు-
వాఙ్మనంబుల కందని వాని నిన్ను
సాహితీ గీతములఁ దన్పఁ జాలఁ గలనె?
కూర్మి పాటించి నన్నేలుకొందు వేని
ప్రేమ భావకీర్తనము లర్పింతును ప్రభు!

## 290

కంటిలో వెల్గు వై కానరా కుందువే,
కాంచనే జ్ఞానమార్గమున నిన్ను?
ముక్కులో నూర్పు వై చిక్కరా కుందువే,
పట్టనే ప్రణవ సంపత్తి నిన్ను?
నోటిలో మాట వై బైట రా కుందువే,
విలువనే పరమార్థ విపణి నిన్ను?
ఎందెలో జీవ మై యందరా కుందువే,
పొందనే యాత్మానుభూతి నిన్ను?
నీవు నా లోననే డాఁగ నేర్చి నావొ?
నేను నీ లోననే డాఁగ నేర్చి నానొ?
నీవు నేను జగంబు గా నేర్చి నామొ?
ఇఁకఁ బ్రబంధింతుఁ, బ్రస్తావ మిది గద ప్రభు!

## 291

చిఱుకూన నగు నాఁడె చేరి వాణీమాత
సాహితీ గీతాల చన్నుఁ గుడిచి-
ఎలగందు నగు నాఁడె యెలమి రమామాత
నిగ్గు బంగరు గిండి నుగ్గుఁ ద్రావి-
కడపాప నగు నాఁడె కాంచి యుమామాత
పున్నెంపుఁ గైదమ్మి బువ్వ మెసవి-
ఎడబిడ్డ నగు నాఁడె యెగసి శచీమాత
యమృత పానీయంబు లారగించి-
పద్మభవు గూడి, హరి కరాబ్జముల నాడి
శివునిఁ గృప దేఱి, యమరేంద్రు శిక్షఁ దీఱి
ఆత్మ పెంపునఁ గవిరాజహంస నగుచుఁ
బరమధాముని నీ పాలఁ బడితిని ప్రభు!

## 292

సాహితీ వల్లరుల్ సరిగూర్పఁ గోరితే
వెఱ్ఱివాఁ డందురా విన్నవారు?
వేదప్రసూనముల్ విరియింపఁ జూచితే
విభ్రాంతుఁ డందురా వెనుకవారు?
ప్రణయ ఫలంబులు పండింప నెంచితే
పిచ్చివాఁ డందురా పెద్దవారు?
ఉపనిష త్సారంబు లొలికింపఁ దలఁచితే
వెంగలిఁ డందురా వీటివారు?
శ్రీవిభుఁడ వీవు, నేను నీ సేవకుఁడను-
కలదు దయ నీకుఁ, బదభక్తి గలదు నాకు-
మెచ్చికోమంచుంటి వీవు, నే నిచ్చుచుంటి-
ఎవ్వ రే మన్న నీకు నా కే మింక? - ప్రభు!

## 293

గాలివాన మరల్చి మేలిల్లు నిలిపితి
దుడుకు మాటలకుఁ దుందుడుకుఁ గొనక-
ఆమయంబు లడంచి యభయం బొసంగితి
కీడుమాటలఁ గోపగించు కొనక-
కష్టంపుఁ దెర దింపి కడలఁ గాన్పించితి
పరుసంపు మాటల పాటి గొనక-
లేముల నెండించి నోములఁ బండించి
తుడుకుమాటల మీఁద నుంచుకొనక-
ఇంటి వేల్పు వన్న, వెంట వెజ్జ వటన్న
కంటిపాప వన్నఁ గాఁప వన్న
నీవె కావె, దాసు నిఖి లాపరాధముల్
కూర్మిఁ గాచి యేలుకొంటివి ప్రభు!

## 294

అన్నా! యటందురు కన్నవా రెల్లను
జగదీశ! నీ కెంత జాలి లేదొ-
పాప మటందురు ప్రక్కవా రెల్లను
పరమేశ! నీ కెంత కరుణ లేదొ-
నిట్టూర్పు చుందురు చుట్టువా రెల్లను
నిఖిలేశ! నీ కెంత నెనరు లేదొ-
వింత యటందురు విన్నవా రెల్లను
ప్రాణేశ! నీ కెంత బాళి లేదొ-
దీనజనులఁ బ్రోవ దిక్కు నీ వందురు,
భక్త జనుల పాలి భర్త వంద్రు-
ఒంటి మిడుకఁ బెట్టి మింటఁ గూర్చుంటివా?
రెప్ప కంటిఁ గావఁ దప్పునె? - ప్రభు!

## 295

తోడివారల నెప్పు లాడితిఁ గాఁబోలు
పలుకరించితి నని కులికె దేల?
భువనసుందరుఁ డని పోల్చితిఁ గాఁబోలు
వలగొంటి నని చెప్పవత్తు వేల?
శ్రీపతి వీ వని చెప్పితిఁ గాఁబోలు
పతిని నే నని వెంటబడుదు వేల?
మునిజనంబులఁ గూడి మ్రొక్కితిఁ గాఁబోలు
దక్కితి నని కాలు ద్రొక్కె దేల?
జ్ఞానయోగి మణుల సంసార ముక్తులఁ
జేరి పతి నటంచుఁ జెప్పి నట్లె
దాసమణిని నన్ను దయఁ జూడఁ దలఁచితే!
మాయప్రకృతి నేమి సేయుదు ప్రభు?

## 296

లేఁడు లేఁ డను వారి జాడఁ జూడఁగఁ బోవ
మున్నవాఁ డన్నదే యూరు నాది-
పూర్వపక్షుల నీడఁ బొంచి కాంచఁగఁ బోవ
విశ్వాస మన్నదే విడిది నాది -
సంశయ గ్రస్తుల జట్టుఁ బట్టఁగఁ బోవ
ధీశాంతి యన్నదే తెన్ను నాది-
అనుమాన కోశంబు లందుఁ గుందఁగఁ బోవ
సద్భక్తి యన్నదే చదువు నాది-
పౌరుషాంధులఁ గల సైనెఁ జేరఁ బోవ
దైవబల మన్నదే కన్నతల్లి నాది-
దైవ మమ్మును, జగముల తండ్రి యనుచు
నమ్మి నిన్నుఁ గొల్చు.పని నాది- వాఁదగు ప్రభు!

## 297

శ్రుతి నైన నే యుపశ్రుతి నైన ప్రతి నైన
నింగితంబుగ నైన నెఱుక నిమ్ము-
స్మృతి నైన లోకవిస్మృతి నైన మతి నైన
స్వప్నంబు నం దైనఁ జనవు నిమ్ము-
కృతి నైన నే యలంకృతి నైన నుతి నైన
భావంబు నం దైన పదము నిమ్ము-
ధృతి నైన నిచ్ఛాభిరతి నైన నతి నైన
నేకాంతమున నైన నిష్ఠ మిమ్ము-
వ్రతిని గా నైన నీ నామ వర్ణమాలఁ
బ్రతి నిమేషంబు స్మరియించు భక్తజనుఁడ,
యతిని గా నైన నీ కీర్తి కృతులు గూర్చి
ప్రకట గతిఁ బాడి,పాడించు సుకృతిని ప్రభు!

## 298

ఎవ్వారి నిఁక నాశ్రయింతును నినుఁ గాక
తెలిసి నా మనసు భేదించినావు-
ఎవ్వారి మఱఁగి పోయెదను నిన్నే కాక
చిటికలో నా బుద్ధిఁ జెఱిచి నావు-
ఎవ్వారి కడ డాఁగ నెంతు నీ కడఁ గాక
త్రుటిలోనఁ జిత్తంబు దోచినావు-
ఎవ్వారితోఁ జెప్పి యేడ్తు నీతోఁ గాక
కడకు నా యహమికఁ గాల్చినావు-
నా సఖుల నెల్ల నా కెడఁ జేసినావు
ఒంటికత్తె నై యింట నే నుందు నోయి
యంద ఱే మైన నిన్ను రమ్మందు నోయి
వట్టి ప్రాణాలు నీ కిచ్చి పైతును ప్రభు!

## 299

చేతి కందఁగ రాని చెట్టు పువ్వైతివే
వింతగా నన్నిట్లు వేఱు సేసి-
కంటి కందఁగ రాని మింటి చుక్కైతివే
తమి గొల్వ నన్నిట్లు దవ్వు సేసి-
చింత కందఁగ రాని సిగబంతి వైతివే
పుడమి పై నన్నిట్లు మిడుకఁ జేసి-
శ్రుతుల కందఁగ రాని సురగాన మైతివే
బొందెలో నన్నిట్లు కుందఁ జేసి-
జగముపతి వంద్రు, జీవరక్షకుఁడ వంద్రు
పరమగతి వంద్రు, పరమార్థపరుఁడ వంద్రు
జ్ఞాను లే మన్నఁ గా దనఁ జాలఁ గాని
నీవు మాయాపతి వటందు, నిజముగ ప్రభు!

## 300

తమ్ముండు గాఁబోలు! - ధర్మరాజవు నీవు,
పద ముంప నేల నీ పట్టణమున?
అనుజుండు గాఁబోలు! - నమరాధిపతి వీవు,
ఆఁగ - నీ వాడ నిత్యంబె నాకు?
జామాత గాఁబోలు! - చతురాస్యుఁడవు నీవు,
వాణితోఁ జెప్పి పో వచ్చినాఁడ-
జనకుండు గాఁబోలు! - జగదంబపతి వీవు,
దంపతులకు మ్రొక్కి తరలు వాఁడ
మామ మామవు గాఁబోలు! - మాధవుఁడవు,
భువనమాత యాజ్ఞను గొని పోవు వాఁడ-
ననుచు నాత్మాంశుమంతుల యుంపకమున
సచ్చిదానందు నిన్నుఁ గొల్వ వచ్చితి ప్రభు!

## 301

నారదాదుల కరుణారస మందునే!
ప్రకట భక్తిప్రచారకులు వారు-
వామదేవాదుల వాత్సల్య మబ్బునే!
తత్త్వవిజ్ఞాన సాధకులు వారు-
సనకాదుల కృపాప్రసాదంబు దొరకునే!
నిత్య సత్యజ్ఞాన నిధులు వారు-
శ్రీశుకాదుల పాదసేవ లభించునే!
దివ్యయోగీంద్ర వందితులు వారు-
ఆ మహాత్ములఁ గొల్చు నభ్యాస మందె
నన్ను మఱచెడి మఱపులో నిన్నుఁ గొల్తు,
నిన్నుఁ గొల్చెడి తెల్విలో నన్ను మఱతు-
అది తుది పదంబు త్వత్పద మందఁగ ప్రభు!

## 302

సృష్టి స్థితి లయ ప్రసిద్ధులు నీవైన,
స్థితి యొక్కటే నాకు జీవగఱ్ఱ-
నిన్న నేఁడును రేపు నన్నవి నీవైన,
నేఁ డొక్కటే నాకు నిలువ నీడ-
ధర్మార్థకామ సూత్రంబులు నీవైన,
అర్థ మొక్కటియె నా కంగబలము-
కాలంబు దేశంబు కారణాల్ నీవైన,
నా దేశ మొకటె నా యాత్మ పదము-
మూఁడు గుణములు నీవైన వాఁడు చూడ
నడిమి గుణ మొక్కటియె విదానంబు నాకు,
భుక్తి భక్తి ముక్తులు నీ విరక్తులైన
భక్తి యొక్కటె నాకుఁ బ్రాపక మగు ప్రభు!

## 303

సామి సామే నని సహచరుల్ వినుతింప
వలఁ గొని తనువల్లి పులకరించు-
భర్తఁ జూపు మటంచు బంధువుల్ ప్రశ్నింప
వెల్తిఁగాఁ జూపులు విన్నుఁ బ్రాకు-
ప్రియు నేలుకొ మ్మని పెద్దలు దీవింప
సిగ్గుచేఁ జేదోయి మొగ్గ గట్టు-
పతిపేరు చెప్పింపఁ బ్రమద లుద్యోగింప
వ్రీడచే నాలుక విరియఁ జూచు-
కొలు వొసంగ వైతి, కొనకంటఁ బడ వైతి
నిలువ వైతి, పేరు నిలుప వైతి-
సతిని, దాసురాలి, సానురాగ, విముగ్ధ
నోమ కెచట నొంటి నుంటివి? - ప్రభు!

## 304

భక్తిపద్య రసంబు పాద్యంబుగాఁ గొని
జీవనం బమృతంబుఁ జేసినావు-
సుజ్ఞానపద్య ప్రసూనమాలికఁ గొని
వాసనల్ విరియంగఁ జేసినావు-
వైరాగ్యప ద్యోపహారంబుఁగైకొని
చింతాభ్రమలు వేఱు సేసినావు-
పరమార్థ పదభావ పరమాన్నమును గొని
చిరసుఖశ్రీ లందఁ జేసినావు-
జీవి గృహి యఁట, యతిథియే దేవుఁ డంట-
సుకృతి యాతిథ్య మఁట- యిటఁ జోద్య మున్నె?
జీవ జీవేశ్వ రైక్యంబుఁ జెప్పికొన్న,
శ్రీపదంబుగ నా యిల్లుఁ జేసితి ప్రభు!

## 305

నీ నడవడి నెన్న నేఁ బూనకుందునా
కర్మంపు టడవులు గట్టినావు-
నీ మీఁదఁ గనుపెట్టి నేఁ గానకుందునా
చీకటితెర యొడ్డుఁ జేర్చినావు-
నీ పల్కు సవ్వడి నే వినకుందునా
పెనుగాలి సుడిమళ్లఁ బెట్టినావు-
నీ లీలల గ్రహింప నే నేరకుందునా
ప్రకృతిజాలము ముందు పఱచినావు-
మంచి వేటకాఁడ వం చిఁక వినుతింతు
పుట్టుచెట్టు వెనుకఁ బొంచి పొంచి
మోక్షబాణ నిహతి ముంగోలు జీవాల
గుత్త కొనక విడిచి కొందువె? - ప్రభు!

## 306

గుణము మంచి దటంచుఁ గోవిదు లందురు,
గుణలతికల నమ్మఁగూడు నయ్య?
మనసు మంచి దటంచు మహనీయు లనియెద
రీ మనోలత నమ్మ నెంతు నయ్య?
జన్మ ముత్తమ మంచు సర్వజ్ఞు లందురు
జన్మంపు లత నమ్మఁ జను నటయ్య?
తనువు శ్రేష్ఠ మటంచు తత్త్వజ్ఞు లందురు
తను లతికల నమ్మఁ దగు నటయ్య?
జీవవనజాతలతలు సంజీవిలతలు;
ఇవి సువాసనా సుమలత లింత యొఱఁగి,
యే లతను విచ్చికొందు? నీ కిష్ట మున్న
జ్ఞానధన మిచ్చి కొన నమ్మఁజాలుదు ప్రభు!

## 307

ఆగమవల్లీ లతాంత డోలికలలో
వాణివర్ధన ఊప్పు వాల్చినావొ?
సుజ్ఞానవల్లికా సుమడోలికలలోన
గౌరి వీవన నిద్రఁ గాంచినావొ?
ఆనందలతికా ప్రసూన డోలికలలో
సిరి మేలుకొనఁ గూర్కు జెందినావొ?
పరమధా మానంత భద్రడోలికలలో
మూలశక్తికిఁ గన్ను మూసినావొ?
భవ్య పదభక్తి, పరమార్థ భావయుక్తి,
ప్రవిమ లానంద సూక్తి నిన్ బలుకరింపఁ
బలుక వేమి? మా యమ్మలు దెలుప రేమి?
యోగనిద్రయా, బిడ్డల నోమక? - ప్రభు!

## 308

ఒక నాఁ డనఁగ నేల? యున్న నాళ్లెల్ల నీ
యేకదేశంబుగా నెంచుచుంటి-
ఒక పక్ష మన నేల? యుభయపక్షములు నీ
ప్రబల సైన్యములుగాఁ బంచుచుంటి-
ఒక మాస మన నేల? యున్న మాసములు నీ
సామంతులుగఁ జేసి సరుదుకొంటి-
ఒక వర్ష మన వేల? సకల వర్షములు నీ
జీవలోకంబుగాఁ జేసికొంటి-
ఒక్క యుగ మన నేటికి? యుగయుగములు
నీకె యుపభోగములు గాఁగ నిలుపుకొంటి-
దంటవై యిన్నియును గొని, కొంటె వగుచు,
కంటఁ బడకుండ మమ్మేలుచుంటివె? - ప్రభు!

## 309

కులమిచ్చి మెప్పించు గొప్ప నా కున్నదే
సదమ లాదిమగోత్ర జనక! నిన్ను?
పద మిచ్చి మెప్పించు బలము నా కున్నదే
సర్వలోకాధిప జనక! నిన్ను?
శ్రీ లిచ్చి మెప్పించు చేవ నా కున్నదే
సత్య నిత్యైశ్వర్య జనక! నిన్ను?
చదు విచ్చి మెప్పించు శక్తి నా కున్నదే
సకల విద్యాకళా జనక! నిన్ను?
విశ్వరక్షక! నినుఁ గొల్చు విద్య యొకటి
పిన్న నాఁడె మా యమ్మ నేర్పించె నాకు-
పేద నగు నాకుఁ గల నాఁటి ప్రేమ నీయఁ
దగ దనఁగ నేర్తె? ననుఁ గన్న తండ్రివి, ప్రభు!

## 310

బైలు నీ రూప మై ప్రకటించునే నిన్ను,
నిండి నీ వండఁగా నుండ కున్న?
గాలి యదృష్ట మై కదలించునే నిన్ను,
సంస్పర్శ మై నీవు సాక కున్న?
అగ్ని నిరాశ్రయ మై ముట్టునే నిన్ను,
దాహంబ వై నీవు దరియ కున్న?
నీరు నిస్సరణ మై చేరఁ గల్గునె నిన్ను,
పద మిచ్చి నీవు కాపాడ కున్న?
పుడమి నిర్భర మై నిన్నుఁ బొంద గలదె,
భారముల భార మై నీవు పట్ట కున్న?
ఇందునె ప్రపంచ మీ వనుకొందు నోయి,
భూత సంసృష్టి నీ దని పోల్పక ప్రభు!

## 311

నీర మై సార మై నిర్మ లోదార మై
భువన మండలముల ప్రోచు నెద్ది?
నిత్య మై సత్య మై నిగమ సంస్తుత్య మై
విశ్వ మంతటను నిండి వెల్గు నెద్ది?
హృద్య మై వేద్య మై యిష్ట సంపాద్య మై
దివ్య భక్త్యమృత మందియ్య నెద్ది?
బాధ్య మై సాధ్య మై పరమార్థ బోధ్య మై
సుజ్ఞాన మణిదీప్తిఁ జూపు నెద్ది?
ఆ పరపదంబు, వర పరమార్థ పదము
సత్య నిత్యైక పదము, శాశ్వతపదంబు
పరమధామ పదంబు, సద్గురు పదంబు
శ్రీపదము, త్వత్పదము నాకుఁ బ్రాపగు ప్రభు!

## 312

బత్తి పూవులతోఁట బాటసారివి నీవు,
వలపుల పాటల వాఁడ నేను-
కూర్మి పిల్లనగ్రోవి కొసరించు సార మీవు,
వరుసల రాగాల వాఁడ నేను-
తెలివి విన్నుబవంతి తెలిబంతి నడ వీవు,
వన్నెల వెన్నెల వాఁడ నేను-
చదువుల వినువాక చాలు పుట్టుక వీవు,
వ్రాఁతల యీఁతల వాఁడ నేను-
ముత్తి ముత్తవ్వ మెప్పుల పొత్తు వీవు,
ఇంత నంతన మనుమల దొంతి నేను-
అవ్వ నెవ్విధిఁ గానఁగా నగునొ నాకు?
నాకుఁ గల యాశఁ దీర్తు వీవే కద ప్రభు!

## 313

భూతప్రపంచ ప్రబోధ గాథల విని,
దక్కె నీశుం డని తలంతుఁ గాని-
ప్రకృతి మనోజ్ఞ నర్తనల సవ్వడి విని,
కదలె నిమ్మం డని కాంతుఁ గాని-
ప్రణవ నా దానంత పదకీర్తనల విని,
తలసూపె విభుఁ డని తలఁతుఁ గాని-
ప్రామిన్కు మువ్వల పావల రొద విని,
అడుగిడె నా పతి యందుఁ గాని-
బాహ్య జగముల సందడిఁ బడుదుఁ గాని,
నీవు దయచేసి నను గరుణించి నావె?
వచ్చితివొ లేదొ కను తెల్వి నిచ్చినావె?
నాకు మతి యున్నె నీ వచ్చు దాఁకను ప్రభు!

## 314

దుష్కృతుల్ చేసిన దోషిని, నా వ్రాఁత
యేమి కానున్నదో యే నెఱుంగ-
నేరముల్ చేసిన నికృతిని, నా కర్మ
మేమి కానున్నదో యే నెఱుంగ-
పక్షాలఁ బెంచిన పాపిని, నా కాల
మేమి కానున్నదో యే నెఱుంగ-
వేసాలు వేసిన వెఱ్ఱిని, నా జన్మ
మేమి కానున్నదో యే నెఱుంగ-
ఎప్పు డేమి కానున్నదో యెఱుఁగ లేక,
ఇప్పు డేమి కావచ్చునో యెఱుఁగ లేక,
ఈవె దిక్కని నిన్నాశ్రయించినాఁడ-
ఎట్లు లున్నదొ నీ కృప యెఱుఁగను ప్రభు!

## 315

నింగి నవ్వులు నించె నినుఁ గాంచి, కా కున్న
మిలమిల చుక్క లేమిటికిఁ దోఁచు?
వని పుల్క లొలయించె నినుఁ గాంచి, కా కున్న
మృదు లతాంతంబు లేమిటికిఁ దోఁచు?
నీరధి మిను ముట్టె నిను గాంచి, కా కున్న
పటు తరంగమ్ము లేమిటికి ఁ దోఁచు?
నేల పట్టముఁ గట్టె నినుఁ గాంచి, కా కున్న
నిటు సస్యలక్ష్మి లేమిటికిఁ దోఁచు?
ప్రకృతి నిన్ను గాంచి భ్రమియించెఁ గాఁబోలు,
కాక యున్నఁ బ్రణయ గాథ లేల?
విశ్వ మెపుడు నిన్ను వేఁడుఁ గాఁబోలుఁ, గా
దేని ప్రణవ గాన మేటికి? - ప్రభు!

## 316

నవ్విపోదు నటంచు నడతేరవో యేమొ,
చిదచిదాత్మున కిది చేష్ట గాదు-
రవ్వ సేయుదు నని రాకుంటివో యేమొ,
మహితాత్మునకు నిది మతము గాదు-
సువ్వి పాడుదు నంచు చొరకుంటివో యేమొ,
ప్రణవాత్మునకు నిది పాడి గాదు-
త్రవ్వి యెత్తుదు నంచు తలసూపవో యేమొ,
విశ్వాత్మునకు నిది విధము గాదు-
ప్రకృతిమాయల కెందు లోబడని నీకు,
బంధనంబుల కెటు చిక్కుబడని నీకు
భక్తమణి కింతగా భయంపడగ నేల?
దర్శనము చాలు, నే మనుదాసను ప్రభు!

## 317

పాత కుండను దెచ్చి పాద్యంబు లందునా-
పావ నాంబువులే యీ జీవనములు?
రాలు గాయను దెచ్చి రసఫలా లందునా-
సేవ నార్ఘ్యములె యీ చిలుక కొట్లు?
అంటు గట్టను దెచ్చి యంబరా లందునా-
చీ నాంశుకములె యీ చినుగు కుట్లు?
తంబాకు గుడ దెచ్చి తాంబూల మందునా-
కపురంపు విడెమె యి క్కారు గుడము?
ప్రబల పాతకుండ, బలు రాలుగాయను,
అంటుకొన్న వాఁడ, నాకులుండ-
సుతుఁడ నన్నుఁ బ్రోచి పతిత పావనుఁ డను
నీదు బిరుదు నిల్పుకోఁ దగు ప్రభు !

## 318

కంటి మింటను తారకల వితానము దోఁచె,
విచ్చేయుఁ గాఁబోలు విభుఁడు నేఁడు!
ఎడఁద పాల్కడలి పొం గడరి మి న్నందెను,
త్రైలోక్యపతి బైలు దేఱఁ బోలు!
తలఁపు చివుళ్లు పచ్చల తోరణాల్ గట్టె,
పాడసూపు వేళ గాఁబోలు స్వామి!
వల మేని కోన పుల్కల పూల దండలు
మెం డయ్యెఁ, బతి వచ్చుచుండఁ బోలు!
కన్ను లున్న ఫలముఁ గాంతు- నిన్ గాంతును,
కోర్కి దీఱ భక్తిఁ గొలుతుఁ- గొలుతు,
భావ నాభి రాముఁ బ్రణుతింతుఁ- బ్రణుతింతు,
రమ్ము, దాసు నేలికొ మ్మిఁక ప్రభు!

## 319

నరుఁ డహంకారి యై తరము నెన్నఁడు గాని,
ఇతరులఁ బ్రోవఁ దా నెంత వాఁడు?
మనుజుండు ధనగర్వ మతి నెఱుంగఁడు గాని,
ఇతర చింతలఁ దీర్ప నెంత వాఁడు?
మర్త్యుండు నిజశక్తి మా టెఱుంగఁడు గాని,
ఇహమున నిల్పఁ దా నెంత వాఁడు?
జీవుండు తన లోటు చెప్పఁ బోవఁడు గాని,
మృత్యువు నాపంగ నెంత వాఁడు?
ప్రోచుటకుఁ, దీర్చుటకుఁ, దన్నుఁ గాచుటకును-
జగతి బ్రతికింప, సుఖములు సంతరింప-
ఈవు గా కున్న దాసున కెవరు గలరు?
ఓమ, దరిఁ జేర్ప దిక్కు నీ వొకఁడవె ప్రభు!

## 320

అరి గణంబుల లోన నడు గుంప, నైనను
సాధు గణమ్మె నా సాము నోము-
కావి గోచిని గట్టు ఘనయతిఁ గా, నైన
నియతి మై యతి గూర్ప నేర్తు నేనె-
అని సేయఁగాఁ బ్రాసమును దాల్ప, నైన నే
ప్రాస మైనను నాకుఁ బట్టుఁ గొమ్మ-
ఒరు ప్రసాదమునకు బరువెత్త, నైనను
నాకుఁ బ్రసాదగుణమ్మె సొమ్ము -
జీవిత ప్రబంధ శేష సంగరములో
గణము, యతియుఁ, బ్రాస, గుణము నగుచు
పరప భక్తిఁ ద్వ త్ప్రసాదంబుఁ గైకొని
అసమ కావ్యకీర్తి నందుదు ప్రభు!

# బాలాంత్రపు వేంకటరావు గారు విజయవాడ రేడియోలో చదివిన భావసంకీర్తన పద్యాల ప్రథమ పాదాలు:

| | | పద్య సంఖ్య |
|---|---|---|
| 1 | వలపు పుట్టిన పచ్చి వ్రాలదా యెలదేఁటి | 117 |
| 2 | నుడి మిన్కు ముత్యాల గొడుగుఁ బట్టితి నోయి | 205 |
| 3 | జగదేక కవి నని నిగమరత్న సువర్ణ | 74 |
| 4 | పుట్టు పొత్తంబు విప్పుదువు కాఁబోలునే | 112 |
| 5 | చిదిమిన పత్ర మర్పింపఁగా రా దను | 184 |
| 6 | పూ లిచ్చుకొను టేను, పూజ లందుట నీవు | 202 |
| 7. | ఒడ లెఱుంగని చింతఁ బడజాలఁ బడజాల | 124 |
| 8 | నడి సముద్రమున నా నావఁ ద్రిప్పులు వెట్టి | 125 |
| 9. | ముగురి పెద్దలఁ జేసి ముఖపత్రమును వ్రాసి | 219 |
| 10. | అడిగిన గాని యమ్మైన బెట్ట దటంద్రు | 257 |
| 11 | ప్రభు గోపురము పూర్ణ భక్తిచే గట్టించి | 106 |
| 12 | చదల మక్కల పేరి జపమాల లీవోయి | 111 |
| 13. | పదము పట్టింపఁగా, భక్తి రెట్టింపఁగా | 101 |
| 14 | భావాల వెంటనే పరువెత్తు పదములు | 99 |
| 15 | నాఁడు నా మనుగడ నడుపంగ నిచ్చిన | 157 |
| 16. | ఒక రూప మైన నీ కున్నదే యంటివా | 251 |
| 17. | గతులు దీర్పఁగ నెంచి గజ్జె గట్టితిఁ గదా | 169 |
| 18 | ఒంటి నే నని నొచ్చుకొంటిని గాఁబోలు | 128 |
| 19. | పలుకుఁ జక్కెర పాట కళ సొంపా, చెవి కింపా | 68 |
| 20. | ఆకాశ మొక పదం, బవని రెండవ పదం | 183 |
| 21 | నింగి నవ్వులు నించె నినుఁ గాంచి, కాకున్న | 115 |

---

# అనుబంధం

I ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్టసభ్యత్వం

II జంటకవికి వీడ్కోలు

III సినారె సన్నుతులు

IV వేంకటపార్వతీశ్వర రామాయణము

"నాకు ఈ మహాకవితో దాదాపు 64 సంవత్సరాల ప్రియ బంధం— గాఢమైనది, అత్యంత సన్నిహిత మైనదీను— 1908నుంచి.

వీరి కవిత్వప్రభావం నామీద నా చిన్నతనంలో చాలా గాఢంగా పడింది.

x x x

వీరి పద్యకృతులే కాదు, వీరి నవలలుకూడా ఎంత వెర్రిగా చదివేవారమో!

ఆ నవలల్లో కథలకన్నా కూడా నావంటి వారికి వానిలో వచ్చే గీతమాలికలు, గేయాలు అంటే మతిపోయేది.

x x x

.పరజాడవారి వెనువెంటనే వచ్చిన వైతాళికులు వీరు."

—కృష్ణశాస్త్రి

(మదరాసు AIR వారి 'శ్రద్ధాంజలి' కార్యక్రమంలో
చదివి వినిపించిన సందేశం నుంచి)

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

## విశిష్టసభ్యత్వ ప్రదాన సమావేశము

7-1-1967



శ్రీ బాలాంత్రపు వేంకటరావు గారిని గూర్చి

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి
అధ్యక్షతను

డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారు చేసిన
ప్రశంస

## శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు

ఇరువదవశతాబ్ది యారంభమున మధురప్రసన్నమైన కవిత్వము చేతను, పుంఖానుపుంఖముగా వెలయించిన నవలా నాటకముల చేతను ఆంధ్రలోకము నపూర్వ సారస్వత చైతన్యముచే నుత్తుంగతరంగితము నొనర్చిన కవిద్వయమున ప్రథములు శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు ప్రాగ్గోదావరీమండలము నందలి పిఠాపురమునకు సమీపమునఁ గల మల్లాంలో జన్మించి (2-1-1881) సంప్రదాయసిద్ధముగా నాంధ్రగీర్వాణ కావ్యముల నభ్యసించి, బహు నవలానాటకకర్తలై, కవికులాలంకారులై, కృతిభర్తలై, ప్రభుత్వము చేతను, పండిత పరిషత్తుల చేతను, సంస్థానాధీశ్వరుల చేతను, సగౌరవముగా సత్కరింపఁబడి, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయ సంస్థాపకులై, ఆంధ్రసారస్వతమునకును, తద్ద్వారా ఆంధ్రప్రజానీకమునకును అపార సేవ కావించిన కవిరాజహంసలు శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు

ఆధునికాంధ్రదేశమున పలువురు జంటకవు లేర్పడినను నిజముగా నా నామమున కర్హులై ఆంధ్రశారద కనవరత వరివస్య నాచరించిన వారిర్వురు మువ్వురుకంటె నెక్కువమంది లేరు. వారిలో శ్రీ తిరుపతివేంకటకవుల సరస నాసీనులు కాఁదగిన వారు శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు. వారిర్వురిలో నెవ్వరిని గూర్చి యేది చెప్పినను అది యిర్వురికిని సమముగా నన్వయించునట్టిదే

వారు కావ్యములు కల్పించిరి, నవలలు వెలయించిరి. నాటకములు నిర్మించిరి, అన్నిటికన్న మిన్నగా నాంధ్రప్రచారిణీ గ్రంథనిలయమును స్థాపించి యందు శతద్వ యాధిక పద్యగద్య రచనలు ప్రకటించి జనసామాన్యమున కాంధ్రసారస్వతముపై మేదురమైన యాదరము కలిగించిరి. ఈ గ్రంథనిలయము ద్వారా వారొనరించిన యాంధ్రసారస్వత ప్రచారము సంతత స్మరణీయ మైనది.

శ్రీ వేంకటరావుగారు రచించిన రూపకములలో ధనాభిరామసతీసంయుక్తాదులు ముఖ్యము లైనవి. అవి రసపాత్రపోషణ సంవాదసౌందర్యముల కాలవాలములు. వారి పద్యకావ్యములలో ఏకాంతసేవ మొదట పేర్కొన దగినట్టిది. అది ఆంధ్రమునందలి

భావకవితారీతికి శ్రీకారము చుట్టిన సరససుందర గీతికావ్యము వారి కావ్యకుసుమ హారావళు లెంత సరసము లైనవో అంత రసప్రపూర్ణములు లైనవి బృందావన మను ప్రబంధమందును, భాగసంకీర్తన మను భక్తికావ్యమందును, రత్నహార శ్రీరామ రాజనీతులందును వారి కవితాలతాంగి వింత విభ్రమములు ప్రదర్శించినది వారి జాతీయగీతము దేశభక్తి కాలవాలము వారు రాజభక్తియును పద్యకావ్యమును పట్టాభిషేకసమయమున పంచమ జార్జి చక్రవర్తి కంకితముచేసి ప్రభూతగౌరవ సత్కారము లందిరి రసమునకు ప్రసాదగుణమునకు, ధారాశుద్ధికి తత్త్వోపదేశమునకు, పదప్రయోగలాలిత్యమునకు భావగాంభీర్యమునకు పట్టుగొమ్మలై వారికావ్యములు ముట్టినవారి నెల్ల మైమఱపించును

దశసహస్రపద్యప్రమితముగా నిర్వచనముగా రామాయణ మహాకావ్యమును రచించుటచే శ్రీ వేంకటరావుగా రిప్పుడు విద్యావిజ్ఞానములం దపర వల్మీకసంభవులై విరాజిల్లుచున్నారు

శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల నవల లాంధ్రదేశమున నాబాలగోపాల విదితములు. అందు కొన్ని అనువాదములు, కొన్ని స్వతంత్రములు భాషచే, భావములచే, కథాకథన కామనీయముచే, పాత్రపోషణపాటవముచే నారోజులలో నవి ఆంధ్రప్రపంచమం దగ్రగణ్యములై యలరారినవి సురసావసుమతీవసంతములతో నారంభించిన వారి నవలా పరంపర సుమా రఱువది డెబ్బదివఱకు సాగి బహుజనపరితమై బహుపరీక్షలకు బహువారములు పాఠ్యమై ఆంధ్రదేశము నానంద పరవశము గావించినది స్వతంత్రములు ననూదితములు వైవిధ్యశోభితములు నైన పెక్కు నవలలు రచించి ఆంధ్రమున నాజాతి సారస్వతమున కారంభమున నపారాభ్యుదయము కలిగించినవారు శ్రీ వేంకట పార్వతీశ్వరకవులే

వేంకటపార్వతీశ్వర కవులు నవలలనేకాక పెక్కు గద్యకావ్యములను కూడ రచించియుండిరి అందు శివపురాణమును బ్రహ్మపురాణమును గణనీయము లైనట్టివి

వారు సృష్టించిన బాలవాఙ్మయము పలువురి ప్రశంసలకు పాత్రమైనది ఆరోజులలో వారు రచించిన బాలగీతావళులను పఠించని బడిపిల్లలు లేరనుట సత్యదూరముకాదు

బాలబాలికలకై వారు సరళసుందరవచనమున రచించిన రామాయణ, భారత, భాగవతములు బొమ్మలతోకూడ ముద్రితములై బహుళప్రచారము నందినవి.

వేంకటపార్వతీశ్వరకవులు కృతికర్తలేకాక కృతిభర్తలుకూడను. షష్టిపూర్త్యుత్సవ సందర్భమున పూజ్యులు శ్రీ శివశంకర స్వామివా రా జంటకవులకు తమ కృతికన్య నర్పించి యావిధముగనైన యల్లుండ్రులేని లోపము తీర్చుకొనిరి.

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు పొందిన గౌరవసత్కారము లనేకములు. సుమారు నలువది యేండ్ల క్రింద నరసారావుపేటలో నాంధ్రసారస్వతపరిషత్తు మహాసభాముఖమున వారిని కవిరాజహంసబిరుదము నొసంగి గౌరవించినది. షష్టిపూర్త్యుత్సవ సందర్భమున శ్రీ శొంఠి రామమూర్తి పంతులవారి అధ్యక్ష్యముతో రాజమహేంద్రవర మందు జరిగిన మహాసభలో ఆంధ్రప్రజలు వారిని కవికులాలంకార బిరుదవిభ్రాజితులఁగావించిరి. ఆంధ్రదేశమందలి సంస్థానాధీశ్వరులు వారిని పలుసార్లు గౌరవపురస్సరముగా నాహ్వానించి అర్హసత్కారము లాచరించిరి. ఆంధ్రభోజులు శ్రీ పిఠాపుర మహారాజులుంగారు వారికి ప్రతిమాసము శతరూప్యములు పారితోషికముగా నొసంగి తమ వదాన్యతకు వన్నె దిద్దుకొనిరి. కేంద్రప్రభుత్వముకూడ నట్లే శ్రీ వేంకటరావుగారికి మూడేండ్లు ప్రతిమాస శతరూప్య పారితోషికము నొసంగి తన ఔచితీపరిజ్ఞానమును ప్రకటించుకొన్నది.

శ్రీ వేంకటరావు గారు విద్యావయోవృద్ధులు. ఆధునిక కవులలో పలువురికి పరోక్షగురుపుంగవులు. కవిరాజహంస సార్థకబిరుద విభ్రాజమానులు.

కవులేకాక కథకచక్రవర్తులు; పండితులేకాక పరతత్త్వవేత్తలు; సంప్రదాయజ్ఞులేకాక సకల నూత్నప్రక్రియా ప్రియులు. పండిత పామర బాల వృద్ధజన మనోరంజనచణ రచనాప్రవీణులు.

అధ్యక్షమహాశయా! ఏతాదృశ గుణగణభూషితులైన శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారి కాంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ విశిష్టసభ్యత్వముతోపాటు తచ్చిహ్నమైన అమూల్యాంబర స్వర్ణపతకములను గూడ సమర్పింప వేఁడుకొనుచున్నాను.

## II

# జంటకవికి వీడ్కోలు

వేంకట కవిరాజహంస 1955లో పార్వతీశ కవిరాజహంస స్వర్గస్థులైనపుడు, తన 'సంతాపము' వెలిపుచ్చుతూ-

''పోయి రమ్మని చెప్పబోను, నీ కడనుండి
ఓయి రమ్మని పిల్చుచుంటి వేమి?
ఒంటిగా స్వర్గాన నుండుటయును గూడ
నొల్లక నను బిల్చుచుంటి వేమొ!
వ్రాయుచు నున్న రామాయణం బిటు వీడి
యేను వచ్చిన లోక మేమి యనును?
రావు గంగాధర రామాజ్ఞ విడనాడి
నడుమనే వచ్చుట న్యాయ మయ్యా?
నాదు జీవిత యుద్ధకాండము ముగించి,
చెంతకే వత్తు బావ!* నే నింతలోనె-
కల్పకారామ సుందరకాండ మూది,
హాయిగా బాడికొనుచుండు మంతదాక!''

అని వీడ్కోలు చెప్పి, ఒక్కమాటు 'ఆత్మాలోకము' చేసుకున్నారు:

''చేయి త్రిప్పితి వీవు, వాయి విప్పితి నేను-
పదములో భావంబు పొదలు దాక!
హెచ్చి పాడితి వీవు, మెచ్చి యాడితి నేను-
తలపులో రాగంబు మొలుచు దాక!
పంతగించితి వీవు, చెంత జేరితి నేను-
పట్టులో తాళంబు తట్టు దాక!
హుంకరించితి వీ, వహంకరించితి నేను-
సుకృతిలో గతి తలసూపు దాక!

---

* వేంకటరావుగారు పార్వతీశంగారిని 'పెద్దబావ' అని, చాగంటి శేషయ్యగారిని 'చిన్నబావ' అని అనేవారు

ఇరువు రెడముగా నున్నప్పు డీ విలాస
మిరువు రేకమై యున్నప్పు డింత యేల?
అందు నిందున్న తేజ మెందైన లేదె?
భరతకావ్యకళావేశ! పార్వతీశ!''

అంటూ పరియాచక మాడి, ఈ విధంగా తనకు 'ఆశ్వాసము' చెప్పుకొన్నారు

''నన్నయ్య గతిఁ గూర్చినాఁడ వింతియె కాదు,
తిక్కన్న యని నన్నుఁ దేర్చి నావు-
చోడునిమతిఁ గొనియాడి తింతియె కాదు,
సోమన్న యని నన్నుఁ జూచినావు-
పోతన్నవలె పాడఁబూని తింతియె కాదు,
శ్రీనాథుఁ డని నన్నుఁ జెప్పినావు-
పెద్దన్నకైవడి దిద్ది తింతియె కాదు,
సూరన్న యని నన్నుఁ జీరినావు-
భట్టు పోలిక లయతోడఁ బాడినావు,
చేమకూ రెంతొ రుచి యని చెప్పినావు,
ఎన్ని యేండ్లేగె! మన యేబదేండ్ల లోనె-
ప్రథిత కవితా కళావేశ! పార్వతీశ!''

అని 'పెద్దబావ'ని ప్రియమార, కరవుదీర సంభావించారు- వేంకట కవిరాజహంస

''ఎన్ని యేండ్లేగె! మన యేబదేండ్లలోనె-'' అని ఎంత బాగా అన్నారు!

1904లో, కల్పలతా పారితోషికము అందుకున్నాక, వేంకటరావుగారూ- పార్వతీశంగారూ ఒకరికొకరు పరిచితు లయారు

1909లో - తణుకులో - ఏర్పడింది వేంకటపార్వతీశ్వరకవుల జంట ఆ సంవత్సరమే ''అనుపమ'' అనే ఆధునిక పద్యకావ్యం విరచించారు వారు. అదే వారి ''చిత్రకథాసుధాలహరి''.

-సంపాదకుడు

III

## సినారె సన్నుతులు

అసలు ''భావసంకీర్తనము'' అన్న రచనకి అంకురార్పణ జరిగింది 1930 ప్రాంతాల అని సంపాదకుని మనవి. వేంకటరావుగారే, జేబులో ఇమిడే సైజు డైరీలో, ఆ పేరుతో 103 పద్యాలు రాసి పెట్టుకున్నారు. వేంకటపార్వతీశ్వర కవులు, వేరుపడి, ఎవరి రచనలు వారి పేరనే ప్రచురించుకుంటున్నా రప్పుడు ఆ ''భావసంకీర్తనము''ను తల్లావజ్ఝుల శివశంకర శాస్త్రిగారి పీఠికతో 1943 డిసెంబరులో వేంకటపార్వతీశ్వర కవుల పేర, ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్‌వారు,102 పద్యాల కావ్యంగా ప్రచురించారు. దానిని డా॥ సి. నారాయణ రెడ్డి ( 'సినారె' ) తమ ''ఆధునికాంధ్రకవిత్వము''లో 'భక్తికవిత్వం' కింద సమీక్షించారు. 'భావకవిత్వము. ఛందస్సు' అన్న శీర్షిక కింద ఆ కావ్యాన్ని ఈ విధంగా ప్రశంసించారు:

''సీస పద్యములను వచనగేయములుగా మలచుకొని అట్లే అచ్చు వేసి ఇంద్రజాలము చేసినవారు వెంకట పార్వతీశ్వర కవులు.* ఇంద్రజాల మెందు కంటి వనగా ఒకరు చెప్పేడి వరకు అవి సీసము లని స్ఫురించవు. వానిని రచించు నప్పుడే ఆ మెలకువ వారి కుండుటవలన ఆ పద్యములు 'ముమ్మూర్తులా' కమ్మని వచన గేయముల వలె సాగి పోవును. మచ్చునకు మొదటి పద్యము:

> నా భారతి తన మనసు వచ్చిన పసిపాపల గూడి
> తొక్కుపల్కులను బల్కుచున్నది.
> తన యీడు చిన్నిబిడ్డల జేరి
> పదముల బాడుచున్నది.

---

*భావసంకీర్తనము

తన చెలికత్తెల నెల్ల దగ్గఱ జేర్చి
యోమనగుంట లాడుచుఁ బ్రొద్దు గెంటుచున్నది.
ఎరవు బొమ్మలఁ దెచ్చి పెళ్లిళ్లలో
గుజ్జెనగూళ్లనుఁ గూర్చుచున్నది.
ఎప్పు డీ బాల భారతీదేవియే యనఁగ బలుకునో-
పరాత్పరు బొగడునో -
జగమ్మె బొమ్మరిల్లుగ నాడఁ గలుగునో
అప్పుడు పితామహుడే యయిపోదును ప్రభు!''*

''ఇందులో కొన్ని వచనకవిత'' అన్నారు కృష్ణశాస్త్రి.

శివశంకరులు తమ ''భావసంకీర్తన'' శతక పీఠికలో ఇలా అన్నారు: ''....సామాన్య దృష్టికి ఈ పుస్తకం ఛందోబద్ధ మనిపించదు. పద్య రచనా ప్రవీణులు కూడా ప్రథమ వీక్షణములో ఆంతర్యం అవగతం చేసుకోలేరు. ఇవి సీసపద్యా లని చెప్పినా, కావని వాదించినవా రున్నారు.

సీసము అని గ్రహించినా, నడకలో మడతపేచీలు తరుచుగా తగులుతవి.

తిక్కనాదుల సీసములో తికమక బాగా ఉన్నది. శ్రీనాథుని సిద్ధ లేఖినీ ప్రభావంచేత సీసం సాఫీ తేరి సువర్ణ మయిపోయింది. కొక్కొండ వెంకటరత్నశర్మ సీసము తక్కువ దనుకొని పక్షములు పెంచి వెండి బంగారాలు చేసినా, ఆ వెండి జర్మను వెండి వలెనూ, బంగారము కాకి బంగారము వలెనూ గౌరవం పొందలేక పోయింది.

వితత్కావ్యకర్తలు చిత్రరీతులలో సీసమును కరగబోసి భావ సంకీర్తనకు ఆకార ప్రకారాలు ఆపాదించారు.''

---

* ''ఆధునికాంధ్రకవిత్వము'' -ప్రథమ ముద్రణ (1967) - పుట 498

# వేంకటపార్వతీశ్వర రామాయణము

పిఠాపురం యువరాజావారు వేంకటపార్వతీశ్వరుల చేత రాయించిన "నిర్వచన రామాయణము"ను, జంటకవుల వారసులం, 1980-81 లో ప్రచురణ నిమిత్తం, ప్రతిఫలం కోరకుండా, శ్రీమత్తిరుమల తిరుపతి వేంకటేశ్వర స్వామి వారికి సమర్పించ వలసిన వారమయ్యాము. దానికి దారి తీసిన వ్యక్తి, ఆ రామాయణమును సాఫు రాసిన వాడును, దానిని పూరించినవాడును అయిన వోలేటి అచ్యుత రామచంద్ర మూర్తి పార్వతీశ కవిరాజహంస జ్యేష్ఠపుత్రుడు (ఇప్పుడు కీర్తిశేషుడు). అప్పుడు, వేంకటపార్వతీశ్వర రామాయణము అచ్చు పడుతుందనే ఆశకొద్దీ, వారి వారసులం ఒక్కొక్కళ్లమే అతగాణ్ణి అనుసరించాము.

తరవాత, 1987లో, టి టి డి. వారి ధర్మప్రచార గ్రంథపరంపరలో 327వ ప్రచురణగా 'బాలకాండము' వెలువడింది. అందులో పూరణప్రసక్తిగాని, పూరణకర్త ప్రస్తావనగాని లేవు! "నిర్వచన రామాయణము" 13,000 పద్య సంఖ్యగల మహా గ్రంథంగా వర్ణింప బడింది. శ్రీనివాస భక్తుడు వోలేటి అచ్యుత రామచంద్ర మూర్తి "కృతజ్ఞత" ప్రచురింప బడింది. అత డెవరో, ఏ సత్తాలో కృతజ్ఞత చెప్పుకుంటున్నాడో- ఆ పైన మేమీ లేదు అందులో. 1988లో 331వ ప్రచురణగా 'అయోధ్యా కాండము' అచ్చు పడి, అంతటితో "నిర్వచన రామాయణ" ప్రచురణ ఆగి పోయింది. ఎందువల్లనో టి.టి.డి. వారికే ఎరుక!

-సంపాదకుడు

